గుంటూరు విద్యాగోష్ఠి ప్రత్యేకసంచిక

# ఐక్య ఉపాధ్యాయ




సంపుటి 2 ★ సంచిక 10 అక్టోబరు 1976




### ఉద్యమ రథం

త్యాగాలే పెట్టుబడిగ
ప్రజాసేవె ధ్యేయంగా
అమరజీవి చెన్నుపాటి
ఆశయాన్ని సాధిస్తూ
ప్రాంతీయపు హద్దుబాపి
అంతరాల బుద్ది మాపి
అధ్యాపక జాతినంత
ఒక్కటిగా నడిపిస్తూ....
సాగుతోంది ప్రజారథం !
యు. టి. యఫ్. ఉద్యమరథం !

— శ్రీ జె. నరసింహమూర్తి.

రు. 2

ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక
The Largest Circulated Telugu Educational Monthly

CI

సంపాదక



# లేఖలు




## యన్. యఫ్. సి. ఇన్‌స్ట్రక్టర్ల రిట్రెంచ్‌మెంటు ఆర్డరు రద్దు చేయాలి

కేంద్రప్రభుత్వ నిర్ణయం ప్రకారము నవంబరు ఒకటవ తేదీ నుండి యన్.యఫ్.సి. ఇన్‌స్ట్రక్టర్లపోస్టులు రద్దగునని వారు సర్వీసు నుండి తొలగించబడుదురని ఆగస్టులో యన్.యఫ్.సి. ఇన్‌స్ట్రక్టర్లందరకు నోటీసులు జారీచేశారు. ఇది చాల అన్యాయం. 1956 లో విద్యార్థులలో క్రమశిక్షణ నెలకొనే నిమిత్తం కేంద్రప్రభుత్వం యన్.డి.యస్. అనే పేరుతో ఒక స్కీము పెట్టారు. 10 మాసముల ట్రైనింగు యిచ్చి ముఖ్యమైన కొన్ని హైస్కూళ్ళలో పోస్టు చేశారు. మన రాష్ట్రంలో ఏ.సి.పి. మరియు ఫిజికల్ ఎడ్యుకేషనల్ ట్రైనింగు యిచ్చారు. వీరిలో 15 సంవత్సరాలకు పైగా సర్వీసు చేసినవారున్నారు. యీ స్కీము టెంపరరీ అయినా యీ స్కీము రద్దయినపుడు ఏదైనా ఆధారము చూపుతామని హామీ ఇచ్చారు. కొన్ని రాష్ట్రాలలో పి.ఇ.టి.లుగా తీసుకొన్నారు కూడా. యన్.యఫ్.సి. ఇన్‌స్ట్రక్టర్లను రాష్ట్ర ప్రభుత్వము కొన్ని షరతులకులోబడి తీసుకొంటామన్నారు. ఆ షరతులు అంతగా అనుకూలమైనవి కానందున కొందరు స్టేకి కోర్టుకు వెళ్ళారు.

మొన్నటివరకు కేంద్ర ప్రభుత్వోద్యోగులుగా పరిగణించబడినా 3వ పే కమీషన్ స్కేల్సు వీరికి ఇవ్వబడలేదు. కేంద్రప్రభుత్వం దఫదఫాలుగా పెంచిన కరువుభత్యము కూడా ఇవ్వలేదు. చాలామంది రాష్ట్రప్రభుత్వం విలీనీకరణకు అంగీకరించారు. ఈ విషయమై వారి ప్రతినిధివర్గం రాష్ట్రప్రభుత్వ దృష్టికి డైరక్టరు ఆఫ్ స్కూల్సు ఎడ్యుకేషన్ దృష్టికి తమకు న్యాయం కలుగజేయమని విజ్ఞప్తి పత్రాలుకూడా యిచ్చారు. కాని యీమధ్య ప్రభుత్వం జారీచేసిన పై ఆర్డరువల్ల రాష్ట్రంలో వందలాది ఉద్యోగులు నిరుద్యోగులవుతారు. నలుబది సంవత్సరాలు పైబడిన వయస్సున్నవారు మరియొక ఉద్యోగం ఏ రకంగా పొందగలుగుతారు? వారి సంసారాలు ఎలాగు సాగుతాయి? వారు బ్రతికే మార్గమేమిటి?

పై పరిస్థితులన్నిటినీ ప్రభుత్వము మానవతా దృష్టితోనైనా ఆలోచించి వారిని ఆ స్కీములో కొనసాగించుటగాని మరే ఉద్యోగములోనైనా తీసుకొనుటగాని చేసి వారిని వీధులపాలు గాకుండా చేయగోరుచున్నాను.

పి. వి. సుబ్బరాజు
ఉపాధ్యాయుడు
రాష్ట్రయు.టి.యఫ్.

## పార్ట్‌టైము హిందీపండితులకు ముక్తిలేదా?

అనేక అప్పర్ ప్రైమరి స్కూళ్ళలో పదిపదిహేను సంవత్సరాలనుండి కొందరు పార్ట్‌టైము హిందీ పండితులుగా పనిచేస్తున్నారు. వారు ఎదుగుబొదుగులేని రు. 50 ల నామమాత్రపు జీతముతో నరకయాతన అనుభవిస్తున్నారు. ప్రతిసారీ కొత్త పోస్టులు వచ్చినపుడల్లా జిల్లా సెలక్షన్ కమిటీ కొత్తవారినే సెలక్టు చేయుచున్నదేగాని సర్వీసులోనున్నవారికి ప్రమోషన్ ఇచ్చుటలేదు. అర్హతలున్న ఇన్‌సర్వీసువారు త్రోసివేయబడటం ....

గ్రంథస్వీకారం:

**మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్**
వెల 5/-
ప్రతులకు:- జయంతి పబ్లికేషన్స్
ఏలూరురోడ్, విజయవాడ-2

* * *

**రామాయణ విషవృక్షం** 3వ భాగం (ఆఖరిభాగం)
రచన :- రంగనాయకమ్మ
వెల రూ 16/-
ప్రతులకు:- అరుణా పబ్లిషింగ్‌హౌస్
ఏలూరురోడ్ విజయవాడ-2

* * *

**గ్రహాంతర యాత్రికులు**
రచన :- బొల్లిముంత వాగేశ్వరరావు
వెల 5/-
ప్రతులకు:- అరుణోదయా పబ్లికేషన్స్
ఉప్పుబజారు, తెనాలి 522 201

అర్హతలులేని క్రొత్తవారు సెలెక్టు కావటంలోని పరమ రహస్యం ఆ దేవుడికే ఎరుక?

ఇప్పటికైనా ఈ అక్రమాన్ని అరికట్టి కొత్త పోస్టులలోను, జిల్లా పరిషత్తులోవచ్చు ఖాళీలలోను అర్హతలుగల పార్ట్‌టైము హిందీ పండితులనందరినీ సెలక్షన్‌తో నిమిత్తంలేకుండానియమించి న్యాయం కలిగించ గోరుచున్నాను.

— కవుతరపు వెంకటేశ్వర్లు, అయిలవరం
కార్యదర్శి, రేపల్లె తాలూకా పార్ట్‌టైమ్ హిందీ ఉపాధ్యాయసంఘం.

## పంచేవి పనికిరాని పుస్తకాలా!

గతంలో హైస్కూలు, కాలేజీ పాఠ్యగ్రంథాలు లేకపోవడం బ్లాక్‌లో కొనడం జరిగేది. కాని ఈ సంవత్సరం ఆ జాడ్యం ప్రాథమిక తరగతుల పాఠ్యగ్రంథాలకు వ్యాపించింది. ఇంతకన్న విశేషం సంక్షేమగిఫ్ట్ పుస్తకాలు ఎప్పటిలాగే విద్యార్థులంతా ఏదో విధంగా పుస్తకాలను కొనుక్కున్న తర్వాత ఈ గిఫ్ట్ పుస్తకాలిస్తున్నట్లే ఈ సంవత్సరం ఆగస్టు ఆఖరులో సెప్టెంబరులో ఎస్.డి.ఐ. ఆఫీసులద్వారా యివ్వటానికి ప్రయత్నాలు జరిగాయి. ఎప్పుడు యిస్తున్నా ఆ పుస్తకాలు ఎప్పటివి? ప్రస్తుతం అమలులోవున్న పాఠ్యగ్రంథాలా? కావు. ఎప్పుడో అమలులోవుండి యిప్పుడు లేనివి. మరి ఆ పుస్తకాలు ఎందుకు యిస్తున్నట్లు? ఉపయోగపడటానికా? కాదనేది స్పష్టమవుతూనేవుంది. కాకపోతే ఇన్ని పుస్తకాలు పంచామని చెప్పుకోవటానికి, విద్యార్థులను, తల్లిదండ్రులను మోసగించటానికీ ఉపయోగపడతాయి. కావున ఈ పుస్తకాలను గిఫ్ట్‌గా యిస్తే మరింతగందరగోళం ఏర్పడుతుందని కావున పనికిరాని పుస్తకాలను విద్యార్థుల కివ్వరాదని విజ్ఞప్తి చేస్తున్నాను.

— పి. శ్రీరాములు, ప్రధాన కార్య.
యు.టి.యఫ్. గన్నవరం

IKYA UPADHYAYA

Life Subscription 116-00
Yearly ,, 10-00
Single Copy 1-00

Ikya Upadhyaya
Akulavari Street,
Vijayawada-2

# ఐక్య ఉపాధ్యాయ

సంపాదక వర్గం :
మైనేని వెంకటరత్నం
(ప్రధాన సంపాదకుడు)
నాదెళ్ళ సీతారామాచారి
కోడూరు నారాయణరావు
అప్పారి వెంకటస్వామి
మోతుకూరు నరహరి

సంపుటి 2 అక్టోబరు 1976 సంచిక 10

## సంపాదకీయం

# సమైక్య ఉద్యమ నిర్మాణమే సమస్యా పరిష్కారానికి మార్గం

'ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్' ఆవిర్భవించిన దాదిగా విశాల ఐక్యోద్యమ ఆశయంతో ప్రాంతీయంగా చీలి పోయిన వారిని, మేనేజిమెంటు వారీగా కేటగిరి వారీగా చెదిరి ఉన్నవారిని ఒక్క బాటలో నడపటానికి, ఒక్క మాటతో నిల్పటానికి శత విధాలా ప్రయత్నించింది శక్తియుక్తులన్నిటినీ కేంద్రీకరించింది.

మాకు తెలుసు...
—అనైక్యత వల్ల ఆపద లెదురౌతాయని...
ఉన్న సౌకర్యాలెన్నో కోల్పోతామని...
లేని అరదులెన్నో వచ్చి పడతాయని !

అందుకే యే కార్యక్రమం ప్రారంభించినా సమైక్యతా కృషికి రాష్ట్రంలో ఉన్న అన్ని సంఘాలకూ విన్నపాలు పంపింది. స్నేహ హస్తంచాచింది. తనకు చేతనైన ప్రయత్నమంతా చేసింది.

గత రెండేళ్ళలో పీడకలల్లా ఎదురైన మన అనుభవాలు ఇన్నీ అన్నీ గావు,
—నిర్బంధ రిటైర్‌మెంట్ వర్తింపు, ఉద్యోగ విరమణ వయస్సు కుదింపు !
—ఇతరోద్యోగులకంటే ఒక స్టేజి ఎక్కువగా ఉండే సౌకర్యం రద్దు !
—నేటివిటీ జి. ఓ. అమలు !
—ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి పెంపుదల
—అశాస్త్రీయమైన పనిగంటల, బడి దినాల పెంపుదల భారం
—వివిధ మేనేజిమెంటుల నిరంకుశ చర్యల ఘోరం
అన్నిటికంటె ఆత్మగౌరవానికి ఆ ఘాతం కల్గించే వివరీత నిందారోపణలు

ఎన్ని కోల్పోయామో...మరెన్ని పిడుగుపాటుల్లా వచ్చి మీదపడ్డాయో లెక్కేలేదు ఈ విధంగా ఉపాధ్యాయులు అనేక సమస్యలతో సతమతమవటంతోపాటు, విద్యా వ్యవస్థ అనేకానేక దుర్గతులతో సంక్షోభంలో ఉంది. వీటి పరిష్కారాని కంటూ తీసుకొన్న చర్యలన్నీ సమస్యా పరిష్కారానికిగాక అసలుకే ఎసరుపెట్టే చర్యలుగా ఉన్నాయి.

ఈ స్థితిలో అందరూ సమిష్టిగా యీ విషయాలవల్ల కల్గిన అనర్థాలు ప్రభుత్వానికి వివరించి నచ్చ జెప్పి ఒప్పించటం ద్వారా విద్యారంగానికి ఎంతో మేలు ఒనగూడుతుంది. దీర్ఘకాలంగా ఉన్న అపరిష్కృతసమస్యలు పరిష్కరింపబడతాయి. అశాస్త్రీయ పద్ధతులు అరికట్టబడతాయి. విద్యారంగంలో ఆరోగ్యకర వాతావరణం ఏర్పడుతుంది.

అందుకే ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తన మూడవ జనరల్ కౌన్సిల్ తీర్మానాల ద్వారా, విద్యా గోష్ఠిద్వారా మళ్ళీ విజ్ఞప్తి చేస్తున్నది.

'ఉద్యమ సమైక్యతే సమస్యా పరిష్కారానికి మార్గం' అని

ఆంధ్రనాట ఉజ్జ్వల చరిత్రగలఉద్యమాలన్నీ తప్పక యీ పిలుపునందుకొంటాయనీ సమిష్టికార్యక్రమాలకు ముందుకు వస్తాయని, తద్వారా సమైక్య ఉద్యమానికి దోహదం చేస్తాయని మేము ఆశిస్తున్నాం, ఆహ్వానిస్తున్నాం.

# అపూర్వ ఉత్సాహ, ఉత్తేజాల్నిచ్చి చైతన్య ప్రదీప్తిచాటిన యు. టి. యఫ్.
# 3 వ నూతన రాష్ట్ర కౌన్సిల్ సమావేశాలు

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ 3వ నూతన రాష్ట్రకౌన్సిల్ సమావేశాలు గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూలులో సెప్టెంబరు 29 30 తేదీలలో అత్యంత ఉత్సాహ పూరిత వాతావరణంలో జరిగాయి. గుంటూరు జిల్లా యు. టి. యఫ్. కార్యకర్తలు ఆ సమావేశాల్ని దిగ్విజయం చేయటానికి నెల రోజులపాటు జిల్లాలో ప్రచార కార్యక్రమం నిర్వహించారు. ఉపాధ్యాయవర్గంలో అపూర్వ సంచలనం రేకెత్తించారు. పర్యవసానంగా జిల్లా ఉపాధ్యాయవర్గం శక్తియుక్తులా విరాళాలను అందించటమే గాకుండా వందలాదిగా సమావేశాలకు హాజరై చైతన్య స్థాయిలోను, త్యాగ సాంప్రదాయాలలోను తమకు తామే సాటి అనిపించుకొన్నారు.

సమావేశం జరిగిన రెండు రోజులూ ఆహ్వాన సంఘం ఉచిత భోజనవసతులు కల్పించింది, స్టాల్ గరల్స్ హైస్కూలు ప్రధానోపాధ్యాయిని, ఇతర సిబ్బంది ప్రతినిధులకు విడుదులు, మీటింగు హాలు మొదలగు సమస్త సౌకర్యాలు కల్పించి సమావేశాల దిగ్విజయానికి తోడ్పడ్డారు. ఆవరణ అంతటా తోరణాలతో, పట్టణ సెంటర్లలో బ్యానర్లతో విద్యాకేంద్రమైన గుంటూరు పట్టణంలో ఒక మహా సభ వాతావరణం ఏర్పడింది. మీటింగు హాలులో చుట్టూ ఉన్న వాల్ బోర్డులమీద విద్యారంగానికి చెందిన వివిధ సమస్యల్ని ప్రతిబింబపజేస్తూ నినాదాలు వ్రాయబడటంతో సమావేశానికి ప్రత్యేక శోభ ఏర్పడింది. 29 తెల్లవారే సరికి రాష్ట్రమంతటి నుండి వందలాది ప్రతినిధులు ప్రవాహంలా వచ్చి ఆవరణ తా నిండారు. వరంగల్లు నుండి స్పెషల్ బస్‌లో ప్రతినిధులు తరలి వచ్చారు. రాష్ట్రంలోని 16 జిల్లాలనుండి 600 మంది ప్రతినిధుల రాకతో సమావేశ పూర్వరంగం సిద్ధం చేయబడింది. వారిలో 50 మంది దాకా మహిళా ప్రతినిధులుండటం ప్రత్యేక విశేషం.



సెప్టెంబరు 29 ఉదయం గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారి శ్రీ వి. వసంతకుమార్ జాతీయజెండాను, యు.టి.యఫ్. ఉపాధ్యక్షులు శ్రీ నాదెళ్ళ సీతారామాచారి ఉద్యమజెండాను ఆవిష్కరించటంలో విద్యాగోష్ఠికి చెందినసభ ప్రారంభమయింది. జెండా ప్రతిష్టాపన సందర్భాన స్టాల్ గరల్స్ హైస్కూలు ఉపాధ్యాయినులు జాతీయగీతాలు గానం చేశారు. శ్రీ గంగిసెట్టి ఉద్యమ పతాక గేయాన్ని ఉత్తేజకరంగా పాడేరు.

విద్యాగోష్ఠికి శాసనమండలి సభ్యులు శ్రీ యం. జె. మాణిక్యారావు అధ్యక్షత వహించారు. యు.టి.యఫ్ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి వక్తల్ని పరిచయంచేసి వేదిక పైకి ఆహ్వానించారు. యు.టి.యఫ్ అధ్యక్షులు శ్రీ కె నారాయణరావు ప్రతినిధులకు విద్యావేత్తలకు స్వాగతంచెప్తూ "విద్యారంగ సంక్షోభస్థితిని వివరించి, దానికి తగిన పరిష్కారమార్గాలు సూచింపవలసిందిగా" కోరారు.



## అధ్యక్షోపన్యాసం

గోష్ఠి అధ్యక్ష స్థానం నుండి శ్రీ మాణిక్యరావు మాట్లాడుతూ 'నేడు దేశంలో ఆర్థిక రాజకీయ సంక్షోభం తీవ్రంగా ఉన్నదనీ, దాని ప్రభావమే విద్యారంగం మీద కూడా పడిందని చెప్తూ ఇలా వివరించారు.

సక్రమంగా నిర్వహింపబడే విద్యారంగం మీద దేశ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. భారతదేశ భవిష్యత్తు తీర్చిదిద్దటానికి లక్షలాది ఉపాధ్యాయులు పని చేస్తున్నారు. ఎప్పటికప్పుడు తాము నియమించిన కమీషన్ల సలహాలనే పాలకులు పాలించటం లేదు. కబుర్లకు ఆచరణకు పొంతన కుదరటం లేదు. చెడుగుకు ఉపాధ్యాయులే కారణమని చెప్పటం ఒక ఫేషన్ అయిపోయింది. ప్రభుత్వ విధానాల ఫలితంగా ఎదురైన దుష్ఫలితాల బాధ్యతను టీచర్లకు అంటగట్టి నిందలు మోపటం జరుగుతున్నది. గత సంవత్సర పరీక్షాఫలితాలు విద్యాస్థాయి పతనాన్ని సూచిస్తున్నవని... ఆ బాధ్యత కేవలం టీచర్లదేనని దుమారం లేవబడింది.

## విద్యాస్థాయి పడిపోయిందా ?

నిజంగా విద్యాస్థాయి పడిపోయిందా ? ప్రభుత్వమే

మోడరేషన్ తొలగించి కృత్రిమ ఫలితాలు చూపలేదా? మోడరేషన్ తొలగించటం. అదీ విద్యాసంవత్సరం చివర ప్రకటించటం న్యాయమేనా ? విద్యాసంవత్సర ప్రారంభంలో ఏ విధాన్నయినా ప్రకటింపకలదా ? ఇదంతా బాధ్యత తప్పించుకొనే విధానంకాదా? పరీక్షాఫలితాలు 1925 నుండి పరిశీలిస్తే విద్యాస్థాయి పడిపోలేదని తెలుస్తుంది. ప్రభుత్వమే మోడరేషన్ ద్వారా కృత్రిమ ఫలితాలు సృష్టించి గతకాలంలో అంకెలు ఎక్కువ చూపింది. ఇప్పుడేమో ఉపాధ్యాయుల్ని దూషించటానికా అన్నట్టు మోడరేషన్ తొలగించి తక్కువ ఫలితాలు చూపుతున్నది. చివరికి అబాధ్యతను ఉపాధ్యాయులపైమోపటం జరుగుతున్నది. ఉపాధ్యాయుల్లో తమ కర్తవ్యం సక్రమంగా నిర్వహింపనివారు పదిశాతం ఉండవచ్చు. వారుకూడా పంచాయితీరాజులతో తమచుట్టూ తిప్పుకోటానికి సృష్టించబడినవారే! వారి ద్వారానే నిజంగా ఉపాధ్యాయవర్గానికి, వృత్తికి అపఖ్యాతి వస్తున్నది.

## కొఠారి కమిషన్ చెప్పిందేమిటి ?

విద్యాస్థాయి పెంచటానికి కొఠారి కమిషన్ పనిరోజులు పెంచమన్నదని యీ సందర్భంలో ఒక వాదన తెస్తున్నారు. ఆ కమిషన్ అనేక అభ్యుదయకర విధానాలను సూచించింది. టీచర్స్ స్టేటస్ పెంచటానికి వివిధ సూచనల్ని చేసింది. ఉపాధ్యాయులకు మంచి స్కేలు ఇవ్వటంద్వారా సోషల్ స్టేటస్ పెంచాలని సూచించింది. దేశాభివృద్ధిని స్వయంగా చూసి ఉత్తేజం పొందటానికి రైల్వే కన్సెషన్లు యివ్వాలన్నది. ఏ మేనేజిమెంటులో ఉన్నా ఉపాధ్యాయులందరికీ ఒకేరకమైన సదుపాయాలు కలిగించాలన్నది. ఒకే అర్హతకు ఒకే స్కేలు ఇవ్వాలన్నది. రిటైరింగ్ వయోపరిమితి పెంచాలన్నది. ఆ సదుపాయాలన్నీ కలిగించి ఉపాధ్యాయ వర్గంతో సంప్రదించి అవసరమైతే పని దినాలు పెంచమన్నది తప్ప ఒక్క పనిదినాలే పెంచమనిచెప్పలేదు. ఆ అభ్యుదయకరవిధానాలనుఅమలుపరచటానికి బదులు నేడు మేనేజిమెంటుకొక విధానం అమలుపరచబడుతున్నది. వివక్షణలు పాటింపబడుతున్నవి. ప్రభుత్వోపాధ్యాయులకు గల సదుపాయాలు ఇతరోపాధ్యాయులకులేవు ఇంటి అద్దెలఅలవెన్సు, కుటుంబసంక్షేమపథకం, ఎయిడెడ్ టీచర్లకు వరించే ఆర్డర్లు జారీచేయ బడలేదు. పైగా వారికున్న రిటైర్మెంట్ సదుపాయం తొలగించబడింది. బదిలీ నిబంధనలు మార్చి నేటి వీటి జీవో జారీచేశారు. ఫలితంగా ఎంత గందరగోళంసృష్టింపబడిందో కళ్ళముందు చూస్తున్నాము. విమర్శలలోనే మన కార్యక్రమం పరిమితం కాగూడదు. సమస్యా పరిష్కారానికి శక్తివంతమైన ఉద్యమ నిర్మాణంతోపాటు ఇతరసంఘాల సహకారంతో సమైక్య ఉద్యమం ద్వారా కృషిచేయాలని ఆయన కోరేరు.

## వైస్ ఛాన్సలర్ శ్రీ బాలయ్యగారి ప్రసంగం

తర్వాత నాగార్జున యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ బాలయ్యగారు గోష్టిని ప్రారంభించారు. 30 సంవత్సరాల వారి అనుభవాలను వివరిస్తూ ఉపాధ్యాయులలో విద్యార్థులలో కొనసాగుతున్న మార్పులు వివరించారు.

విద్యార్థియొక్క నైతిక ప్రవర్తన క్రమపద్ధతిలో రూపొందటానికి ఉపాధ్యాయుడు కృషిచేయాలి. విద్యార్థి చదువు పై,



ప్రవర్తనపై కేంద్రీకరించాల్సిన దృష్టిని ఫ్యాషన్లపై, కేంద్రీకరించి కర్తవ్య నిర్వహణ నుండి ప్రక్కకు మరలుతున్నాడు. విద్యార్థిని నాయకుడిగా తయారు చేయవలసిన బాధ్యత మనపై వున్నది ఒకప్పుడు విద్యార్థి ఉపాధ్యాయుని చాల గౌరవముతో చూచేవాడు. ప్రధానోపాధ్యాయుడన్నా, ఉపాధ్యాయుడన్నా భయ భక్తులతో వుండేవారు. ఉపాధ్యాయుని నడవడిక, ఆచరణ, ఆలోచనాధోరణి విద్యార్థి మనోఫలకాలపైబడి వారిఆచరణకు తోడ్పడుతుంది. మార్పుచెందే సమాజములో ఉపాధ్యాయుని పాత్ర కీలకమైనది. బయటజరిగే ఘటనలు విద్యార్థి దృష్టి ఇతరత్రా మరలుటకు తోడ్పడుతోంది. ప్రస్తుతం కొనసాగేట్యూషన్ల విధానము అసంతృప్తికి దారితీసింది. విద్యాసంస్థల అధ్వర్యాన ట్యూషన్లు నిర్వహించి ఆ వచ్చే ఆదాయాన్ని ఉపాధ్యాయులకు పంచాలని చెప్పారు.

## శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించాలి

విద్యార్థికి ప్రత్యేక శిక్షణ అవసరము, విద్యావిధానం పెద్దల సలహాపైగాక నిపుణుల సంఘాన్ని ప్రభుత్వం నియమించాలి. కొనసాగేలోటుల అసలు కారణాలను సమగ్రంగా శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి భవిష్యత్తులో జరగకుండా వుండేటట్లు చేయాలి ప్రముఖమేధావుల సలహాలు ప్రభుత్వం స్వీకరించాలి. విద్యయొక్క లక్ష్యమేమిటో ప్రతివారు అవగాహన చేసుకోవాలి. ఉపాధ్యాయుడు ఒక విషయము బోధించాలంటే ఆ సబ్జక్టు పై పూర్తి అవగాహనవుండాలి.

పరీక్షా ఫలితాలు తగ్గటానికి కారణం పరిశీలించాలి. పై తరగతులకు పోవటానికి అర్హతలేని వారికి పాఠాలు బోధించాల్సి వస్తోంది. విద్యాస్థాయి తగ్గటానికి ప్రభుత్వము,సంఘము, తలిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు కూడ కారకులు. కేవలం ఉపాధ్యాయులను నిందించినందువల్ల లాభము లేదు. తలిదండ్రుల విద్యార్థుల ఉపాధ్యాయుల సలహాలు పరిగణలోనికి తీసుకొని నిపుణుల సంఘంచే పరిశీలన జేసి తగు మార్పులు చేయాలి ప్రభుత్వము విద్యాస్థాయి పతనానికి ఉపాధ్యాయులు కారణము అని ప్రచారము చేసే అపసవ్యపు ప్రభావము ఉపాధ్యాయులపై ప్రసరించు అవకాశమిస్తోంది.

మంచి విద్య అంటే ఏమిటి? అది ఏ స్థాయిలో ఎలాగుండాలి? ఉపాధ్యాయులకు విద్యార్థులకు వుండే సంబంధాలు- సమాజానికి వుపాధ్యాయునికుండాల్సిన సంబంధాలు, పాఠశాలలకు అన్ని హంగులు ఏర్పాటు చేయవలసిన అవసరం

సంఘంలో ఉపాధ్యాయుని స్టేటస్ ఎలాగు పెంచాలి, ఉపాధ్యాయుల దైన్య పరిస్థితులు వగైరా ఒక నిపుణుల కమిటీచే పరిశీలింపజేసి ఆ పరిశీలన రిపోర్టు నాధారంగా మార్పులు తీసుకురావాలని ఆయన వివరించారు.



అనంతరము శ్రీ కాత్రగడ్డ శర్సయ్యగారు 'విద్యాలయాలు-సమాజం' అన్న అంశంపై ప్రసంగిస్తూ పాఠశాలల వ్యవస్థ మాత్రమే విద్యా విజ్ఞానాలను ఇస్తుందనుకొనుట పొరపాటని ఇతర ప్రచార సాధనాలలోకూడా అభివృద్ధి పరచాలని కోరాడు. ప్రస్తుతం ధనవంతులు కట్నాలకోసం, పేదలు సర్టిఫికేట్ల కోసం, చదువుతున్నారు. యీ దృష్టిని విద్యార్థులనుండి మరల్చాలి. సమర్థత కేవలం పుస్తకాలద్వారానేగాక వ్యక్తులతోగల పరిచయాలద్వారా వస్తుంది. మీరు ఈ వ్యవస్థలో ఒక భాగం యీ వ్యవస్థ మారితేగాని సమాజం మారదు. యీ సమాజ మార్పుకు కృషి చేయుటద్వారానే మన పరిస్థితులు మారతాయి. అని ఆయన అన్నారు.

## సిలబస్ స్థాయి పెంపుకు తగు భౌతిక పరిస్థితులుండాలి

ఎ.సి. కాలేజీ లెక్చరర్ శ్రీ మోహనరావుగారు మాట్లాడుతూ విద్యారంగంలో శాస్త్రీయమైన పద్ధతిలో అర్థం చేసుకొన్నవారు తక్కువని అన్నారు.

ఇది జటిలమైన సమస్య. విద్యా విధానానికి స్పష్టమైన లక్ష్యంలేదు. ఇప్పుడు ఏర్పాటు చేసుకోవాలి. సిలబస్ స్థాయి పెంచుతున్నారు. దానికి భౌతికపరిస్థితులు సృష్టించరు. అధునాతన పరిస్థితులు గ్రహించాలి. ఉపాధ్యాయుని పనిభారము పెంచుతున్నారు ఉపాధ్యాయుని పరిశీలనాశక్తి, జ్ఞానాభివృద్ధికి ప్రభుత్వము కృషిచేయుటలో ప్రాధాన్యత నివ్వాలి. బోధనా పద్ధతిలో కూడా మార్పురావాలి. విషయాన్ని విద్యార్థికి సమకూర్చటానికి కృషిచేయాలి. శాస్త్రీయ దృక్పథముతో పరిశీలన జరిపి ఆచరించాలి. కూలంకషంగా చర్చించిన మీదటనే సిలబస్ విషయంగాని, పనిగంటలు, ఉపాధ్యాయ, విద్యార్థినిష్పత్తి, ఉపాధ్యాయుల పని పరిస్థితులు మున్నగునవి నిర్ణయించాలని అన్నారు.

పిదప శ్రీ పి. వి. శివయ్యగారు మాట్లాడుతూ వయస్సు వచ్చిన తర్వాతనే ఉపాధ్యాయునిలో పరిపక్వత ఉంటుంది. అనుభవమున్న ఉపాధ్యాయుడు విద్యార్థిని తీర్చిదిద్దుతాడు. అందువల్ల ఉపాధ్యాయుని వయోపరిమితి పెంచుట ద్వారా విద్యాస్థాయిని పెంచవచ్చునని చెప్పారు.

మధ్యాహ్నం సమావేశము శ్రీ యమ్ జె మాణిక్యారావుగారి అధ్యక్షతన జరిగింది. సమావేశ ప్రారంభములో శ్రీ డి. రామిరెడ్డిగారు సభలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తూ ప్రముఖులు పంపిన సందేశాలు చదివారు.

## వై. వి. సుబ్బారావుగారి ప్రసంగం

తర్వాత ఆలిండియా ప్రయిమరీ టీచర్స్ ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ వై. వి. సుబ్బారావుగారు ప్రసంగించారు. (వారి ప్రసంగ పాఠం ప్రత్యేకంగా యిస్తున్నాం.)



## విద్యార్జనలో ఆశయం ప్రధానం

హిందూ కాలేజీ లెక్చరర్ శ్రీ గిరిధరరావుగారు మాట్లాడుతూ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అన్ని సదుపాయాలు కల్పించాలని అన్నారు.

ప్రతి చర్యకు ఒక ఆశయం ఉండాలి. ఆశయంలేకుండా విద్య నార్జించడం కష్టం. జ్ఞానాన్ని విద్యార్థి మనస్సుకు పట్టించేటు చేయాలి. విద్యార్థి అట్టి విజ్ఞానాన్ని నిలుపుకునే శక్తి లేకపోతే సిలబస్ పెంచినా లాభంలేదు. పనిగంటలు పెంచుట ద్వారా విద్యాస్థాయి పెరుగుతుందనుట హాస్యాస్పదమని ఆయన అన్నారు.

## విద్యార్జనకు పౌష్టికాహారం తగు విశ్రాంతి అవసరం

విజయవాడ ప్రజావైద్యశాల డాక్టరు రామారావుగారు మాట్లాడుతూ విద్యాస్థాయి పెంపుదలకు విద్యార్థికి యిచ్చే పౌష్టికాహారమునకు సంబంధ ముందన్నారు. విద్యార్థికి చిన్న వయస్సులో ఎక్కువ విశ్రాంతి కావాలి. ఎక్కువసేపు పాఠాలు చెప్పినా అవగాహన చేసుకోలేడు. అందుకు అతని మనసు తట్టుకోలేదు అని అన్నారు.

## శ్రీ యం. మాధవరావుగారి ఉపన్యాసం

శాసనమండలి సభ్యులు శ్రీ యం. మాధవరావుగారు ప్రసంగంలో సమాజ పరిణామాన్ని పేర్కొంటూ ప్రభుత్వం తన ఆశయాలకనుగుణ్యంగా విద్యా విధానాన్ని రూపొందిస్తుందన్నారు. నేడు పెట్టుబడిదారీ విద్యా విధానం కొన



సాగుతుందన్నారు. సమాజానికి ఒనగూర్చే సదుపాయలనుబట్టి విద్యాస్థాయి వుంటుందని అన్నారు.

మనదేశంలో తయారైన వేలాది మేధావులు మన సమాజానికి సేవచేసే అవకాశం లేకందున ఇతర దేశాలకు వెళ్ళిపోతున్నారు, వారిని మేధావులుగా తయారు చేయడానికి కోట్లరూపాయిలు ఖర్చు పెట్టుతున్నామని అన్నారు.

ఉపాధ్యాయులు సంఘాలను నిర్మించుకొని తమ సమస్యలను పరిశీలించి వాటి పరిష్కారానికై కేంద్రీకరించి ఐక్యతతో పనిచేయాలని కోరారు.

## నిరక్షరాస్యత నిర్మూలించాలి

శ్రీ అయ్యంగార్ (గెజిటెడ్ ఆఫీసర్) మాట్లాడుతూ "నిరక్షరాస్యత నిర్మూలించాలనీ, వయోజన విద్యాప్రచారంతోపాటు విద్యాలయాల్లో ఉపాధ్యాయులు తమ శక్తియుక్తులన్నీ ఉపయోగించి విద్యార్థుల మనోఫలకాలలో హత్తుకుపోయేట్టు బోధనసాగించాలనీ విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్లు అందరూ కలిసికట్టుగా తమ కర్తవ్యాలను నిర్వహించాలని ప్రబోధించారు.

మొత్తంగోష్ఠిని సమీక్షిస్తూ ముగింపుమాటలుగా శ్రీయం. జె. మాణిక్యారావు తాము శాసనమండలి సభ్యులుగా చేసిన కృషిని వివరించి సమస్యల వెనుక ప్రజా ఉద్యమం లేకుండా ఏదీ పరిష్కారం కాదనీ, దానికై అన్ని ఉపాధ్యాయ సంఘాలు ఉమ్మడి కార్యక్రమం చేపట్టాలనీ, అందుకు యు. టి. యఫ్ చొరవ తీసుకొని ముందుకు పోవాలనీ కోరటంతో విద్యాగోష్ఠి కార్యక్రమం ముగిసింది.

అనంతరం యు టి యఫ్ కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి గోష్ఠి కార్యక్రమాన్ని దిగ్విజయం చేసిన విద్యావేత్తలందరికీ పేరు పేరున అభినందనలందించారు.

## టీచర్ల పనిగంటల, పనిదినాల హెచ్చింపు విద్యాభివృద్ధికి ఏమాత్రం తోడ్పడదు

### జి.ఓ ను ఉపసంహరించాలని యు. టి. యఫ్. జనరల్ కౌన్సిల్ విజ్ఞప్తి

రెండవరోజు కార్యక్రమంగా కౌన్సిల్ సమావేశం శ్రీ కె. నారాయణరావు అధ్యక్షతన ప్రారంభమయింది. మొదట దేశ, విదేశ ప్రముఖుల మరణాలకు సంతాపం వ్యక్తంజేస్తూ మౌనం పాటింపబడి శ్రద్ధాంజలి ఘటింపబడింది.

పిదప శ్రీ యన్. కొండయ్య (ఎడిటర్, ప్రాథమిక విద్య) సందేశాన్నందిస్తూ మనకు మనమే గౌరవం పెంచుకోవాలనీ, దానికి సంఘటితశక్తే మార్గమనీ, ఆత్మవిశ్వాసంతో మనం విద్యా సమస్యల్ని పరిష్కరించుకోవాలనీ ప్రబోధించి లక్ష్యాత్మక బోధనా విధానంగురించి వివరించారు.

శ్రీ బి. వసంతకుమార్ (డి. ఇ. ఓ) సందేశమిస్తూ 'ఉపాధ్యాయులు కష్టపడి పనిచేసి ప్రమాణాల్ని పెంచాలనీ, తాడికొండ రెసిడెన్షియల్ స్కూలును ఆదర్శంగా తీసుకోవాలని, సమస్యల్ని తమ దృష్టికి తెస్తే తప్పక పరిష్కరింపగలము'నీ అన్నారు.

శ్రీ వై.వి సుబ్బారావు (ప్రధాన కార్యదర్శి, ఆలిండియా టీచర్స్ ఫెడరేషన్) సమావేశాన్ని ప్రారంభిస్తూ దేశంలోని ఉపాధ్యాయ ఉద్యమాలను సమీక్షించారు.

పిదప ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి కార్యదర్శి నివేదికను, పత్రిక నివేదికను శ్రీ మైనేని వెంకటరత్నం సభకు సమర్పించారు. వివిధ జిల్లా శాఖల కార్యదర్శులు తమ తమ జిల్లాలలో జరిగిన కార్యకలాపాల రిపోర్టులను ప్రవేశపెట్టారు. శ్రీ టి. కొండాచారి సంఘానికీ, పత్రికకు చెందిన ఆర్థిక నివేదికలను ప్రవేశపెట్టారు. కార్యదర్శి రిపోర్టుపై జరిగిన చర్చలలో పదిహేను మంది ప్రతినిధులు పాల్గొన్నారు. చర్చల అనంతరం కొద్ది సవరణలతో రిపోర్టులు ఆమోదింపబడ్డాయి. తర్వాత ఉపాధ్యాయులకు చెందిన వివిధ సమస్యల్ని చర్చించి సమావేశం తీర్మానాలు చేసింది. నిబంధనావళికి సవరణలను శ్రీ డి. రామిరెడ్డి, సభ్యత్వ కాంపెయిన్ పత్రికా కాంపెయిన్ల నివేదికలను శ్రీ కె. భద్రయ్య, శ్రీ యం. నరహరిగార్లు ప్రవేశపెట్టారు.

## బహుమతి ప్రదానం

పత్రిక స్పెషల్, జనరల్ క్యాంపెయిన్లలో నెగ్గిన జిల్లాలకు, కార్యకర్తలకు శ్రీమతి ఎ. అనసూయ (కార్యవర్గ సభ్యురాలు) గారిచే బహుమతి ప్రదానం చేయబడింది. ఆ సందర్భంలో 20 పైగా జీవిత చందాలు సభలో ప్రకటించబడ్డాయి.

## ఎన్నికలు

అనంతరం రాష్ట్రసంఘ ఉపాధ్యక్షుడు శ్రీ పి. వి. సుబ్బరాజుగారి ఆధ్వర్యాన రాష్ట్రకార్యవర్గ ఎన్నికలు పత్రిక సంపాదక వర్గం ఎన్నికలు జరిగేయి.

(అధ్యక్షోపన్యాసం, వివిధ నివేదికలు, తీర్మానాలు, వివరాలు యీ సంచికలోనే ప్రత్యేకంగా ఇవ్వబడ్డాయి.)

## అభివందనలు

చివరికి రాష్ట్రకార్యదర్శిచే సమావేశాల దిగ్విజయానికి తోడ్పడిన వారందరికీ పేరుపేరునా అభివందనలందింపబడ్డాయి.

ఈ విధంగా నూతన రాష్ట్రకౌన్సిల్ సమావేశాలు పతాకావిష్కరణ మొదలు వందన సమర్పణవరకు నూతనోత్తేజాన్ని కలిగిస్తూ అపూర్వ క్రమశిక్షణతో కొనసాగినయ్ విద్యాగోష్ఠి ఉన్నతస్థాయిలో జరిగి ఆశించిన ఫలితాన్ని సమకూర్చింది.

చైతన్యం పొందిన కార్యకర్తలు ఇనుమడించిన ఉద్యమోత్సాహంతో దీక్షతో తమ తమ ప్రాంతాలకు తిరిగివెళ్లేరు.

# ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## 3 వ నూతన రాష్ట్ర జనరల్ కౌన్సిల్

## స్టాలు గరల్స్ హైస్కూలు, గుంటూరు

## 1976 సెప్టెంబరు 29, 30 తేదీలలో



# అధ్యక్షోపన్యాసము

ప్రియమైన సోదర కార్యకర్తలారా!

ఎంచుకున్న ఆశయాన్ని సాధించుటకు త్యాగశీలతతో, అపార కష్ట నష్టాల్ని సహితం భరించి ద్విగుణీకృతోత్సాహంతో ఉద్యమాన్ని విస్తృత ప్రాంతానికి వ్యాప్తిచేసి, ఉద్యమ వాణికి రాష్ట్రవ్యాప్త ప్రాచుర్యాన్ని కల్గించి సంఘానికి బలమైన పునాదులను అచిరకాలంలోనే స్థిరపర్చిన కార్యకర్తలారా మీకివే నా హార్దికాభివందనలు.

ఇబ్బడి ముబ్బడిగా ముంచుకొస్తున్న సంక్షోభాలలో ప్రత్యక్షంగా ఎదుర్కొంటున్న విద్యారంగ సంక్షోభాన్ని అధిగమించుటకు మార్గాన్వేషులై అపార ఆశావహులై పట్టుదలతో సభకరుదెంచిన ప్రతినిధులకు సుస్వాగతం.

## విద్యారంగ సంక్షోభం

దేశ జనాభాలో 70.55 శాతం నిరక్షరాస్యులు. ఆసియా ఖండంలో, నిరక్షరాస్యులలో మూడు వంతులు మన దేశంలోనే యున్నారు. విద్యాభ్యాసం మధ్యలోనే ఆపివేసే శాతం పెరుగుతూనేయుంది. ఒకటవ తరగతిలో చేరిన 100 మంది విద్యార్థులలో 8 మంది మాత్రమే 10 వ తరగతివరకు కొనసాగించుచున్నారు. చదువుకున్నవారికి ఉద్యోగం లభించక పోవడంవలన విద్యార్థులలో అశాంతి, నిరుత్సాహం ప్రబలుతున్నాయి. అధికశాతం విద్యార్థులు పరీక్షలలో కృతార్థులు కాలేకపోవుచున్నారు. విద్యారంగంకొరకు పెట్టుబడి ఖాతాలో కోతలు తరచుగా జరుగుతున్నాయి. 5 వ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో తొలిసారిగా చూపిన 3200 కోట్ల రూపాయలు ఇటీవలనే సవరించిన అంచనాల ప్రకారం 1284 కోట్ల రూపాయలకు తగ్గించబడింది. విద్యారంగ నిపుణుల అంచనాల ప్రకారం కనీసం 5500 కోట్ల రూపాయలు కేటాయించ బడవలసింది. చాలీచాలని జీతభత్యాలతో సతమతమగుచున్న ఉపాధ్యాయుల్లో నోట్ల ముమ్మరం వలన నిజవేతనాలు పడిపోయి, అసంతృప్తి పెల్లుబుకుతోంది. వయోజన విద్యారంగం పూర్తిగా నిర్లక్ష్యం చేయబడింది. ఉత్పాదన కృషిలో నైపుణ్యాన్ని, వేగాన్ని అభివృద్ధి చేసే వయోజన విద్యపట్లచూపుచున్న ఉపేక్ష జాతీయాభివృద్ధి రేటునే కుంటువర్చింది. స్వాతంత్ర్యానంతరం మూడు విద్యా కమీషన్లు నియమించవలసి రావడం, ఆ కమీషన్ల నిర్ణయాలు ఆచరణలో పెట్టకపోవడం విద్యారంగ సంక్షోభస్థాయిని చక్కగా విశదీకరించగలవు. కోట్లాది మంది ప్రజలు నిరక్షరాస్యులుగా ఒక వైపున కన్పడుచున్న సమయంలోనే మరొక వైపున శిక్షణపొందిన వేలాది మంది ఉపాధ్యాయులు లక్షలాది విద్యావంతులైననిరుద్యోగులు బజారుల్లో ఉద్యోగాన్వేషణార్థమై తిరుగాడుచున్న స్థితి విచిత్రం గాదా!

## అసంబద్ధ ఆరోపణలు

సంక్షోభానికి బాధ్యత వహించవలసిన పాలకవర్గం తన బాధ్యతను ఉపాధ్యాయులపై నెట్టడానికి ప్రయత్నిస్తున్నది. స్వగ్రామంలో ఉద్యోగం చేస్తున్నందువలన పాఠాలు సరిగా చెప్పడంలేదనీ, రాజకీయాలలో పాల్గొంటున్నారనీ, పరీక్షలలో కృతార్థులశాతం తగ్గిపోవడానికి కారణం ఉపాధ్యాయులేననీ, విద్యాసంవత్సరంలో పనిదినాలు పనిగంటలు చాల తక్కువగా వున్నాయనీ, హక్కులపైన జీతభత్యాల పెంపుదలపైన యున్న ఆసక్తి బాధ్యతా నిర్వహణలో లేదనీ, విద్యాస్థాయి రోజు రోజుకూ పడిపోవుచున్నదనీ మున్నగు ఆరోపణలు నిత్యమూ వింటూనే యున్నాము.

## వాస్తవ కారణాలు

మన విద్యావిధానం అశాస్త్రీయమైన ప్రాతిపదికపై ప్రజల ఆశలకు, ఆశయాలకు, అవసరాలకు సంబంధం లేనట్టిదిగా యున్నది. గనుల్లో, పనుల్లో, ఖార్ఖానాల్లో శ్రమిస్తున్న కోట్లాది ప్రజలకు విద్యకరవై ఉత్పాదనా కృషి కుంటుపడుచున్నది. లభిస్తున్న అవకాశాలు కొద్దిమందికి మాత్రమే అందుబాటులో వున్నాయి. వివిధ మేనేజిమెంట్ల క్రిందనున్న విద్యావ్యవస్థ ఒక క్రమ పద్ధతిలో నడవడం అనేది అసహజం కదా! విద్యావ్యయం జాతీయ ప్రాధాన్యత గలదిగా గుర్తించకపోవడం విద్యాహక్కు, పని హక్కు ప్రజల ప్రాథమిక హక్కులుగ రాజ్యాంగంలో పొందుపరచక పోవడం, నిరుద్యోగ భృతి కలిగించక పోవడం. విద్యను జీవనభృతి సంపాదించేది గాక పరీక్షలకు ఉపాంగంగా మార్చడం, తరగతిగదిలో నేర్చేవిద్య జీవితసమస్యలకు సంబంధం లేనిదిగా యుండడం, మాతృభాషకన్నా ఇంగ్లీషు భాషకు అధిక ప్రాధాన్యతనివ్వడం, పాఠ్యగ్రంథాల కొరత, పెనుభూతంలాగ కన్పించేపరీక్షలు, విద్యార్థులు, ఉపాధ్యాయులమధ్య వుండాల్సిన సత్సంబంధాల లోపం, పాతకాలపు అనుపయోగమైన బోధనా పద్ధతులు, విద్యావిధాన నిర్ణాయక పద్ధతులలో ఉపాధ్యాయులకు

పాత్ర లేకపోవడం, విద్యా లక్ష్యాన్ని ఏ మేరకు సాధించామన్న విషయాన్ని అసెస్‌మెంటు చేయుటకు తగిన యంత్రాంగం లేకపోవడం, వివిధ విద్యాదశలమధ్య సమన్వయం లేకపోవడం, జాతి అవసరాల కనుగుణ్యమైన జాతీయ విద్యా విధానం లేక పోవడం మొదలయినవి వాస్తవ కారణాలు కాగా, ఉపాధ్యాయులపై అకారణంగా నేరమారోపించడం సమంజసం గాదు.

## పని గంటలు, పని దినాల పెంపు

7వ తరగతి పదవ తరగతి పరీక్షా ఫలితాలు హీనంగా యున్నాయనీ, ఫలితాలస్థాయి పెంచడానికి కొఠారీ కమీషను సూచించిన 234 పనిదినాలకు గాను 240 పనిదినాలు, రోజుకు 6 పనిగంటలుగాను నిర్ణయిస్తూ ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం జి.ఓ.యమ్.యస్. నంబరు 749 విడుదల చేసింది. ఈ నిర్ణయం శాస్త్రీయ ప్రాతిపదికపై చేసినట్టిది కాదనీ, విద్యాభివృద్ధి కాక తద్ వ్యతిరేక ఫలితాన్నిస్తుందని మా యభిప్రాయం. ఆధునిక విద్యావిధానాన్ని ఈ దేశంలో ప్రవేశపెట్టినమెకాలే, ఆ నాడు ఇంగ్లండులో వారానికి అయిదున్నర రోజులు పనిదినాలుగ యున్నప్పటికి ఇక్కడి ఉష్ణమండల వాతావరణం పరిస్థితిని పరిగణనలోనికి తీసికొని రోజుకు నాలుగున్నర గంటలు వారానికి అయిదు రోజులు, సంవత్సరానికి 180 పనిదినాలుగను నిర్ణయించారు. స్వాతంత్ర్యానంతరం విద్యాభివృద్ధి వేగంగా సాధించాలని మన ప్రభుత్వం రోజుకు 5 గంటలు, వారానికి అయిదున్నర రోజులు, సంవత్సరానికి 200 పని దినాలుగను నిర్ణయించడం జరిగింది. అయినను ఫలితం శూన్యం. కాగా మరొక సారి రోజుకు అయిదున్నర గంటలు, సంవత్సరానికి 220 పని దినాలుగనూ నిర్ణయించారు: అయినా ఫలితం కన్పడుటలేదంటే పనిగంటలు, పనిదినాలు పెంచుకుపోవడం విద్యాభివృద్ధికి గీటు రాయిగాదని శాస్త్రీయంగా ఋజువు గావడంలేదా! కొఠారీ కమీషన్ నిర్ణయించింది సంవత్సరానికి 1200 గంటలు, 234 రోజులుకాగా ప్రభుత్వం రోజుకు 5½ గంటలు చొప్పున 220 రోజులుగా నిర్ణయించడం వలన మొత్తం పనిగంటలు 1210 అయినవి. అప్పటికే ఉపాధ్యాయుల్లో పెద్ద ఆందోళనవచ్చింది. మరిప్పుడు రోజుకు 6 గంటలు చొప్పున 240 రోజులుగా నిర్ణయించినపుడు సంవత్సరానికి 1440 గంటలు పని చేయ వలసి వస్తుంది. ఇది పూర్తిగా కొఠారీకమీషన్ సూచనకు విరుద్ధం. ఇక్కడ ఆలోచించవలసిన మరొక ముఖ్య విషయం విద్యారంగంలో కీలకపాత్రధారియైన విద్యార్థి మానసిక తత్వం దీనిని పూర్తిగా విస్మరించడం జరిగింది. ఇప్పటి పరిస్థితుల్లోనే సాయంత్రం ఆరు, ఏడు పిరియడ్లలో డ్రాయింగ్, క్రాఫ్టు, డ్రిల్, నాండిటెయిల్సు సబ్జక్టులు నిర్ణయించబడటం మనం చూస్తున్నాము మరిప్పుడు మరొక అరగంట పెంచి, చివరిగంటకు సూపర్‌వైజ్‌డ్ స్టడీ చేయించాలనడం ఆచరణ సాధ్యమా? ప్రాథమిక అప్పర్ ప్రైమరీ పాఠశాలలలో పిల్లలు రోజుకు 6 గంటలు మానసిక స్ట్రెయిన్‌కు తట్టుకోగలరా? ఈ విధమైన రెజిమెంటేషన్ వలన ఫలితం శూన్యంగాదా? ప్రాథమిక పాఠశాలల్లో 1:40, సెకండరీ పాఠశాలల్లో 1:60 ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిగా యున్నపుడు సెకండరీ ఉపాధ్యాయుడు వారానికి 60 కాంపోజిషన్లు, 60 ట్రాన్సులేషన్లు సబ్జక్టుకు వారానికి 360 అసైన్‌మెంట్లు, పాఠ్యాంశాల ప్రిపరేషన్, యూనిట్ లెసన్‌ప్లాన్లు, యూనిట్ పరీక్షలు తయారుచేసి నిర్వహించుట, పేపర్లు దిద్దు లోపాన్ని తెలిపే డయాగ్నసిస్ చేయ డానికి మరి వారానికి 48 గంటలకన్న ఎక్కువగనే శ్రమించ వలసి యున్నది. శారీరక శ్రమకే వారానికి 48 గంటలు పరిమితి కాగా మానసిక శ్రమకంటె ఎక్కువ గంటలు నిర్ణయించడం విద్యాభివృద్ధికే విధంగా తోడ్పడుతుంది?

## విద్యాస్థాయి పడిపోతుందా?

విద్యాస్థాయిని గురించి మాట్లాడేటప్పుడు (1) గతం కంటె విద్యా సిలబస్ స్థాయి పడిపోయిందా? (2) పొరుగు రాష్ట్రపు విద్యా సిలబస్ స్థాయికంటె మన స్థాయి తక్కువగా నున్నదా? (3) ఇతర దేశపు సిలబస్ స్థాయికంటె తక్కువగా నున్నదా? అని మూడు ప్రశ్నలు వేసికోవాల్సి వస్తుంది. మరి పరిశీలించినపుడు గతకాలపు సిలబస్ కంటె మనరాష్ట్ర సిలబస్ స్థాయి అధికమనీ నిర్వివాదాంశం. ఇతర దేశపు సిలబస్ కంటే మన దేశపు సిలబస్ స్థాయి తక్కువంటే ఆలోచించ వలసిన అంశము. పోనీ పరీక్షాఫలితాలు స్థాయి తగ్గిపోయిందా అంటే అదికూడా వాస్తవంగాదు. ఇటీవల పది సంవత్సరాల ఫలితాలను పరిశీలించినచో మోడరేషన్‌తో కూడిన ఫలితాలతో పోలిస్తే ఈ సంవత్సరపు ఫలితాలు కూడ అదే మోడరేషన్ కలిపి చూసినపుడు గతం కంటె తక్కువేమీ కావు. అయితే అభివృద్ధి పొందిన జిల్లాలకూ, వెనుకబడిన జిల్లాలకూ, అర్బన్ ఏరియాకూ, రూరల్ ఏరియాకూ, విద్యావంతులైన తల్లి దండ్రుల బిడ్డలకూ ఆర్థికంగా బలమైన కుటుంబాలలోని బిడ్డలకూ మధ్య పరీక్షా ఫలితాలలో తేడా కన్పడుతున్నమాట మాత్రంవాస్తవం. దీనికికారణంఎవరు? ఉపాధ్యాయులుమాత్రంమువ్వాటికీకాదు. 28 సంవత్సరాల పరిపాలనాంతరం గ్రామీణ ప్రాంతాలలో 74 శాతం మంది పట్టణ ప్రాంతాలలో 50 శాతము మంది దారిద్ర్యపుటంచుకు దిగువనున్నారని ఇటీవలనే సమాచార్ ఏజన్సీ ఇచ్చిన సమాచారము. అంటే భారత జనాభాలో 62 శాతం దారిద్ర్యపుటంచుకు దిగువన బ్రతుకు చున్నప్పుడు ఆ కుటుంబాల నుండి వచ్చే పిల్లల సాంఘిక, ఆర్థిక స్థాయి ప్రభావం వారి విద్యార్జనపై పడదా? అయిదవ పంచవర్ష ప్రణాళిక అంచనా ప్రకారం విద్యావయస్సుగల్గిన పిల్లలు 2362 మిలియన్లు అందులో 80 మిలియన్లు 4, 5 సంవత్సరాలలోపు వయస్సు గల్గినవారే. ఇందులో 80 శాతం పిల్లలు పౌష్టికాహార లోపానికిగురగుచున్నారు. 4,5 సంవత్సరాలవయస్సులో పౌష్టికాహారలోపం తరువాత వారి శారీరక, మానసిక పెరుగుదలపై చాల విషప్రభావం కల్గియుంటుందని అందుచేత పౌష్టికాహార సప్లయి స్కీము నొకదానిని చేపట్టాలనీ అందుకు నాందిగ 337 వేల మందికి పౌష్టికాహారాన్ని సప్లయిజేసేందుకు నిర్ణయం తీసుకోబడింది. ఇటీవలే సెప్టెంబరు 5 వ తేదీన మన రాజధానిలో ఉపాధ్యాయ దినోత్సవ సందర్భాన ప్రఖ్యాత శిశు వైద్య నిపుణుడు డాక్టర్ సుధాకరరావు మాట్లాడుతూ "ఈనాడు విద్యార్థుల్లో వచ్చేవ్యాధుల్లో 70శాతం పౌష్టికాహార లోపం వల్లనే" అని చెప్పారు. పౌష్టికాహార లోపం మానసికాభివృద్ధిపై కల్గించే ప్రభావం తప్పనిసరిగా పరీక్షా ఫలితాలపై యుంటుందనేది వివాదరహితం. ఈ పరిస్థితి కంతటికీ పాలక వర్గమే బాధ్యత వహించవలసి యున్నది.

## నేటివిటీ ఉత్తర్వు - మూకుమ్మడి బదిలీలు

నేటివిటీ ఉత్తర్వు అమలు చేయటంలో వచ్చే విష ఫలితాలను గురించి ముందుగానే మనం ఊహించినట్లు విద్యా వ్యవస్థను అస్తవ్యస్తం చేస్తూ, ఉపాధ్యాయుల్లో పెద్ద అశాంతిని, అలజడిని, ఆందోళనను కల్గించే విధంగా అన్ని ప్రాంతాలలోను వందలు, వేలసంఖ్యలో మూకుమ్మడి బదిలీలు జరిగాయి. 429 జీవో నిర్దేశించిన నియమాలన్నీ బాహాటంగా ఉల్లంఘించబడ్డాయి. ఉల్లంఘనలను సవరించమని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసినా ఇంతవరకు అక్రమ ట్రాన్స్‌ఫర్లు సరిదిద్ద బడలేదు. కొన్ని ప్రాంతాలలో ఖాళీలు పూర్తిచేయ బడలేదు. నూతన ప్రాంతాలలో ఇండ్లు దొరకక బదిలీ చేయబడ్డ ఉపాధ్యాయుల కుటుంబాలను తరలించలేదు. స్థిరనివాసంలేని ఉపాధ్యాయుడు ప్రశాంత మనస్కుడై పాఠ్యాంశాలను బోధించలేడు. మూకుమ్మడి బదిలీల ఫలితాలిలా వుండగా రాబోయే సంవత్సరం 7వ తరగతి, 10వ తరగతి పరీక్షా ఫలితాలెలాయుండవచ్చునో మనం ఊహించుకోగలం.

## లక్ష్యాల నిర్దేశన

ఇటీవలి ప్రకటన ప్రకారం, సబ్జక్టు టీచర్లకు, ప్రధానోపాధ్యాయునికి, గజెటెడ్ ఇన్స్పెక్టరుకు, జిల్లా విద్యాశాఖాధికారిగారికి సాధించవలసిన ఫలితాలపై కొన్ని లక్ష్యాలు నిర్దేశించబడతాయని, సాధించలేని చోట శిక్షణా చర్యలు తీసికొనబడతాయని ప్రకటించబడింది. ఇది చాల ప్రమాదకర దిశ వైపుకు మనల్ని నెట్టుతోంది. ఫలితాలు సాధించుటలో వైఫల్యానికి అనేకవిధాల అనేక శక్తులు, అనేక విద్యా విధానాలు, అశాస్త్రీయ పోకడలు, భౌతిక వసతుల లోపం, సమాజంలోని హెచ్చుతగ్గులు, దుర్భరదారిద్ర్యం మొదలైనవి ఎన్నో కారణాలు కాగా, ఉపాధ్యాయుల్ని, విద్యాశాఖాధికారుల్ని బాధ్యత వహించమనడం న్యాయంకాదు. హేతువాదయుక్తంగా అంతకన్నా కాదు. ఆంధ్రజ్యోతి సంపాదకీయం హెచ్చరించినట్లు అనేక అవినీతికర పద్ధతులు ఆచరణలోనికి రావడానికి మూలమగుతుంది. విద్యావిధానపు లోపాలను మొదట సవరించి జాతి లక్ష్యంవైపు విద్యావిధానం ముందుకుసాగేందుకు అందరికృషిని ఆహ్వానించాలి. తప్పకుండా మా సంఘం అందుకు కృషి చేస్తుంది.

## ఉద్యమ అనైక్యత

నేటివిటీ ఉత్తర్వు, నిర్బంధ రిటైర్‌మెంటుకు వ్యతిరేకంగా ఐక్యఉద్యమ నిర్మాణానికి మనం చాచిన స్నేహహస్తానికి ఎవరూ జవాబివ్వని స్థితిలో ఐక్యఉద్యమం సాధించిన ఫలితాలనుకూడ ఇటీవల మనం కోల్పోయిన విషయం మీ దృష్టికి తీసికొని రావడం ఉచితమని భావిస్తాను. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 60 సంవత్సరాలవరకు యున్న రిటైర్‌మెంటును 55 సంవత్సరాలకు తగ్గించడం, అక్టోబర్ తరువాత రిటైర్ అయ్యే ఉపాధ్యాయులను విద్యాసంవత్సరం చివరివరకూ కొనసాగించే సౌకర్యం రద్దు, ఇన్‌సర్వీసు టీచర్లకు ప్రైవేట్ బి యిడి. ట్రెయినింగ్ రద్దు, యమ్ యిడి వారికి అదనపు ఇంక్రిమెంట్ల సౌకర్యంరద్దు, అడ్వాన్సుడు ఇంక్రిమెంట్లు, హైయర్ సౌకర్యంరద్దు, పదవ తరగతి, ఇంటరు చదివిన వారికి సెకండరీగ్రేడ్ ట్రైనింగ్ పొందే అవకాశం రద్దు చేసి ఇంటరు సెకండు క్లాసులో ప్యాసయినవారికే ట్రైయినింగ్ అవకాశం కల్పించడం, యన్ జి ఓ ల కంటే ఒక ఇంక్రిమెంటు ఎక్కువస్థాయిలో జీతాలను నిర్ణయించిన పద్ధతి రద్దు ఇత్యాది సౌకర్యాలు అనేకం ఇటీవల కోల్పోయాము.

## సమైక్య ఉద్యమమే శరణ్యం

మనం చాచిన స్నేహ హస్తానికి బదులివ్వకపోయినా మరింత పట్టుదలతో సామాన్య ఉపాధ్యాయులకు విషయాన్ని విశదీకరించి వారి సహకారంతో ఇతర సంస్థల నాయకులపై ఒత్తిడి తెచ్చి సమైక్య ఉద్యమ నిర్మాణానికి మరింత బలమైన ప్రాతిపదికను ఏర్పరచడములో ఏ మేరకు మనం విజయాన్ని సాధించగలమో ఆ మేరకు మాత్రమే మన ఉద్యమం పటిష్ఠం కాగలదని మనవి చేస్తూ మనం మరింత చొరవతో కృషి చేయాలని, సమస్యలపై లోతైన చర్చలను సాగించి పరిష్కార మార్గాన్ని జాతిముందుంచి ప్రజలను చైతన్య పరచుటలో ముందుకు రావాలని విజ్ఞప్తి చేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

గుంటూరు — భవదీయుడు

30-9-76 — కోడూరు నారాయణరావు

అధ్యక్షులు

# కార్యదర్శి నివేదిక

## ( 1-8-75 నుండి 30-9-76 వరకు )

అధ్యక్షా !

కామ్రేడ్స్ ! !

అమరజీవి చెన్నుపాటి ఆశయాల్లను ముందుకు గొని పోతూ ఆంధ్ర, తెలంగాణా ప్రాంతపు అధ్యాపకులకు ఆశా జ్యోతిగా వర్ధిల్లుతున్న ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 3 వ నూతన కౌన్సిలుకు అరుదెంచిన కామందరకు స్వాగతం ! సుస్వాగతం ! !

తూర్పు రాయలసీమ ఉపాధ్యాయ నియోజకవర్గంలో మనము బలపర్చిన అభ్యర్థి మధురాంతకం మాధవరావు గారు ఉద్యమ విచ్ఛిన్నకుల నోడించి ఘన విజయం సాధించడం మన ఉద్యమానికే ఘనవిజయం.

ఈ కాలంలో అంతర్జాతీయంగా కొన్ని ముఖ్య ఘటనలు జరిగాయి. 117 సంవత్సరాల బానిస బంధాలు త్రెంచుకొని ఉత్తర దక్షిణ వియత్నాంలు 76 ఏప్రియల్ 25 న సమైక్య వియత్నాంగా ఏర్పడి సోషలిస్టు దిశలో ముందుకు పురోగమిస్తోంది.

కెనడా దేశపు మాంట్రియల్‌లో జరిగిన ఒలింపిక్ క్రీడలలో సోషలిస్టు దేశాలు అత్యధికపతకాలు గెలుచుకొని అపూర్వ విజయాన్ని సాధించాయి.

కొరియాలో అగ్ని రగల్చడానికి సామ్రాజ్యవాద దేశాలు ప్రయత్నించు తున్నాయి.

దక్షిణాఫ్రికాకు తోడు, ఇంగ్లాండులో కూడా జాతి విద్వేషం బుసలు కొడుతుంది.

అంతరిక్షంలో అమెరికా, రష్యాలు గ్రహాంతర యానాలతో ఖగోళరహస్యాలు ఛేదిస్తున్నాయి.

శాస్త్రజ్ఞులు కృత్రిమంగా జీనులను సృష్టించి అమీబా లాంటి ప్రాణి వాటిని జయప్రదంగా ప్రవేశ పెట్టగలిగారు.

దేశంలో అత్యవసరపరిస్థితివుంది. రాజ్యాంగానికి 44 వ సవరణ బిల్లు 59 అంశాలతో సెప్టెంబర్ 1 న పార్లమెంటులో ప్రవేశ పెట్టారు.

పాకిస్తాన్, చైనాతో తిరిగి దౌత్య సంబంధాలు ఏర్పడ్డాయి

రాష్ట్రంలో మరిరెండు విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి. విద్యావిధానంలో పని గంటలలో అనేక మార్పులు ప్రవేశ పెట్టబడ్డాయి

ఉపాధ్యాయులపై దాడి కేంద్రీకరింపబడి అనేక హక్కులు పూడబెరక బడ్డాయి. సాటి ఉద్యోగులకు వున్న హక్కులుకూడా వీరికిలేవు.

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఏర్పడిన కొద్ది కాలంలోనే తన కార్యక్రమాల ద్వారా, పత్రికా నిర్వహణద్వారా ఉపాధ్యాయుల పక్షాన నిలచి పనిచేసే ఏకైక పోరాటసంస్థగా ఉపాధ్యాయులచేత ఉద్యమాభి మానులచేత గుర్తింపబడి వారి ఆదరణ పొందింది.

13కోర్కెలు గల విజ్ఞప్తి పత్రాలు 10 వేల సంతకాలతో



శాసన సభలకు సమర్పించుటలోనూ, పది తక్షణ సమస్యలపై 15 వేలతో ముఖ్య మంత్రికి కార్డు కాంపెయిన్ నిర్వహించుటలోనూ, నేటివిటీ నిర్బంధ రిటైర్ మెంట్లు మొదలగు పది కోర్కెలతో ముఖ్యమంత్రికి 20 వేల సంతకాల విజ్ఞప్తి పత్రాలు పంపించుటలోనూ, 45సమస్యలతో పాఠశాలవిద్యాడైరక్టరుతో సమన్వయ సమావేశం జరువుటలోనూ పే కమిటీ అనామలీస్, అసంబద్ధాలపై సమగ్ర రిపోర్టు ప్రభుత్వానికి సమర్పించుటలోనూ ప్రతినెలా రాజధానిలో ఉపాధ్యాయ సమస్యలపై రాయబారాలు సాగించుటలోనూ సమస్యలపై కరస్పాండెన్సు లోను యు. టి. యఫ్. తన శక్తికొలది కృషిచేసి తన పేరు నిలుపుకొన్నది.

1975 ఆగస్టు 9, 10 తేదీలలో విజయవాడలో నూతన కౌన్సిల్ జరుపుకొని, అందు ఎన్నికయిన కార్యవర్గము ద్వారా యీ 13 నెలల కార్యకలాపాలు సాగించాము.

చరిత్రాత్మకమైన కార్డు కాంపెయిన్ 75 సెప్టెంబరు 24 నుండి 30 వరకు : ఉపాధ్యాయుల సమస్యలు సంవత్సరాల తరబడి పరిష్కరింప బడుటలేదు. సాటి ఉద్యోగులకుగల సౌకర్యాలు వీరికిలేవు. పెద్ద సానుభూతి తప్ప పెట్టింది ఏమీలేదు. ఈ పరిస్థితులలో మూగవోయిన గొంతులతో మూలిగేకంటే కార్డు కాంపెయిన్ ద్వారా ప్రభుత్వాన్ని కదిలించాలని యు. టి. యఫ్. పిలుపు యిచ్చింది.

ఈ క్రింది పది సమస్యలతో కార్డు కాంపెయిన్ సాగించబడింది. (1) డి.ఎ. మెర్జరు స్కేళ్ళు ఉపాధ్యాయులకు వర్తింప జేయాలి. (2) కరువుభత్యం కేంద్ర ఉద్యోగులతో సమానంగా యివ్వాలి. (3) అన్ని కేడర్లలోను సెలక్షన్ గ్రేడు పోస్టులు సృష్టించాలి. (4) 1969 నుండి లిబరలైజుడు పెన్షన్ అమలు జరపాలి. (5) కనీస పెంషన్ రూ 45/-లు ఉపాధ్యాయులకు కూడా వర్తింప జేయాలి. (6) 1968 పూర్వపు ఎరియర్సు చెల్లించాలి (7) ఏజన్సీ అలవెన్సు ఏజన్సీ ఉపాధ్యాయులందరికీ యివ్వాలి. (8) సరండరులీవు ఉపాధ్యాయులకుయివ్వాలి. (9) ఉపాధ్యాయుల బిడ్డలకు అలవెన్సులు యివ్వాలి. (10) విద్యా కన్సెషనుకు ఆదాయ పరిమితి పదివేలకు పెంచాలి.

దిక్కుతోచకవున్న ఉపాధ్యాయులు ఈ కార్యక్రమంలో ఒక్కుమ్మడిగా పాల్గొన్నారు. కొన్నిచోట్ల పంపిన కార్డులు చాలక అదనంగా ప్రింటు చేయించు కొన్నారు. ఒక్కొక్క

కార్డుపై 10, 15 మంది కూడా సంతకాలు చేసి పోస్టు చేసిన కార్డులు సెక్రటేరియట్ను తుఫానులా ముంచెత్తాయి. 15 వేల మంది ఉపాధ్యాయులు అలా తమ సమస్యలను పరిష్కరించమని ప్రశాంతంగా కోరారు.

ఈ కార్యక్రమం ఫలితంగా పై వాటిలో కొన్ని పరిష్కరింపబడ్డాయి. మరికొన్ని పరిశీలనలో వున్నాయి.

ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలు:- విజయవాడ, గుంటూరు పట్టణాలలో పని చేయుచున్న ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 15 శాతం ఇంటి అద్దె వెంటనే చెల్లించాలని, ఫేమిలీ బెనిఫిట్ ఫండు స్కీము అమలు జరపాలని, అన్ ఎయిడెడ్ పోస్టులకు గ్రాంటు రిలీజు చేయాలని మొ॥ సమస్యలపై 500 సంతకాలతో ప్రభుత్వానికి విజ్ఞప్తిపత్రం సమర్పించాం.

అలాగే దఫ దఫాలుగా జీతముల గ్రాంట్లు 43 శాతం డి.ఎ ఎరియర్స రీఫిక్సేషను గురించి కృషిచేశాం. కొన్ని పరిష్కారమైనా ముఖ్య సమస్యలు నేటికి పరిష్కారం కాలేదు.

కోఆర్డినేషన్ సమావేశాలు : ప్రభుత్వం ఉత్తర్వు ప్రకారం ప్రతి జిల్లా సమితి పట్టణాలలో రెగ్యులర్గా కోఆర్డినేషన్ సమావేశాలు జరపాలని అన్ని మేనేజిమెంట్లకు లెటర్సు పెట్టి కరస్పాండెన్సు జరుపగా ఒంగోలు, నెల్లూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, ఖమ్మం, వరంగల్లు మొదలగు జిల్లాలలో కోఆర్డినేషన్ సమావేశాలు జరిగాయి. మరి కొన్నిచోట్ల నేటికి జరుగలేదు. జరిగిన చోట్ల కూడ సమస్యలు అపరిష్కృతంగానే వున్నాయి.

## ఐక్యకార్యాచరణ–ముఖ్యమంత్రికివిజ్ఞప్తిపత్రములు

కార్డు కాంపెయిన్ సమైక్యంగా నిర్వహించుదామని నెం. 1297 తేదీ 18-9-75 న అన్ని సోదర సంఘాలకు లెటర్లు పెట్టాం. తిరిగి నిర్బంధ రిటైరుమెంటు నేటివిటీ ఉత్తర్వుల రద్దుకై కృషి సాగించుటకు కలసిరావలసినదిగా లెటరు నెం. 1490 తేదీ 1-12-75న లెటర్లు పెట్టాం. 4-12-75 న హైదరాబాదులో సంఘాలనాయకులను, ఉపాధ్యాయ ఎం.ఎల్.సిలను స్వయముగా కలిసి, చర్చలు సాగించాం. దఫ దఫాలుగా హైదరాబాదు వెళ్లి వారందరితో తిరిగి చర్చలు సాగించాం. సమావేశాలు పిలుస్తానన్నవారు సమైక్యంగా కృషి చేద్దామన్నవారు ఎవరూ కలిసి రాలేదు. నాల్గు నెలల దీర్ఘకాల నిరీక్షణ అనంతరం, మనమే ఒంటరిగా కార్యక్రమం చేపట్టాం.

ఈ క్రింది పది ప్రధాన కోర్కెలతో విజ్ఞప్తి పత్రాలపై ఉపాధ్యాయుల సంతకాలు చేయించి ముఖ్యమంత్రికి పంపించాలని నిర్ణయించాం.

1) నేటివిటీ ఉత్తర్వు రద్దుచేయాలి 2) నిర్బంధ రిటయిర్మెంటు ఉపాధ్యాయులకు వర్తింప చేయరాదు. 3) ఇన్ సర్వీసు బి యిడి లను వెంటనే అప్గ్రేడు చేసి ప్రమోషనులు యివ్వాలి. 4) ఎయిడెడ్ ఉపాధ్యాయులకు కుటుంబ సంక్షేమ పథకము వర్తింపచేయాలి. ఎయిడెడ్ ఉపాధ్యాయుల రీఫిక్సేషన్, ఇంటికద్దె చెల్లింపు రిటయిర్మెంటు వయస్సు ఎయిడెడ్ వారికి తిరిగి 60 సంవత్సరాలు పునరుద్ధరణ, 7) 1963 పూర్వపు ఎరియర్సు, 8) పే స్కేలు అనామలీస్ హయ్యర్స్టార్టు, ఇంటి అద్దె, ఏజన్సీ ఎలవెన్సు, తెలంగాణా సేఫ్గార్డుల వేతనాలు మొదలగునవి వెంటనే పరిష్కరించుట, 9) తాత్కాలిక ఉపాధ్యాయుల సర్వీసు క్రమబద్ధం చేయుట, 10) జూనియర్ కాలేజీ ఉపాధ్యాయుల సర్వీసు క్రమబద్ధం చేయుట.

పిలుపు ఒంటరిగా యిచ్చినా అన్నిరకాల ఉపాధ్యాయులు ఆదరణతో అందుకొన్నారు. ఆపద సమయంలో మన కార్యక్రమం వారికి కొంత ఊరటకల్గించింది. రాష్ట్ర వ్యాప్తంగా 20 వేల మందికిపైగా ఉపాధ్యాయులు యీ కార్యక్రమంలో పాల్గొని ఏప్రిల్ నెలాఖరుకు సంతకాలు చేయించి ముఖ్యమంత్రికి పంపించారు.

యిందు ఒకటి రెండు తప్ప మిగతా సమస్యలు అపరిష్కృతంగానే వున్నాయి. వాటి పరిష్కారానికి నిర్విరామకృషి చేయవలసివుంది.

## డి. ఎ. మెర్జరు స్కేళ్ళు – అనామలీస్

డి. ఎ. మెర్జరు స్కేళ్ళ జి. ఓ. వచ్చిన వెంటనే అందలి లోపములు అసంబద్ధాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చి పరిష్కరించవలసినదిగా కోరాం. అప్షన్ తేదీలలో మరికొంత వెసులుబాటు కలిగించాలని కోరాం. అదనపు యింక్రిమెంట్లు డ్యూటీ అలవెన్సులు, సాటి ప్రభుత్వోద్యోగులకు వేతనములు నిర్ణయించుటలో జరిగిన అసంబద్ధాలు తొలగించాలని ఉదాహరణతో సహా ప్రభుత్వం ముందుంచాం. 24-7-76 న జరిగిన కో ఆర్డినేషన్ సమావేశములో యీ విషయమై వివరమైన రిపోర్టు సమర్పించాం. నేటికి అవి పరిచేయుట జరుగలేదు. వాటి గురించి కృషి చేయవలసివున్నది.

## రాష్ట్రశాఖ పక్షాన రాయబారాలు

5-8-75 ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి విద్యాశాఖ డైరక్టరు ఫైనాన్సు కార్యదర్శి, పంచాయితీరాజ్ కార్యదర్శి, సోషల్ వెల్ఫేరు డైరక్టరు తదితరులను కలసి ఉపాధ్యాయ సమస్యపై రాయబారములు సాగించుట జరిగింది. లెటరు నెం. 1552/75 తేదీ 29-8-75 ప్రకారం సోషల్ వెల్ఫేరు డైరక్టరు అందరు జిల్లా సోషల్ వెల్ఫేరు ఆఫీసర్లకు సోషల్ వెల్ఫేరు ఉపాధ్యాయులను పర్మినెంటు చెయవలసినదిగా కోరిరి.

2-9-75న విద్యాశాఖ మంత్రిగార్కి టీచర్సుడే జెండాలు ఉపాధ్యాయులకు అంటగట్టరాదని కోరాం. 2-9-75 విద్యాశాఖ మంత్రిగారిని సాటి ఉద్యోగులకు అమలుజరిపే సౌకర్యాలయినా ఉపాధ్యాయులకు టీచర్సుడే నాడు అమలు జరిపించమని కోరాము.

1975 డిశంబరు 4, 5, 6, తేదీలలో హైదరాబాదులో ఉపాధ్యాయుల వివిధ సమస్యలపై రాయబారములు జరిపాము. పంచాయితీరాజ్ మంత్రి, విద్యాశాఖ డైరక్టరు, కార్యదర్శి, ట్రైబల్ వెల్ఫేరు డైరక్టరు, ట్రైబల్ వెల్ఫేరు గౌరవకార్యదర్శి గార్లను కలసి వివిధ సమస్యలపై చర్చలు సాగించితిమి.

ట్రయిబల్ వెల్ఫేరు ఉపాధ్యాయుల జీతాలు విడుదల చేయించుట, ఏజన్సీపాఠశాలలపోస్టులు కంటిన్యూ చేయించుట, బాల్వాడి టీచర్లకు సెకండరీ గ్రేడ్ స్కేలు కేంద్రానికి రికమెండు చేయించుట జరిగింది.

22-1-76 న రాజధానిలో రాష్ట్ర సంఘ పక్షాన విద్యా

శాఖ డైరక్టరు పంచాయితీరాజ్ కార్యదర్శి ఫైనాన్సు కార్య దర్శిగారలను కలిసితిమి అదనపు యింక్రిమెంట్లు, కొత్తగూడెం పాఠశాలల జీతాలు రాష్ట్ర కో ఆర్డి నేషన్ సమస్యల గురించి కృషి చేసితిమి.

7-3-76న హైదరాబాదులో పాఠశాలల విద్యాడైరక్టరు విద్యాశాఖకార్యదర్శి, ఆర్థికశాఖ కార్యదర్శి, మున్సిపల్ అడ్మి నిస్ట్రేషన్ డైరక్టరు మొ॥ వారిని కలిసి మునిసిపాలిటీలకు జీతముల గ్రాంటు రిలీజు గురించి ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతముల గురించి కృషి చేసితిమి.

1976 మార్చి 26 వరకు:- హైదరాబాదులో పాఠశాలల విద్యా డైరక్టరు మొ॥ వారిని కలిసి ఉపాధ్యాయుల సమస్య లపై రాయబారములు జరిపితిమి. కొత్తగూడెంలో ప్రభుత్వం స్వాధీనపరచుకున్న ఉపాధ్యాయుల జీతాలు గ్రాంటు గురించి ట్రయిబల్ వెల్ఫేరు ఉపాధ్యాయుల గ్రాంటు రిలీజు గురించి టి. యస్. యల్. సి. మార్కుల కన్సెషన్ ప్రకాశం, నెల్లూరు, కర్నూలు మొ॥ జిల్లాల సెలక్షన్ గ్రేడుపోస్టులు ప్రకాశం మొ॥ జిల్లాలలో రెగ్యులరైజేషన్సు విద్యాసంవత్సరము రిటయిరయిన వారిని కంటిన్యూ చేయుట గురించి మొదలగు విషయములపై కృషి చేసితిమి.

1976 మే 19, 20 తేదీలలో హైదరాబాదు ఫైనాన్సు కార్యదర్శి, విద్యాశాఖ కార్యదర్శి, పాఠశాల విద్యాడైరక్టరు, పరీక్షల కమీషనరు మొదలగు వారిని కలిసి ఉపాధ్యాయుల సమస్యలపై రాయబారము జరిపితిమి. పోస్టు గ్రాడ్యుయేట్లకు కూడా ఫిక్సేషనులో అదనపు యింక్రిమెంట్లు కలపాలని ఆదాయ పరిమితిని వెంటనే పెంచాలని 45 సమస్యలు పరిష్కరించాలని మొదలగు వాటి గురించి కృషి చేయడం జరిగింది.

## 23-7-76 పాఠశాల విద్యాడైరెక్టరుతో కో ఆర్డినేషన్

లోగడ మనం సమర్పించిన 45 సమస్యలపై సమగ్ర మినిట్సుతో పాఠశాల విద్యాడైరక్టరు 24-7-76న వారికార్యా లయంలో కోఆర్డి నేషన్ సమావేశము ఏర్పాటుచేశారు. ఉపా ధ్యాయ యం.యల్.సి.లు శ్రీ యమ్. జె మాణిక్యారావు, యమ్. మాధవరావు మన సంఘం పక్షాన ఆఫీసుబేరర్లు, కొన్ని జిల్లాల బాధ్యులు పాఠశాల విద్యాడైరెక్టరు ప్రైమరీ విద్యా డైరెక్టరు, డిప్యూటీడైరెక్టర్లు, సెక్షన్‌సూపరింటెండెంట్లు మొద లగు విద్యా శాఖాధికారులు పాల్గొనిరి.

45 సమస్యలపై సుదీర్ఘమైన చర్చలు జరిగినవి. మరి 25 తక్షణ సమస్యలపై మెమోరాండములు యివ్వగా చర్చించ బడినవి. మరియు ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి పెంపునలపై కూడ ప్రత్యేక మెమోరాండమ్ సమర్పించ బడింది. ఎయిడెడ్ పాఠశాలల్లో రిట్రెంచిమెంటు జరుపవద్దని ప్రభుత్వ ఉత్తర్వులు యిస్తామని, ఏజెన్సీ అలవెన్సు వెంటనే అమలు జరుపుతామని కంటింజెంటు రేట్లు పెంచుతామని 12-12-76 నుండి సెకండరీ గ్రేడు టీచర్లందరకు అప్ గ్రేడుకు పుత్తర్వులిస్తామని మొద లగు విషయములు వెంటనే పరిష్కారిస్తామని చెప్పిరి. మిగిలిన సమస్యలు కూడ పరిష్కరించి తగు పుత్తర్వులు యిస్తామని చెప్పిరి.

24-8-76 హైదరాబాదులో రాయబారములు జరుప బడినవి. పాఠశాల విద్యా డైరక్టరు ప్రయిమరీ విద్యాడైరక్టరు, స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డు అధికారులు హైదరాబాదు జిల్లా కలక్టరు మొదలగు వారిని కలిసి ఉపాధ్యాయుల సమస్యలపై మెమోరాండములు సమర్పించుట జరిగింది. అన్ ఎయిడెడ్ పోస్టుల జీతాలు, గ్రేడు 1 హిందీ పండితుల జీతాలు విచ్చల విడి బదిలీలు హైదరాబాదు జిల్లా పరిషత్ సమస్యలు, మోతు గూడెం ప్రాజెక్టు ఏరియా ఉపాధ్యాయుల రెగ్యులరైజేషన్ గురించి కృషి చేయుట జరిగింది. పై రాయబారములన్నింటి లోను యం. జె. మాణిక్యారావు గారి సహకారానికి కృతజ్ఞత తెల్పుచున్నాము.

## ముమ్మిడివరం సమితి ధర్నా - సమస్యలు

తూ. గో. జిల్లా ముమ్మిడివరం సమితిలో శ్రీ యమ్. నాగేంద్రరావు బదిలీ సందర్భముగా ధర్నా నోటీసు యిచ్చుట జరిగింది; కలక్టరు పిలుపుపై రాజీ చేసుకొన్నారు, శ్రీ వి సూర్య నారాయణరాజు (జిల్లా ప్రధాన కార్యదర్శి) గారిని పోలీసులు మీసాక్రింద 26-11-75 న అరెస్టు చేసిరి. బెయిలు కూడ నిరాకరించిరి. నాలుగు నెలలు జైలు నిర్బంధం తరువాత శ్రీ రాజు నిర్దోషిగా 1-4-76 న విడుదల అయిరి. కక్ష కట్టిన మేనేజిమెంటు అమలాపురం తాలూకా ఉద్యమ నిర్మాత శ్రీ కె. గంగిశెట్టిగారిని అకారణముగా నిర్బంధ రిటయిర్‌మెంటు చేసిరి.కార్యకర్తలను విచ్చలవిడిబదిలీలకు గురిచేశారు సమితిలో భయంకర వాతావరణము కల్గించారు. చివరకు యమ్ నాగేంద్ర రావును విశాఖ జిల్లా సరెండరు చేశారు. నాగేంద్రరావుచేసిన నేరమల్లా తనకు రావలసిన జీతము నకు కోర్టుకు వెళ్ళడమే.

## చెన్నుపాటి వర్ధంతి సభలు

అమరజీవి చెన్నుపాటి 8వ వర్ధంతి సభలు డిశంబరు9నుండి 15వరకు రాష్ట్రవ్యాప్తంగా వారము రోజులు జరిపి ఆ మహా నీయునికి శ్రద్ధాంజలి ఘటించాం. విజయవాడ, మంగళగిరి, సత్తెనపల్లి, పాలకొల్లు, అమలాపురం, పరుచూరు, సింగరాయ కొండ, వరంగల్లు, గుడూరు, పెదపవని, దొడ్డిపట్ల, కొల్లూరు, రాజమండ్రి, రామవరం, తెల్లప్రోలు, విస్సన్నపేట మొదలగు ప్రాంతాలలో రాష్ట్రవ్యాప్తంగా వర్ధంతి సభలు జరిగాయి.

ఉజ్వలమైన ఉద్యమ క్లాసులు : ఉద్యమ చరిత్రలో ఉజ్వలఘట్టం యీ సంవత్సరం మే నెలలో జరిగిన ఉద్యమ క్లాసులు. అవి కార్యకర్తలలో సవ్యచైతన్య ప్రదీప్తిని కలిగించి సమస్యలపై అవగాహన కలిగించి సమరశీల సంస్థ ప్రాదుర్భా వానికి పునాదులు వేశాయి. ఉద్యమ క్లాసులు యీ క్రింది తేదీలలో జరిగాయి.

1. రేవేంద్రపాడు :- కృష్ణా, గుంటూరు జిల్లాలకు 76 మే 8, 9, 10.

2 బుచ్చిరెడ్డిపాలెం: నెల్లూరు,ప్రకాశం 76 మే10 11,12

3. భీమవరం : శ్రీకాకుళం, విశాఖ, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు 76 మే 12, 13, 14.

4 పొనుగోడు:-తెలంగాణా అన్నిజిల్లాలకు 76 మే 16 17 క్లాసులకు మొత్తం 323 మంది హాజరయిరి. జిల్లాల వారీగా శ్రీకాకుళం 1, విశాఖ 4, తూ.గో. 45, ప.గో. 101, కృష్ణా 20

గుంటూరు 50 ప్రకాశమ్ 10, నెల్లూరు 40, ఖమ్మం 20, నల్గొండ9, వరంగల్లు 12, మహబూబ్ నగర్ 5, హైదరాబాద్4, నిజాంబాద్ 3

ఈ క్రింది పాఠ్యాంశాలు చెప్పబడ్డాయి.

1. ప్రస్తుత విద్యావిధానం-ప్రత్యామ్నాయ విద్యా విధానం శ్రీ మైనేని వెంకటరత్నం.
2. రిటయిరు మెంటు సౌకర్యాలు - పెన్షన్ ఫారాలు శ్రీ డి. రామిరెడ్డి
3. ఫండ మెంటల్ రూల్సు:-శ్రీ జి. వరసింహారావు.
4. టి ఎ రూల్సు లీవురూల్సు :-శ్రీ జి. లక్ష్మయ్య.
5. అకౌంటింగు,-ఆడిటింగు, శ్రీ కొండాచారి.
6. ఉద్యమ చరిత్ర:-శ్రీ ఎ వెంకటస్వామి.
7. సమాజం-ఉపాధ్యాయుడు:-శ్రీ కె.నారాయణరావు.

ఒకవైపు తూర్పురాయలసీమ ఎన్నికలు మరోవైపునూతన నిర్మాణం పని ఒత్తిడిలో తలమున్కలుగావున్నా, ఏనాటినుంచో కలలుగానే వుండిపోయిన ఉద్యమ క్లాసుల నిర్వహణ కార్య రూపం దాల్చేసరికి కార్యకర్తలు ఉత్సాహంతో కదిలి అపూర్వ మైన రీతిలో ఏర్పాట్లు జరిగాయి. ఉపాధ్యాయుల ఉద్యమాభి మానుల సహకారంతో ఉచిత భోజనాలు ఏర్పాట్లు చేయ బడ్డాయి. చక్కని వసతి సౌకర్యాలు కల్పించబడ్డాయి. మండు టెండలు దూరాభారాలు మరచిపోయి అందరూ క్లాసులు జయ ప్రదం అయ్యేందుకు సహకరించారు.

మొత్తం పై ఉద్యమ క్లాసులు కార్యకర్తలలో ఉత్తేజం సమస్యలపై అవగాహన కల్పించి సమైక్య ఉద్యమానికి సజీవ చిహ్నంగా నూతన చరిత్ర సృష్టించింది. ఉద్యమ క్లాసుల జయప్రదానికి సహకరించిన కార్యకర్తలకు ఉద్యమాభిమానులకు ధన్యవాదాలు.

## విద్యాబిల్లు - జాయింటు సెలక్టు కమిటీ

ఉపాధ్యాయ సంఘాల ఆందోళన ఫలితంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము విద్యాబిల్లునుశాసనసభలోప్రవేశ పెట్టింది. అయితే మనం ఆశించినదానికి అనుగుణంగా బిల్లు లేదు. దానిలో మార్పులు చేర్పులు చేయించుకో వలసిన అవసరం వుంది. 17 అధ్యాయాలు, 106 నిబంధనలు మన సంఘం పూర్తిగా పరిశీలించి 76 మే, జూన్ నెలలో రాష్ట్రంలో పర్యటించుచున్న జాయింటు సెలక్టు కమిటీకి నివేదిక సమర్పించాలని యు. టి. యఫ్. నిర్ణయించింది.

అందుకనుగుణంగా యీ క్రింది తేదీలలో మనంకమిటీని కలిసి నివేదికలు సమర్పించాము.

20-5-76 హైదరాబాదులో శ్రీ పి. జ్ఞానేశ్వర్, పట్టణ శాఖ కార్యదర్శి.

3-6-76 విశాఖపట్టణం శ్రీ పి. బి. ముత్తారావు.

5-6-76 విజయవాడ శ్రీ ఎ. వెంకటస్వామి, ఇతరులు

6-6-76 గుంటూరులో శ్రీ టి. అంజిరెడ్డి.

మనం ప్రధానంగా 20 అంశాలు కమిటీ ముందువుంచి, పరిశీలించాలని కోరాం. (1) బిల్లులో ఆశయములు లక్ష్యములు చేర్చాలని (2)విద్యాసంస్థలన్నీ ఒకే మేనేజ్ మెంటు అనగా ప్రభుత్వపరంగా నిర్వహింపబడాలని (3) మతవిద్యకు అవకాశం తొలగించబడాలని (4) రాష్ట్రమంతా ఒకే సారి అమలు జరపాలని (5) విద్యాగ్రాంటు కమీషను ప్రాథమిక సెకండరీ రంగాలకు ఏర్పరచాలని (6) అనిబద్ధ విద్య వయోజనులకే అమలు జరపాలని(7)విద్యార్థికి తిండి, బట్ట పుస్తకాలు కల్పించాలని అప్పుడే విద్యార్థి తండ్రి హాజరుకు బాధ్యత వహిస్తాడని (8)ఒరియంటేషన్ కోర్సులు ఉపాధ్యాయులందరికీ కల్పించాలని (9) ప్రతి గ్రామంలో పాఠశాలలు స్థాపించాలని (10) ఎన్ ఎయిడెడ్ పాఠశాలలలో పోస్టులకు గ్రాంటు రిలీజు చేయాలని (11) మాతృభాషద్వారా విద్యాబోధ జరపాలని (12) పబ్లిక్ పాఠశాలలు రద్దు చేయాలని (13) ఎయిడెడ్ పాఠశాలలను పూర్తి సిబ్బందితో స్వాధీనం చేసుకోవాలని (14) స్వాధీన పాఠశాలల ఉపాధ్యాయుల మొత్తం సర్వీసు తీసుకోవాలని (15) పదివేల సభ్యత్వమున్న అన్ని ఉపాధ్యాయ సంస్థలను గుర్తించాలని (16) బిల్లునందలి కమిటీలలో ఉపాధ్యాయ సంఘాలన్నింటికి ప్రాతినిధ్యం వుండాలని (17) నియమ నిబంధనల తయారులో ఉపాధ్యాయ సంఘాలకు స్థానముండాలని (18) విద్యార్థి ఉపాధ్యాయ నిష్పత్తి ప్రాథమిక 1:20 సెకండరీ 1:30 కాలేజీ 1:40 గా వుండాలని (19) రిటయిర్ మెంటు వయస్సు 60 గా వుండాలని (20) బాలికా విద్యకు ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పాలని, కమిటీ ఎదుట యీ విషయాలు వివరించితిమి అయితే కమిటీ రిపోర్టు శాసనసభకు సమర్పించ బడలేదు.

## తూర్పురాయలసీమ ఉపాధ్యాయ యం. యల్. సి. ఎన్నికలు

తూర్పు రాయలసీమ ఉపాధ్యాయ నియోజకవర్గంనుండి పోటీ చేయుటకు మనం నిర్ణయించు కొన్నాం. ఓటర్లను చేర్పించేఫారాలు కరపత్రాలు అన్ని పాఠశాలలకు పంపించాం. గూడూరులో జరిగిననెల్లూరుజిల్లాశాఖ అభ్యర్థినిపెట్టాలనినిర్ణయించింది. రాష్ట్ర సంఘం అభ్యర్థి విషయమైపరిశీలించింది. మనకు యిద్దరినుండి దరఖాస్తులు బలపర్చమని వచ్చాయి. వారు ఉద్యమంతో సంబంధములేని వ్యక్తులు, 76 మార్చి 21 న నెల్లూరు జిల్లా కార్యవర్గంలో మనం అభ్యర్థిగా శ్రీ యం. మాధవరావు (జవహరు భారతి కావలి)గారిని బలపరుచుటకు నిర్ణయించాం.

అప్పటికే 5 గురు అభ్యర్థులు రంగంలో వున్నారు. ప్రచారం ఉధృతస్థాయిలో సాగించుచున్నారు. మనంప్రచారం కూడా ఏప్రియల్ లో కొంతకాలం, జూన్ 20 నుండి ఉధృతంగా సాగించాం. అనుకున్నట్లు మనకేడరు అంతా మొదట కదలలేదు. తర్వాత తర్వాత ప్రచారం ఊపునందుకున్నది.

శ్రీ మాధవరావుగారి మంచితనం ఆయన గత చరిత్ర ఆయన మిత్రబృందం సహాయ సహకారాలు విజయాని కెంతో తోడ్పడినాయి.

శ్రీ ఎ. వెంకటస్వామి, కె తిరుపాలుగారు నెల్లూరు జిల్లాలో మొత్తం కేడరును కదిపి ఎన్నికల కాంపెయిన్ మంచి ఉధృత స్థాయిలో నడిపారు. ఆలస్యంగా కదిలినా నెల్లూరుజిల్లా క్యాడర్ ఉవ్వెత్తున లేచి తరంగంలా కదిలి విజృంభించి నిద్రాహారాలు మాని చేశారు.

చిత్తూరు జిల్లాలో మొదట్లో శ్రీ కె. నారాయణరావు, శ్రీ డి. రామిరెడ్డిగార్లు పర్యటించి వచ్చారు. తర్వాత డి.రామి

రెడ్డి, మైనేని వెంకటరత్నంగారలు చిత్తూరు జిల్లాకు బాధ్యత వహించి కాంపెయిన్ జయప్రదంగా నడిపారు.

శ్రీయుతులు మక్కెన కోటయ్య, యమ్. వెంకట్రామయ్య, యమ్ గోపాలరావుగార్లు కేంద్ర ఎన్నికల కార్యాలయానికి బాధ్యత వహించి నిర్విరామ కృషి చేశారు.

ఇతర జిల్లాల నుండి వచ్చిన కార్యకర్తలు మొత్తం చిత్తూరు ఎన్నికలకే కేటాయించబడ్డారు.

శ్రీ యన్. శాంసన్ (ప్రకాశం), శ్రీ ఆర్. రాఘవయ్య (ఖమ్మం), శ్రీ వి. శ్రీరామమూర్తి (ప.గో), శ్రీ కె భద్రయ్య (వరంగల్), శ్రీ పి. సత్యనారాయణరాజు (ప గో), శ్రీయుతులు కె. నారాయణరావు, యన్. వి. బసవయ్య, టి. అంజిరెడ్డి, యం. రాయన్న, వై యల్. నారాయణగారలు (గుంటూరు జిల్లా) చిత్తూరు జిల్లాలలోని ఉపాధ్యాయుల విద్యార్థుల సహకారంతో వివిధ ప్రాంతాలలో ఎన్నికలు పూర్తి అయ్యేవరకు వుండి మన అభ్యర్థి విజయానికి తోడ్పడ్డారు. నెల్లూరు జిల్లాలో మన ఉద్యమం బలంగావుంది. అన్ని ప్రాంతాలకు పోయి మన వాణిని వినిపించాం. మన సంఘ కార్యకలాపాలు ఉపాధ్యాయులను ఆకర్షించాయి.

అసలు నిర్మాణమేలేని చిత్తూరు జిల్లాకు ఒంటరిగా కష్టనష్టాలతో మన కార్యకర్తలు పోయారు. యు. టి. యఫ్. చేపట్టిన ఉద్యమ వివరాలు చెప్పి ఓటర్లను చైతన్యపరిచారు. విస్తృతంగా కరపత్రాలు వేసి పంచాం. అందరికి అన్ని ఓట్లువేయమన్నాం.

మన ప్రచారం అందరిని ఆకర్షించింది. మొత్తంపై మన అభ్యర్థి యమ్ మాధవరావుగారు 5వ లెక్కింపులో ఖచ్చితమైన మెజార్టీ సాధించినా 6వ లెక్కింపులో అధికమైన మెజార్టీతో నెగ్గారు.

దీనితో గత మూడు దఫాలుగా యీ నియోజకవర్గంలో నెగ్గుతూ ఉద్యమ విచ్ఛిన్న కార్యకలాపాలు సాగించిన ఉద్యమ ద్రోహి శ్రీసింగరాజుకు ఓటర్లుతగురుగుణపాఠంచెప్పారు. అలాగే అవకాశవాద విధానాలు అవలంబించిన ఇతర సంఘాలు బలపర్చిన అభ్యర్థులు కూడా ఘోరపరాజయం పొందారు.

మనపై ఉపాధ్యాయులు వుంచిన బాధ్యతలు గుర్తెరిగి మనము మన అభ్యర్థి నడుచుకోవలసివుంది. అనేక అపరిష్కృత సమస్యలతో సతమతమౌతున్న ఉపాధ్యాయుల సమస్యాపరిష్కారానికి కృషి చేయాలి. అలాగే నిర్మాణం ఏమీ లేకుండా వున్న చిత్తూరు జిల్లాలో మన నిర్మాణం సాగించవలసివుంది.

కరస్పాండెన్సు:- వివిధ వుపాధ్యాయుల సమస్యలపై రాష్ట్ర సంఘ పక్షాన కరస్పాండెన్సు సాగించబడింది. అందు కొన్ని సమస్యలు పరిష్కరింపబడినాయి. మరికొన్ని అపరిష్కృతంగానే వున్నాయి.

1. 2వ నూతన కౌన్సిల్, కార్యవర్గ, సబ్ కమిటీ తీర్మానాలు ఎప్పటి కప్పుడు ప్రభుత్వానికి తదితర అధికారులకు పంపుట జరుగుతోంది.

2 ముమ్మిడివరం అక్రమబదిలీ, శ్రీనాగేశ్వరరావుగార్కి పోస్టింగ్ శ్రీ వి. సూర్యనారాయణరాజుగారి విడుదల గురించి తూర్పు గోదావరిజిల్లా కలెక్టరుకు 1451, 1454 నెంబరు లెటర్లు పెట్టుట జరిగింది.

3. శ్రీ యం.డి. యూసఫ్‌గారి సెస్పెన్షన్ రద్దు చేయాలని నెం 1452 తేది 5-12-75 న హైదరాబాదు జిల్లా పరిషత్ సెక్రటరీగార్కి లెటరు పెట్టితిమి.

4. రెంటచింతల ఎయిడెడ్ హైస్కూలు ఉపాధ్యాయుడు శ్రీయం. రామకోటయ్యపైజరిగిన దౌర్జన్యంపైన అక్రమ రిట్రెంచిమెంటుపైన కలక్టరు డి.యి ఓ డి.యస్. ఇ లకు లెటర్లు పెట్టుట జరిగింది.

5. అత్తలూరు ఆర్.సి ఎమ్ స్కూలు వుపాధ్యాయులు శ్రీ రాయన్న శ్రీ వీరయ్యల జీతములు తిరిగి చెల్లించుట, పోస్టింగు యిచ్చుట గురించి డి. ఎస్. ఇ కలక్టరు, డి. ఇ ఓ లతో కరస్పాండెన్సు చేయబడినది.

6 శ్రీ డి. కోటయ్య, నెల్లూరు జిల్లా మాల్యూరుపేట సమితిలో పోస్టింగు యిచ్చుటకు డి యస్. ఇ తో కరస్పాండెన్సు చేయుట జరిగింది.

7. విజయవాడ చిట్టినగర్ ఉపాధ్యాయుని అక్రమ రిట్రెంచిమెంటు గురించి, ఉపాధ్యాయులపై అక్రమ చర్యలు సాగించుచున్న మేనేజ్‌మెంటుపై విచారణకు డి ఇ ఓ డి ఎ ఇ లను కోరుట జరిగింది.

8. తూ గో. జిల్లా గాంధీ మెమోరియల్ హైస్కూలు పెదపూడివారి జీతములు ఎరియర్సుయివ్వాలని 6-8-76 డి. ఇ. ఓకు లెటరు పెట్టుట జరిగింది.

9. తూ. గో. జిల్లా కొత్తపేట డి. బి. పిల్లలను చేర్చుకొనుటకు పర్మిషన్ గురించి వ్రాసిన దానిపై వివరణకై ఇ ఓకు వ్రాయుట జరిగింది.

10. పాలకొల్లు మునిసిపాలిటీ ఉపాధ్యాయుల జీతములు నిలుపుదల గురించి కమీషనర్ డి ఇ ఓ లకు వ్రాయుట జరిగింది.

11 కృష్ణాజిల్లా పరిషత్తులో అక్రమంగా ఉష్టుచేసిన వుపాధ్యాయులను తిరిగి వెంటనే ఉద్యోగములో నియమించవలసినదిగా కలక్టరు, జిల్లా పరిషత్ శక్రటరీగార్లను కోరుట జరిగింది.

సంఘ నిర్మాణం : ఉపాధ్యాయలోకం మనసంఘంపై ఎన్నో ఆశలు పెట్టుకొంది. వారి ఆశలు, ఆశయాలు నెరవేర్చటానికి మనం చొరవతో కృషిచేసి నిర్మాణం పరిజేసుకొని సమరశీల పోరాట సంస్థకు సరైన వారసులమని పించుకొందాం. అవినీతికి అక్రమాలకు వ్యతిరేకంగా పోరాడుతూ సమైక్య ఉద్యమ నిర్మాణానికి కృషిచేస్తూ, ముందుకే ముమ్ముందుకే పయనిద్దాం.

మొత్తం 21 జిల్లాలకు 15 జిల్లాలలో మన శాఖలు వున్నాయి. మిగిలిన ఆరుజిల్లాలకు మనము విస్తరించవలసి వుంది. సభ్యత్వం గతంకంటె కొంచెం పెరిగినా తీసుకొన్న కోటా కంటె తగ్గింది. సభ్యత్వం ఉద్యమ బలానికి ప్రతిబింబం కాకపోయినా దాన్ని తక్కువ అంచనా వేయలేం. అలాగే ఒక సభ్యత్వం తోనే సంఘాన్ని నడపడం సాధ్యంకాదు తప్పనిసరిగా జనరల్ ఫండు కూడా వసూలు చేయాలి.

జనరల్ ఫండుకై యిచ్చిన పిలుపు ఒకటి రెండుజిల్లాలు తప్ప మిగతా జిల్లాలనుండి తగు రేస్పాన్సులేదు సమితి పట్టణ జిల్లా రాష్ట్రశాఖలకు ఆర్థిక పరిపుష్టత చేకూర్చాలన్నా హోల్ టైమర్లను పోషించుకోవాలన్నా తీసుకొన్న కోటాలు పూర్తి చేయవలసి వుంది. అలాగే వివాహకానుకలు యితర శుభ

కార్యములకా నుకలు తప్పక కార్యకర్తలు సేకరించవలసివుంది.

మన ఉద్యమస్థాయికి 20 వేల సభ్యత్వం 10 వేల పత్రికల చందాలు వుండవలసిన అవసరంవుంది. అందుకని నిర్ణయాలు నిదానంగా తీసుకొందాం. ఖచ్చితంగా అమలుజరుపుదాం. ఊరక వాగ్దానాలు వుత్తుత్త సభ్యత్వాలు యు. టి. యఫ్. ఛాయలకే రానీయకండి.

ఫంక్షనింగు : సమిష్టి ఆలోచనలతో గాని సంఘాన్ని సరైనబాటలో నడుపలేము. అందుకు రెగ్యులరు ఫంక్షనింగు అవసరం. అందుకనుగుణంగానే మన శాఖ ప్రతినెలా సమావేశాలు జరుపుతూ సరైన నిర్ణయాలు తీసుకుంటూ, అట్టి నిర్ణయాలు ఖచ్చితంగా అమలు జరుపుతున్నాం.

## యీ నివేదికా కాలంలో జరిగిన సమావేశాలు

| | | | | |
|---|---|---|---|---|
| 75 | ఆగస్టు | 9 10 | నూతన కౌన్సిలు | విజయవాడ |
| 75 | సెప్టెంబరు | 13 | సబ్ కమిటీ | విజయవాడ |
| 75 | అక్టోబరు | 11, 12 | కార్యవర్గం | విజయవాడ |
| 75 | నవంబరు | 30 | సబ్ కమిటీ | విజయవాడ |
| 76 | జనవరి | 10, 11 | కౌన్సిల్ | విజయవాడ |
| 76 | మార్చి | 13 | కార్యవర్గం | విజయవాడ |
| 76 | ఏప్రిల్ | 25 | సబ్ కమిటీ | విజయవాడ |
| 76 | మే | 17 | సబ్ కమిటీ | పామగోడు |
| 76 | జూన్ | 19 | కార్యవర్గం | నెల్లూరు |
| 76 | జూలై | 23 | సబ్ కమిటీ | హైద్రాబాదు |
| 76 | సెప్టెంబరు | 12 | సబ్ కమిటీ | విజయవాడ |

యీనివేదిక 13 నెలల కాలంలో 11సమావేశాలు జరిగాయి. ఉపాధ్యాయులు ఎదుర్కొనుచున్న తక్షణ సమస్యలపై తీర్మానాలుచేసి ప్రభుత్వానికి పంపాం. ప్రభుత్వ నిర్ణయాలపై మన వైఖరి వివరించాం.

సర్క్యులర్లు: సర్క్యులర్లుసమస్యపై కార్యకర్తలనుఎడ్యుకేట్ చేస్తాయి సంఘకార్యకలాపాలను వివరిస్తాయి. సెంటరు స్థాయి నుండి, రాష్ట్రస్థాయివరకు, కార్యకలాపాల సమన్వయం,కార్యకర్తలమధ్య సమన్వయం ఏర్పరచి,ఉద్యమపురోభివృద్ధికి సహాయ పడతాయి, దానికి వున్న ప్రాముఖ్యతదృష్ట్యా, ఆర్థికంగా, కష్టనష్టములకు గురి అయినా, యీకాలంలో 51 సర్క్యులర్లు పెట్టేము.

కరపత్రములు-ఇతరములు:-ఆయా సమస్యలపై మనము ఈ దిగువ తేదీలలో కరపత్రములు సాహిత్యము వేసి. కార్యకర్తలకు పంచాం. అవి, ఉద్యమ నిర్మాణమునకు, పటిష్టతకు ఎంతో ఉపయోగపడ్డాయి. ఇవి శాఖ డి.వోలు కూడా ఎప్పటికప్పుడు అందించాం.

15-8-75 కౌన్సిల్ ఆమోదించిన తీర్మానములు,
19-8-75 కో ఆర్డినేషనులు జరుపుట గురించి.
15-9-75 వార్డు ఛాంపియన్‌లకు కార్డులు.
20-10-75 రాయలసీమ యం. యల్ సి. ఎన్నికలు.
6-12-75 చెన్నుపాటి వర్థంతి సభలు.
15-1-76 కౌన్సిలు ఆమోదించిన తీర్మానములు.
1-4-76 ముఖ్య మంత్రికి విజ్ఞప్తి పత్రాలు
18-6-76 ఉద్యమ విచ్ఛిన్నకుని నగ్న స్వరూపం.
24-6-76 ఓటర్లకు సూచనలు.
26-6-76 శ్రీ మాధవరావుగార్ని గెలిపించండి.
30-6-76 కార్యకర్తలకు సూచనలు.
6-7-76 ఓటర్లకు కృతజ్ఞతలు.

పత్రికా ప్రకటనలు:-ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యల పైనను, విద్యావిధానంపై ప్రభుత్వవైఖరిపైననూ మన తక్షణ కర్తవ్యాల పైనను ఎప్పటికప్పుడు, కార్యకర్తలకు, ఉపాధ్యాయులకు ఉపయోగకరంగా ఉండే విధంగా యిట్టి ప్రకటనలు యీ కాలంలో చేయుట జరిగింది.

| | | |
|---|---|---|
| 1975 | ఆగస్టు | ఉపాధ్యాయులకు కరువుభత్యం విలీనీకరణ జి. ఓ. వెంటనే విడుదల నియాలి |
| 1975 | సెప్టెంబరు | టీచర్స్ డే సందర్భంగా సాటి యన్ జి ఓ. లకు వున్న సౌకర్యాలయినా ఉపాధ్యాయులకు యివ్వాలి |
| 1975 | అక్టోబరు | డి.ఎ, మెర్జరుస్కేళ్ళు అనామలీస్ వెంటనే సరిచేయాలి. |
| 1975 | డిసెంబరు | పంచాయితీ రజతోత్సవాలు ఉపాధ్యాయులపై దాడి. |
| 1976 | జనవరి | కరువుభత్యం పెంపుదలపై ప్రకటన. |
| 1976 | మార్చి | అక్టోబరు తరువాత రిటయిరయ్యే వారిని విద్యాసంవత్సరము ఆఖరు వరకు కంటిన్యూ చేయాలి. |
| 1976 | ఏప్రిల్ | వంతకాల ఛాంపియన్ జయప్రదంచేయండి. |
| 1976 | మే | శ్రీమాధవరావుగారి విజయానికి తోడ్పడండి. |
| 1976 | ఆగస్టు | పని గంటలు, పని దినాల పెంపుపై ప్రకటన. |
| 1976 | సెప్టెంబరు | కరువుభత్యం పెంపుదల గురించి. |

పై ప్రకటనలు అన్ని పత్రికలకు పంపుట జరిగింది. ప్రజాశక్తి, ఆంధ్రజ్యోతి, ఈనాడు, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక లలో కొన్నిటిలో మాత్రమే పడినవి. పత్రికలలో ప్రకటనలను ఉపాధ్యాయులు ఎంతగానో అభినందించారు తమ ఆవేదనలను ఈ విధంగా యు. టి. యఫ్. మాత్రమే వెల్లడించుచున్నదని ఆనందాన్ని తెలిపారు.

రాష్ట్ర కార్యాలయ నిర్వహణ:- కార్యాలయ నిర్వహణ గతంకంటే మెరుగు. ప్రస్తుతం రాష్ట్ర కార్యాలయంలో యిద్దరు పూర్తికాలం పనిచేసే కార్యకర్తలు, ఒక అటెండరు వున్నారు. మరొక పార్టుటయిం కార్యకర్త సహకరించుచున్నారు. మరో ఇద్దరు పూర్తికాలం కార్యకర్తలు రాష్ట్ర కార్యాలయానికి వస్తే తప్ప, పెరిగిన ఉద్యమస్థాయికి న్యాయం జరుగదు. పత్రికకు న్యాయం జరుగదు.

కార్యాలయానికి, దాతల విరాళములతో 14 కుర్చీలు, 2 డ్రాయర్లు, 2 బీరువాలు, 2 రేక్సు, ఒక ఇంగ్లీషు టైపు మిషను అమిరాయి. లోగడ వాగ్దానాలు చేసిన వారు యింకా చెల్లించాల్సి వుంది. ఇంకా తెలుగుటైపుమిషను, డూప్లికేటింగు మిషను ఎంతయినా అవసరం.

## తక్షణ సమస్యలు

రాష్ట్ర వ్యాపితంగా మనం చేపట్టిన మూడు కార్యక్రమాలలో మిగిలిపోయిన సమస్యల గురించి కృషి చేయవలసి

# 'ఐక్య ఉపాధ్యాయు' నివేదిక

## (1-8-75 నుండి 31-8-76 వరకు)

అధ్యక్షా !

నూతన రాష్ట్రకౌన్సిల్ సభ్యులారా !
ప్రత్యేకాహ్వానితులారా !
స్వాగతం....! సుస్వాగతం !!

విద్యాకేంద్రమూ, విజ్ఞాననిలయమూ అయిన గుంటూరు పట్టణంలో మన 3వ నూతన రాష్ట్రకౌన్సిల్ జరుపుకొంటున్నాం. విద్యారంగంలో నెలుబికిన సంక్షోభాన్ని అస్తవ్యస్తస్థితిని, అనిశ్చిత పరిస్థితిని, సమీక్షించుకొని చర్చించుకొని దాని నుండి విముక్తి పొందేందుకు నిజమైన జాతి నిర్మాతల మార్గాన్ని సుగమం చేస్తున్న యీ కౌన్సిలుకు చారిత్రక ప్రాధాన్యతవుంది. దానికి కరదీపికే మన పత్రిక.

మన పత్రిక జన్మదినోత్సవంనాడు ఎందరో అభిమానులు, కవులు, కళాకారులు, వేనకువేలు ప్రజలకు వేగుచుక్కగా, చైతన్య జ్వలితాగ్నిగా "జయం" పలికేరు. "చిన్నపాటి హృదయానికి ప్రతిబింబంగా" వినుతించారు. "ఐక్యోద్యమ వాణిగా.... మహదాశయ తర్వాణిగా" ప్రస్తుతించారు. "ఆదిలోనే మేధావుల ఆశీస్సులు గొంటివి ..., అధ్యాపక లోకమంతుంటివ" ని







హారతులందించారు. దానికి తగినట్లు మన పత్రిక ప.శ్శీ తొమ్మిది నెలలు కాలం దిగ్విజయంగా వర్ధిల్లింది. సాటి విద్యావైజ్ఞానిక పత్రికలలో మేటి అయింది. ప్రగతి పథంలో దేశం పయనించే దానికి అవసరమైన శాస్త్రీయ నూతన విధానం రూపొందించే దానికి, సోషలిస్టు చైతన్య సంస్కృతుల వ్యాప్తికి, ఉపాధ్యాయ సంక్షేమానికి, వృత్తిభద్రతకు హక్కుల సాధనకు, ఆత్మగౌరవం నిలబెట్టటానికి అచంచలంగా నిలబడి యీ తొమ్మిది నెలల కాలంలో మన పత్రిక ఐక్య ఉద్యమానికి మరింత పదునైన ఆయుధంగా రాటుదేలింది. వివిధశీర్షికలతో, ఉద్యమవార్తలతో, జి. ఓ. లతో, స్టేట్‌మెంట్లతో అన్ని రంగాలవారి ఆప్యాయత ఆదరాభిమానాలు చూరగొని, అత్యధిక ప్రచారం పొంది ఉజ్జ్వలంగా భాసిల్లింది.

ఈ విధంగా మనపత్రికా పుత్రికను తమ గారాల బిడ్డగా, ప్రాణ సమానంగా ఎంచి పెంచి పెద్దజేస్తున్న కార్యకర్తలకు, పత్రికా పాఠకులకు, ఉద్యమాభిమానులకు యీ సందర్భంలో సంపాదక వర్గం తరపున కృతజ్ఞతాభి వందనాలను అందజేస్తున్నాను.

కామ్రేడ్స్ !

గత పదమూడు మాసాల పత్రికా నివేదిక సమర్పించే ముందు గత జనరల్ కౌన్సిల్ సందర్భంలో మనం తీసుకొన్న నిర్ణయాలను ఒకసారి సమీక్షించుకొని అవి ఎంతవరకు సఫలమయిందీ.....విఫలమయిందీ సమన్వయించుకొని భావి రూపురేఖల్ని తీర్చిదిద్దుకొందాం.

మన పత్రికనింకా సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాలనీ స్థాయి పెంచి పాఠశాలల చైతన్యాభివృద్ధికి దోహదకారి కావాలనీ, పత్రిక ఆర్థికపరిస్థితి సుస్థిరం చేసేందుకు స్పెషల్, జనరల్ క్యాంపెయిన్ల ద్వారా సర్క్యులేషన్ ఇతోధికం చేయాలనీ, జీవిత చందాదార్లను ఇబ్బడి ముబ్బడిగా పెంచాలనీ, ప్రకటనలు సేకరించాలనీ, సకాలంలో పత్రిక వెలువరించాలనీ, చందాదార్లకు పత్రిక సక్రమంగా అందేట్టుచూడాలనీ, పత్రిక గ్రంథాలయాన్ని వృద్ధి చేయాలనీ అనేక నిర్ణయాలను తీసుకొన్నాం.

పైనిర్ణయాల కనుగుణంగా ఇటు సంపాదకవర్గం, అటు కార్యాలయం తగుచర్యలు తీసుకొన్నది. ఉద్యమాశయాల కనుగుణంగా పత్రికస్థాయిని పెంచటానికి వివిధ శీర్షికలు నిర్వహించటం ద్వారా సంపాదకవర్గం గణనీయమైన కృషి చేసింది. ఫలి

---

వుంది. అందుకు కొన్ని తక్షణ కార్యక్రమాలు చేపట్టాలి.

1. అన్నిసంఘాలతో ఐక్య కార్యాచరణకు మరింత కృషి చేయాలి.

2. నేటివిటీ, నిర్బంధ రిటయిరుమెంటు, పని గంటల పెంపు మొ॥ సమస్యలపై కార్యక్రమం చేపట్టాలి.

3. పంచాయితీరాజ్ నుండి విద్యను తొలగించుటకు కృషి చేయాలి.

4. అన్ని ప్రయివేటు మేనేజిమెంట్లు ప్రభుత్వంస్వాధీనం చేసుకునే దానికి కృషి చేయాలి.

5. సమగ్ర విద్యాబిల్లు చట్టం అయ్యేదానికి కృషి చేయాలి.

6. సమసమాజ నిర్మాణానికి అవసరమైన విద్యావిధానం అమలు జరుపుటకు కృషి చేయాలి.

7. అపరిష్కృత సమస్యల పరిష్కారానికి కృషి చేయాలి,

### ముగింపు

మహాశయులారా !

ఈ 13 నెలల సంఘ కార్యకలాపాల సంక్షిప్త నివేదిక మీముందు వుంచాను. దీనిని పరిశీలించి నిర్మాణాత్మకమైన సూచనలు చేయండి. తద్వారా నివేదికకు మరింత పరిపుష్టత చేకూర్చండి.

ఇట్లు
భవదీయుడు,
ఎ. వెంకటస్వామి,
(ప్రధాన కార్యదర్శి)

తంగా అన్ని వర్గాల ఉపాధ్యాయుల ఆదరణ మనపత్రికకు లభించింది. స్పెషల్ జనరల్ క్యాంపెయిన్లతో మనకార్యకర్తలు ఎనలేనిదీక్ష ప్రదర్శించి సర్క్యులేషన్ను ఇతోధికం చేశారు. జీవితచందాలను గణనీయంగా పెంచారు ప్రకటనల సేకరణలో జిల్లాలకోటా ప్రకారం గాకపోయినా కృష్ణా, ఖమ్మం, గుంటూరు, ప్రకాశం, ఉభయ గోదావరులు యథాశక్తి కృషి సాగించినయ్ సకాలంలో పత్రిక అందించటానికి కృత నిశ్చయులమయినా ప్రెస్ ఇబ్బందులు, ఎన్నికలలో నిర్మాణంలో టూర్ ప్రోగ్రాంలలో ప్రధాన బాధ్యులు తరచు పాల్గొనవలసి రావటం వలన ఆలస్యమవుతూనే వస్తున్నది. పత్రిక గ్రంథాలయాన్ని కూడా మనం తగినంతగా పెంచుకోలేకపోయాం. రిఫరెన్సు గ్రంథాల లోటువల్ల ఉత్తర ప్రత్యుత్తరాలలో జాప్యం జరుగుతున్నది. తూర్పు రాయలసీమ ఎన్నికలలో విచ్ఛిన్న శక్తుల ఓడిపోయి ఐక్యోద్యమ ప్రతినిధి జయం పొందటంతో ఉద్యమ విస్తరణతోపాటు పత్రిక ప్రతిష్ఠ పెరిగింది. ఉద్యమావసరాలకు తగినట్లు పత్రికనింకా వ్యాప్తి చేయవలసిన తక్షణ బాధ్యత మనమీద పడింది. దానికనుగుణంగా ఎదురౌతున్న ఇబ్బందుల్ని అధిగమించి కట్టుదిట్టంగా నిర్మాణయుతంగా పత్రికనూ, పత్రికా కార్యాలయాన్నీ మనం నడుపుకోవల్సి ఉంది.

ఇక ఒక్కొక్క అంశం వీలయినంత వివరంగా మీదృష్టికి తెస్తాము. వాటిని చర్చించి తగు సూచనలిచ్చి పత్రికాభివృద్ధికి తోడ్పడవలసిందిగా ఈ సందర్భంలో మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

సంపాదకవర్గ సమావేశాలు: పత్రికా నిర్వహణకు, స్థాయి పెరుగుదలకు సంపాదకవర్గసభ్యులమధ్య పనివిభజన, సమన్వయం అవసరం. అందుకు రెగ్యులర్‌గా సంపాదకవర్గ సమావేశాలు జరుగుతుండాలి. ఈకాలంలో ప్రత్యేకంగా గాకపోయినా కార్యవర్గ సమావేశ సందర్భాల్లోనూ, సబ్‌కమిటీ సమావేశ సందర్భాల్లోనూ సంపాదకవర్గం కూడా సమావేశమై పత్రికాభివృద్ధికి పాటుపడింది. గత నూతన కౌన్సిలునుండి మొత్తం 11 సమావేశాలు జరిగాయి.

పత్రికాభివృద్ధి;- మనపత్రిక అక్టోబరులో విద్యాగోష్ఠి సందర్భంగా సావనీరుగా వెలువడ నున్నది. దానిలో వివిధ విద్యా సమస్యలపై ప్రముఖుల వ్యాసాలు పాఠకుల అభిరుచుల కనుగుణమైన వివిధ శీర్షికలతో ప్రత్యేకాకర్షణలతో మీ చేతుల్లోకి రాబోతున్నది. మనపత్రిక ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు అన్ని జిల్లాలకు వ్యాపించింది. వెళ్ళినచోటల్లా అన్ని వర్గాల ఉపాధ్యాయుల ఆదరాభిమానాన్ని పొంది, ఉద్యమాభివృద్ధికి తోడ్పడుతున్నది. కార్యకర్తల దీక్ష ఫలితంగా గతంలో సాగించిన స్పెషల్ క్యాంపెయిన్‌లో 1273, జనరల్ క్యాంపెయిన్‌లో 2502 చందాదారుల్ని మనం కొత్తగా చేర్పించగలిగేము. మనం ప్రకటించినట్లుగా ఆ క్యాంపెయిన్లలో పోటీబడి దీక్షప్రకటించిన కార్యకర్తల్ని యీ సమావేశంలో మనం గౌరవించుకోబోతున్నాం. స్పెషల్‌క్యాంపెయిన్‌లో ఖమ్మం, తూర్పు గోదావరి గుంటూరుజిల్లాలు ప్రథమద్వితీయతృతీయస్థానాన్నిపొందినాయ్ జనరల్‌క్యాంపెయిన్‌లో గుంటూరు, తూర్పుగోదావరి, నెల్లూరు జిల్లాలు ప్రథమ ద్వితీయ తృతీయ స్థానాలు పొందినాయి, ఈ సందర్భంలో ఆజిల్లాకమిటీలను కార్యకర్తల్ని అభినందిస్తున్నాం. నిత్యజాగరూకతతో ప్రతినెలా అంతమైన చందాలను పునరుద్ధరించేట్లు చూడటం, క్రొత్త చందాలను చేర్పించటం ఉద్యమ కార్యక్రమాలలో ఒక భాగంగా మనం కొనసాగించాలి ఇను మడించిన దీక్షా దక్షతతో పదివేల సర్క్యులేషన్‌కు పెంచాలి. పత్రికా వ్యాప్తి ఉద్యమ వ్యాప్తి పరస్పర సంబంధం గలదని, అసమన్వయం ఉంటేనే ఐక్యోద్యమం మరింతవేగంగా విస్తరించి మిలిటెంట్ ఉద్యమంగా రూపొందుతుందనే సత్యాన్ని, ఆను సారాంశాన్ని మీకు ఈ సందర్భంలో గుర్తుకు తెస్తున్నాము. కృష్ణా, తూర్పు గోదావరిజిల్లాల యల్. యల్. ఎ అధికారులు తమ గ్రంథాలయాలకు 88+35=123 పత్రికలకు ఆర్డరిచ్చి తమ సహకారాన్ని తెల్పినందుకు మా అభినందనలు. ఆ విధంగానే ఇతర జిల్లా సంఘాలు కూడా ప్రయత్నించాలని మీకు మనవి చేస్తున్నాను. ప్రస్తుతం మన పత్రిక సర్క్యులేషన్ వేరే పేజిలో యిచ్చాం పరిశీలించండి.

జీవిత చందాలు :- పత్రిక స్వయం పోషకత్వానికి జీవిత చందాదారుల్ని మనంచేర్పిస్తున్నాం. గత నూతనకౌన్సిల్ నాటికి 25 గా ఉన్న జీవిత చందాలు ప్రస్తుతం 74. ఇబ్బడి ముబ్బడిగా పెరిగినయ్. వాగ్దానాలింకా 70 దాకా ఉన్నవి. వాటిని వెంటనే చెల్లించేట్లు జిల్లా బాధ్యులు చర్యలు తీసుకోవాల్సిందిగా కోరుతున్నాము. ఈ సందర్భంలో వాటి అభివృద్ధికి ప్రత్యేక కృషిచేసిన పశ్చిమ గోదావరిజిల్లాను అభినందిస్తున్నాను. ఆ జిల్లాకు చెందిన విస్సాకోడేరు సమితి, కోలేరు సెంటరుశాఖ ఒక ప్లాను ప్రకారం జీవితచందాల అభివృద్ధికి కృషిచేస్తున్నది. ఆ బాటలో అన్ని సెంటర్లూ నడిస్తే అతిశీఘ్రంలో జీవిత చందాలు వందల సంఖ్యలోకి రాగలవని .... దాన్ని ఆదర్శంగా స్వీకరించి పురోగమించాలని యీ సందర్భాలో కోరుతున్నాను.

సంపాదకీయాలు : ఈ కాలంలో మన పత్రిక సంపాదకీయాలు సమయోచితంగా చైతన్య స్ఫోరకాలుగా రూపొందింపబడ్డాయి. ఉపాధ్యాయుల నిర్బంధ రిటైర్‌మెంట్ రద్దు చేయాలనీ దానికి గురయిన వారందరికీ అప్పీలు చేసుకొనే అధికారం కల్పించి తగు న్యాయం కల్గించాలనీ ఫిబ్రవరి సంపాదకీయంలో కోరేం. రిటైర్‌మెంట్ వయసులోగల అవకతవకల్ని నూర్చి సంపాదకీయంలో బయటపెట్టేం. తూర్పు రాయలసీమ ఎన్నికల రంగంలో ఓటర్ల కర్తవ్యాన్ని ప్రబోధించి విజయోత్సవ సందర్భంలో అభినందించటం ద్వారా కర్తవ్య నిర్వహణను ఏప్రియల్, జూలై సంపాదకీయాల్ని రూపొందించాం. లక్షల సంఖ్యలో పిల్లల్ని తప్పించే అస్వస్త విధానాన్ని మే సంపాదకీయంలో ఖండించాం. కల్లేపై బండి నడిచినట్లు నడుస్తున్న విధానాల్ని జూన్‌సంచికలో విమర్శించాం. అధ్యాపకుల ఆత్మగౌరవానికి భంగకరంగా రేగిన దుమారాన్ని ఆగస్టు సంపాదకీయంలో ఖండించి విద్యావ్యవస్థలోని రుగ్మతలకు అసలు కారణాలు చూపేం. పనిగంటల, దినాలభారం ఎలా అశాస్త్రీయమో సెప్టెంబరు సంపాదకీయంలో నిరూపించాం. ఈ విధంగా ప్రతి సందర్భంలోనూ ఐక్యోద్యమ వాణిగా, పీడితోపాధ్యాయుల బాధల్ని, గాథల్ని బయటపెట్టి సరయిన మార్గంచూపే చోదక శక్తిగా యీ కాలంలో మన పత్రిక దాని సంపాదకీయాలూ రూపొందేయి.

76 జూన్ నెలలో రాయలసీమ ఎన్నికల సందర్భంగా

16 పేజీలతో ఆకర్షణీయంగా ప్రత్యేక సంచిక వేశాం.

కార్టూనులు :- ఈ కాలంలో వచ్చిన మన కార్టూనులు విశేషాదరణ పొందాయి. జనవరి కార్టూను స్థాయిలోను, యథార్థాన్ని ప్రతిబింబించటం లోనూ ద్విముఖంగా రూపొంది దానికదే సాటి అనిపించుకున్నది. పెన్షన్ దార్ల బాధలు, రిటైర్‌మెంటు వయసులోని వివక్ష, ఉపాధ్యాయుణ్ణి కల్లోలపరుస్తున్న సమస్యలు, ప్రమోషన్ల ఎండమావి, విద్యార్థులపై పరీక్షల ప్రయోగాలు, విద్యా విధానాల్లోని అస్తవ్యస్త పరిస్థితుల్ని యీ కాలంలో కార్టూన్‌ల రూపంలో యథార్థ ప్రతిబింబాలుగా, ప్రతిభావంతంగా, తగు వ్యాఖ్యలతో అలంకరించ గలిగాము పత్రికస్థాయి పెంపుదలకు తోడ్పడిన ఆ చిత్రకారులకు మనందరి తరపున కృతజ్ఞతాభివందనాలు.

విద్యా సమస్యలు: ఈ కాలంలో నూతన మూల్యాంకన స్వరూపాన్ని తేటతెల్లం చేశాం. ప్రజలందరికీ అక్షరాస్యత, సోవియట్‌లో ఉపాధ్యాయుల శిక్షణ, చైనాలో విద్యావిధానం, విద్యావ్యవస్థ తీరు తెన్నులు, విద్యాబిల్లు సమీక్ష మొదలైన వ్యాసాల ద్వారా వివిధ విద్యా విధానాల స్వరూపాలను అవగతం చేశాం. ఇక రాబోయే ప్రతి సంచికలో సోషలిస్టు దేశాల్లోనూ, పెట్టుబడిదారీ దేశాల్లోనూ, అలీన దేశాల్లోనూ గల విద్యావిధానాలను వరుసగా ప్రకటించగలమని, ఆ సన్నాహాలు పూర్తయ్యాయని యీ సందర్భంలో మీకు తెలియబరుస్తున్నాము

వివిధ శీర్షికలు: ప్రశ్నోత్తరాలు, నియమ నిబంధనలు మనమూ-మన ఆరోగ్యమూ, విజ్ఞానవీధి మొదలగు శీర్షికలు ఎంతో ప్రయోజనాత్మకంగా వున్నాయని పాఠకులు తమ మన్ననల్ని అందించారు. అభిప్రాయాలు వ్యక్తీకరించటం ద్వారా ప్రోత్సాహాన్ని అందించారు.

అఫీసు నిర్వహణ: ఆఫీసులో పనిభారం ఇబ్బడి ముబ్బడి



## నిబంధనావళి సవరణలు

గుంటూరు కౌన్సిల్‌లో నిబంధనావళికి యీ క్రింది సవరణలు (చేర్పులు) ఆమోదింపబడినవి.

1. చేర్పులు:- నిబంధనావళి 2వ అంశాలలో 3వ ఉపనిబంధనగా

'ఎరుపురంగు జెండా, దానిపై 'యు. టి. యఫ్' అను ఆంగ్ల అక్షరములు గలది ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ యొక్క జెండాగా ఉండును.

2. చేర్పులు:- నిబంధనావళి 14వ అంశంలో శాసనసభారంగంలో 3వ ఉపనిబంధనగా

(3) ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ మద్దతుతో శాసనమండలికి ఎన్నికైన సభ్యులు యు టి. యఫ్ సభ్యత్వం స్వీకరించినచో, వారు ఎన్నిక లేకనే రాష్ట్ర కౌన్సిల్ సభ్యులగుదురు. కార్యవర్గ సమావేశాలకు వారు ప్రత్యేకాహ్వానితులుగా నుందురు.

అయింది. దానిని సక్రమంగా నిర్వహించేందుకు పత్రిక తరపున ఒక క్లర్కునూ, ఇద్దరు హోల్‌టైమర్స్‌నూ, వినియోగించుకోవాల్సి వచ్చింది.

కథలు - గేయాలు :- మన మినీ కథలు, కథానికలు, సీరియల్ నవలల స్థాయిలోను, శిల్పంలోను, రచనలోనూ, అత్యాధునిక రచనా ప్రక్రియలుగా రూపొంది పలువురి మన్నన్ని అందుకొన్నవి. ముఖ్యంగా విద్యూరాలు (స్కెచ్) ఎవరిది బాధ్యత (మినీకథ) అసలుచదువు, నేనే హెడ్మాష్టర్ని పంతులుగారూ క్షేమమా? పల్లె దండకం (గేయాలు) అభినవ నీతి చంద్రిక (సీరియల్) విశేషాదరణను పొందినవి. ఈ కాలంలో ఎందరో అజ్ఞాత రచయితలు మన పత్రిక ద్వారా పాఠకులకు పరిచితులయ్యారు. తన వ్యంగ్యాత్మక హాస్య రచనల (వినోదాత్మక సమగ్ర పాఠ్య ప్రణాళిక, ఫేషన్ నూతన కౌన్సిల్, సోకాజ్ నోటీసు) ద్వారా కె. జగన్నాథం 'దబుతెమ్మే' పత్రికకు విశేషమైన వన్నెచిన్నెల్ని అందించారు. వారందరికీ సంపాదకవర్గం తరపున ప్రత్యేకాభివందనాలు.

ఆర్థికం: పత్రికా కార్యాలయాన్ని, అద్దెన్ని, ఉద్యోగుల్ని, హోల్ టైమర్స్ ని పోషించుకోవాలంటే కోటా నిర్ణయించి పట్టు ఆయా జిల్లాలు విధిగా ప్రకటనలు సేకరించి తీరాలి. లేకపోతే అప్పులతో పడపాల్సివస్తుంది. పత్రిక పని కుంటుపడుతుంది.(వివరమైన ఆర్థిక రిపోర్టు వేరే యిస్తున్నాం)

కామ్రేడ్స్!

సంగ్రహంగా సమర్పించిన యీ రిపోర్టును చర్చించి తగు సూచనలిచ్చి మన పత్రికను ప్రయోజనాత్మకంగా, ఉద్యమాయుధంగా తీర్చి దిద్దటానికి తోడ్పడండని విజ్ఞప్తి చేస్తూ యీ నివేదిక ముగిస్తున్నాను.

—మైనేని వెంకటరత్నం,
ప్రధాన సంపాదకుడు.

# హైదరాబాద్ సబ్ ఆఫీసు నివేదిక
## [1.1.76 నుండి 30.9.76 వరకు]

ప్రధానకార్యదర్శి నివేదికకు తోడుగా హైదరాబాద్‌లో గల రాష్ట్ర సబ్ ఆఫీసుకు బాధ్యత వహిస్తున్న కార్యదర్శి వర్గ సభ్యులైన శ్రీ యం. నరహరిగారు సమర్పించిన నివేదిక.

మిత్రులారా !

ఎప్పటికప్పుడు సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకు రావటానికి, ప్రభుత్వ ఆఫీసులలో నెలలతరబడి పరిష్కరింప బడకుండా ఉన్నవ్యక్తిగత, సామూహిక సమస్యలపై కృషి సాగించటానికి రాష్ట్ర కమిటీ నిర్ణయానుసారం నేను ఇన్‌ఛార్జిగా హైదరాబాద్‌లో బ్రాంచి ఆఫీసు (కార్యదర్శి, యు. టి. యఫ్. ఆఫీసు, C/o యమ్. మాధవరావు, యమ్ యల్. సి., ఓల్డు యమ్ యల్. ఎ. క్వార్టర్స్, రూమ్ నెం. 39 ఎ హైదరాబాద్) పనిచేస్తున్నది.

### సమస్యలు కృషి

1. కరువుభత్యం కలిపిన వేతనాలలోని అసంబద్ధతలను, ఫిక్సేషన్‌లో జరిగిన అన్యాయాలను ఖమ్మం పరిషత్తువారి ఫిక్సేషన్ ఆర్డర్లను ఉదాహరణగా చూపుతూ వాటిని సరిజేయవలసిందిగా కోరుతూ ఆర్థికశాఖ కార్యదర్శిగార్కి 12-2-76 న మెమొరాండం ఇవ్వబడింది.

2. డిప్ ఓ యల్ వారికి 134-240, 130-230 ఇవ్వాలంటు ప్రభుత్వం జారీచేసిన మెమోలో డిప్. ఓ. యల్‌ను, 'డిప్లొమా ఇన్ ఓరియంటల్ లాంగ్వేజి'గా పేర్కొనటం జరిగింది. దానివలన జి ఓ,లమలులో చిక్కులు ఎదురైనవి. దానిని 'డిప్లొమా ఇన్ ఓరియంటల్ లెర్నింగ్' గా సరిచేయ వలెనని కోరుతూ విద్యాశాఖ కార్యదర్శిగారికి 15-2-76 న విజ్ఞప్తిపత్రం ఇవ్వబడింది.

3 విద్యాశాఖ వారి మెమో 864-31/76-2 తేదీ 8-4-76 లో ఆప్షన్‌లో పొరపాటు జరిగిన ఉపాధ్యాయులు తిరిగి ఆప్షన్ ఇచ్చుకోటానికి వీలుగా 30-4-76 వరకు గడువు ఇచ్చారు. కాని ఆ నెల 20న తేదీవరకు గూడ ఆ ఉత్తర్వులు జిల్లా విద్యాశాఖాధికారులకు అందలేదు. పైగా వేసవి శలవులు అయినందున ఉపాధ్యాయులు స్కూళ్ళలో ఉండరు గనుక ఆ ఉత్తర్వు ప్రయోజనం పొందటానికి గడువు జూన్ చివరివరకు పొడిగింపవలసిందిగా కోరుతూ 24-4-76, 2-5-76 తేదీల్లో విద్యాశాఖ కార్యదర్శిగారికి మెమొరాండాలు ఇవ్వబడ్డాయి.

4 శ్రీ వి. అమరేశ్వరరావు(నిజామాబాద్) జి.పి యఫ్. మిస్సింగ్ క్రెడిట్స్‌ను సరిజేయవలసిందిగా కోరుతూ ఎ జి. గారికి 3-5-76 న మెమొరాండం ఇవ్వబడింది. అదే రోజున సదరు కార్యకర్త ప్రభుత్వ జీవిత భీమా ప్రీమియంలు తప్పిపోవటాన్ని సరిజేయవలసిందిగా కోరుతూ ప్రభుత్వ యల్. ఐ. సి డైరెక్టర్‌గార్కి విజ్ఞప్తిపత్రం దాఖలు చేయబడింది.

5. వరంగల్లులో స్త్రీసంక్షేమ శాఖవారు నిర్వహిస్తున్న క్రెచ్ ట్రైనింగ్ పొందిన వారికి ఉద్యోగావకాశాలు కల్గించాలని కోరుతూ 5-5-76న రాష్ట్ర స్త్రీ సంక్షేమ డైరెక్టర్‌గారికి విజ్ఞప్తిపత్రం సమర్పించబడింది. పర్యవసానంగా దాని సమాధానం రాష్ట్ర కార్యాలయానికి రావటం, దాన్ని మన పత్రికలో ప్రచురించటం జరిగింది.

6. గుంటూరు జిల్లా, అమృతలూరు యు. పి. స్కూల్లో సంగీత ఉపాధ్యాయులు శ్రీ వి. చంద్రమౌళిగార్కి డూప్లికేటు సర్టిఫికెట్‌ను ఇష్యూచేయవలసిందిగా సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు గారికి అదే స్కూల్లో పనిచేసే శ్రీ కె. దేవప్రసాద్ గారి సమస్య పరిశీలింప వలసిందిగా పాఠశాలా విద్యాడైరెక్టరు గార్కి విజ్ఞప్తి పత్రాలు 12-7-76 న ఇవ్వబడ్డాయి.

పై వాటితో బాటు రాష్ట్రంలోని ఉపాధ్యాయులకు చెందిన అనేక సమస్యలను యమ్. యల్. సి. ల సహకారంతో ఆయా అధికారులదృష్టికి తేవటం, ఆ వివరణలతో 187 ఉత్తరాలు వ్రాయటం జరిగింది.

ఈ విధంగా సబ్ ఆఫీసు పనిభారం రోజురోజుకూ పెరిగిపోతున్నది. దానిని సమర్థవంతంగా మనం నిర్వహించుకోవలసి ఉంది.

# వివిధ జిల్లా శాఖల ప్రధాన కార్యదర్శుల నివేదికలు

### విశాఖజిల్లా : శ్రీ ఎ. బాబూరావు

జిల్లా నిర్మాణం 10-7-76 న పూర్తయింది. అనకాపల్లి పట్టణం, పెందుర్తి సమితి, వియ్యంపేట సమితి, జాలావుట్ సమితి, నక్కపల్లి సమితులకు ఉద్యమం విస్తరించింది సభ్యత్వం 250, పత్రికలు 60 పైగా వస్తున్నాయ్ ఆయాసమితి, పరిషత్ అధికారాలతో సమస్యలపై రాయబారాలు నడుపబడినవి. తూ. రా. ఎన్నికల విజయంతో కార్యకర్తల్లో ఉత్సాహమూ ఊపూ వచ్చినయ్. శ్రీకాకుళం జిల్లాలో ఉద్యమ వ్యాప్తికి కృషి జరుగుతున్నది.

### తూ. గో. జిల్లా : శ్రీ వి. సూర్యనారాయణరాజు

జిల్లాలో 18 సమితులలో 5 మునిసిపాలిటీలలో శాఖలు ఏర్పడి నిర్మాణయుతంగా పనిచేస్తున్నవి. సభ్యత్వం 3500 పత్రికలు అన్ని ప్రాంతాలకు 800 పైగా పోతున్నవి. అపరిష్కృత సమస్యలపై ప్రతి నెలా జిల్లా కలెక్టర్, జడ్. పి. కార్యదర్శి, డి.యి ఓ, లోకల్‌ఫండ్ అసిస్టెంట్ ఎగ్జామినర్‌గార్లతో రాయబారాలు జరిపి పరిష్కార కృషి జరుగుతున్నది. లంచగొండి ఉద్యోగులకు, దళారీలకు వ్యతిరేకంగా నిత్యం పోరాడుతూ అనేక సమితుల్లో అవినీతి చర్యలపై ఎంక్వయిరీలు పెట్టించాము. అనేక అక్రమ బదిలీలను సరిజేయించాము మేనేజిమెంటు కగసాధింపు చర్యలకు మున్మిడివరం సమితిశాఖ అధ్యక్షుడు, సీనియర్ కార్యకర్త అయిన శ్రీ కె గంగిసెట్టి గురికాబడి నిర్బంధంగా రిటైర్ చేయబడ్డారు. జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి డి ఐ ఆర్ క్రింద అరెస్టు కాబడి 127 రోజుల నిర్బంధం తర్వాత నిర్దోషిగా విడుదల కాబడ్డారు.

ఈ కాలంలో 2 కౌన్సిల్ సమావేశాలు, 6 కార్యవర్గ సమావేశాలు, 9 సబ్‌కమిటీ సమావేశాలు జరిగాయి. 20 సర్క్యులర్లు జారీ చేయబడ్డాయి. 15 మంది జీవిత చందాదార్లుగా చేరారు. ఇంకా 20 మంది వాగ్దానాలున్నవి. భీమవరంలో జరిగిన ఉద్యమ క్లాసులకు 45 మంది కార్యకర్తలు

హాజరయ్యారు. సెకండరీ పాఠశాలలతో సంబంధాలు ఏర్పడుతున్నాయి. జూన్ 9, 10 తేదీలలో అమలాపురంలో జిల్లా కౌన్సిల్ పెద్ద ఎత్తున జరిపి విద్యాగోష్ఠి నిర్వహించాము. రాష్ట్ర కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ ఉద్యమ వ్యాప్తికి, పటిష్ఠతకు తీవ్ర కృషి సాగిస్తున్నాం.

## ప. గో. జిల్లా:- శ్రీ యస్. ఆర్. పోలిసెట్టి

జిల్లాలో గల 8 సమితులలో 3 పట్టణాలలో ఉద్యమం వ్యాపించి ఉంది. 2050 సభ్యత్వం. 558 పత్రికలు వస్తున్నాయి. 21 జీవిత చందాలలో అగ్రగామిగా ఉంది. ఇంకా 30 దాకా వాగ్దానాలున్నవి. 7 సమితి 2 పట్టణశాఖల నిర్మాణం పూర్తయింది.

5 వేల కార్డులతో కార్డు క్యాంపెయిన్, 4500 సంతకాలతో విజ్ఞప్తి పత్రాలు పూర్తి చేయబడ్డాయి. వివిధ అధికారుల్తో రాయబారాలు ద్వారా సమస్యా పరిష్కార కృషిసాగుతున్నది. జడ్. పి. లోను సమితిల్లోను జరిగిన సమన్వయ సమావేశాల్లో పాల్గొంటున్నాము. చెన్నుపాటి వర్ధంతి సభలు దిగ్విజయంగా జరుపుకున్నాము. భీమవరంలో 151 మందితో ఉద్యమ క్లాసులు నిర్వహించాము. తూర్పు రాయలసీమ ఉపాధ్యాయ నియోజకవర్గ ఎన్నికల ప్రచారంలో జిల్లా కార్యదర్శులు శ్రీ వి. శ్రీరామమూర్తి, శ్రీ పి. సత్యనారాయణరాజుగార్లు పాల్గొని మన అభ్యర్థి విజయానికి కృషిచేశారు. జిల్లాశాఖ తరపున 19 సర్క్యులర్లు జారీ చేయబడ్డాయి సమస్యలపై కరస్పాండెన్స్ సాగింపబడుతున్నది. నూతన నిర్మాణంలో అధ్యక్షులు సెకండరీ రంగం నుండి వచ్చారు. ఉద్యమ పురోభివృద్ధికిది శుభ సూచన.

## కృష్ణాజిల్లా : శ్రీ యం. ఏసురత్నం

ఉద్యమం 7 సమితులలో ఒక మునిసిపాలిటీలో వ్యాపించి ఉంది. సభ్యత్వం 700. 4 జీవిత చందాలతో పత్రికలు 600 పైగా వెడుతున్నవి. రాష్ట్ర కార్యక్రమాలన్నిటిలో పాల్గొన్నాము గన్నవరం, విస్సన్నపేట సమితుల్లో ఉద్యమ శిక్షణ తరగతులు నిర్వహించాము. గన్నవరం సమితిలో బదిలీలలోని అక్రమాలనెదుర్కొనేందుకు మన యూనిట్ చొరవ తీసుకొని మిగిలిన సంఘాలతో ఐక్య కార్యాచరణ సమితి ఏర్పరచి కృషి సాగించింది. వివిధ సమస్యల పరిష్కార కృషిలో 11 సార్లు జిల్లా అధికార్లయొద్దకు రాయబారాలు నడిపేము. సమన్వయ సమావేశాల్లో పాల్గొంటున్నాము. చెన్నుపాటి వర్ధంతి సభలు తేలప్రోలులో విస్సన్నపేటలో జరిగేయి. 7 కార్యవర్గ, సబ్ కమిటీ సమావేశాలు జరిగేయి. 10 సర్క్యులర్లు జారీచేశాము. సెకండరీ రంగంలో ఉద్యమ వ్యాప్తి జరగాల్సి ఉంది.

## గుంటూరు జిల్లా : శ్రీ టి. అంజిరెడ్డి

9 సమితుల్లోను ఒక పట్టణంలోను 1900 సభ్యత్వంతో ఉద్యమం వ్యాపించి ఉంది. అందులో సెకండరీ సభ్యత్వం గణనీయంగా ఉంది 616 పత్రికలు, 13 జీవిత చందాలు సర్క్యులేషన్‌లో ఉన్నవి. వివిధ సమస్యలపై సమితులలోను, జడ్ పి. లోను, డి.ఇ.ఓ. ఆఫీసులోను, యల్. యఫ్. ఎ. ఆఫీసులోను రాయబారాలు జరిపి నిత్యం పరిష్కార కృషి సాగింపబడుతున్నది. జిల్లా, సమితి సమన్వయ సమావేశాల్లో పాల్గొంటున్నాము. 6 నెలలనుండి జీతాలు రాని గ్రేడ్ I హిందీ పండితులకు మిగిలిన జిల్లాలవలె జనరల్ ఫండ్స్ నుండి జీతాలివ్వాలని పోరాడటం జరిగింది. యమ్.యల్.సి. సహకారంతో తాత్కాలికంగా ఆగస్టు 76 వరకు జీతాలు సాధించినా ఆ సమస్యలపై యింకా తీవ్ర కృషిచేసి శాశ్వత పరిష్కారం సాధించాల్సిఉంది. జిల్లా శాఖ తరపున కంట్రోల్ ధరలకు నిత్యజీవితావసర వస్తువులు సప్లయి చేయించాలని కలెక్టర్‌ను, డి యస్.ఓను, ఆయా తాలూకాల తహసీల్‌దార్లను కలిసి ఆర్డర్లు ఇప్పించటం జరిగింది. ఫలితంగా రేపల్లె తాలూకాలో ప్రతి టీచర్‌కు కార్డుపై 2 కిలోలు పంచదార ఇవ్వటం జరుగుతున్నది. రాజుపాలెం సమితిలో స్టాండర్డ్ పర్మిషన్ సాధించటం జరిగింది. అవినీతి, అక్రమాలు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా నిర్విరామ పోరాటం జరుపుతున్నాయి. తూ॥ రాయలసీమ ఎన్నికల ప్రచారానికి జిల్లానుండి ముఖ్య కార్యకర్తలంతా వెళ్ళి ముందుండి తమవంతు కర్తవ్యాన్ని అమోఘంగా నిర్వహించారు. రేవేంద్రపాడులో ఉద్యమ తరగతులు నిర్వహించి జిల్లానుండి 50 మంది పాల్గొనటం జరిగింది. అనేకుల ఆదరాభిమానాలు పొందటం ద్వారా ఉద్యమానికి విశేష భవిష్యత్తు ఉంది.

## ప్రకాశం జిల్లా :- శ్రీ డి. రామిరెడ్డి

జిల్లాలో 14 సమితులలో గల ప్రాథమిక సెకండరీ స్కూళ్ళలో 1200 సభ్యత్వంతో ఉద్యమం వ్యాపించి ఉంది. అన్నింటిలో ఉలవపాడు సమితిశాఖ నిర్మాణం అత్యంత పటిష్టవంతంగా నిర్మాణయుతంగా పనిచేస్తున్నది జిల్లాశాఖ నిర్మాణం 18-7-76 న జరిగింది. ఆ రోజున విద్యాగోష్టి జరిపేము. సమస్యలపై వివిధ స్థాయిలలో అధికారులతో రాయబారాలు జరిపి పరిష్కార కృషిసాగిస్తున్నాము. సమన్వయ సమావేశాల్లో పాల్గొంటున్నాము. తెలుగుపండితుల డిప్యుటేషన్ ఇప్పించాము. సెలక్షన్ గ్రేడు సమస్య చేపట్టాల్సి ఉంది. రెండు నెలలకొకసారి సర్క్యులర్లు పంపుకున్నాం. 380 పత్రికలు 3 జీవిత చందాలు వస్తున్నవి.

## నెల్లూరు జిల్లా:- శ్రీ టి. కొండాచారి

ఉద్యమం 7 తాలూకాలలో 1400 సభ్యత్వంతో వ్యాపించి ఉంది. జిల్లాశాఖ గణనీయ కృషిఫలితంగా తూర్పు రాయలసీమ ఎన్నికలలో ఘనవిజయం సాధించటం జరిగింది. సమన్వయంగా నిర్మాణయుత కృషిసాగిస్తే జిల్లా ఉద్యమానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉంది.

బుచ్చిరెడ్డి పాలెంలో ఉద్యమ క్లాసులు నిర్వహించాం. జిల్లాపరిషత్తు చరిత్రలో మొదటిసారిగా సమన్వయసమావేశాన్ని జరిపించుకొని సెంపరరీ టీచర్ల ఇంక్రిమెంట్లు మంజూరు, వారిని వేసవి సెలవుల్లో కంటిన్యూ చేయించుకోవటం, 7 సం॥ నుండి లేని జిల్లా సెలక్షన్ కమిటీ పునరుద్ధరణ, సెలక్షన్ గ్రేడ్ పోస్టుల మంజూరు అర్హతగల పండితులను శిక్షణకు పంపటం మొదలగు జటిల సమస్యలపై తీవ్రకృషి సాగించగా విజయమయ్యాయి. ఈ కాలంలో 10 సర్క్యులర్లు జారీచేశాము. 7 కార్యవర్గ సమావేశాలు, 8 సబ్ కమిటీ సమావేశాలు, 3 కౌన్సిల్ సమావేశాలు జరుపుకొన్నాము. 420 పత్రికలు 4 జీవిత చందాలు వస్తున్నవి.

## ఖమ్మం జిల్లా : శ్రీ వి. మల్లికార్జునరావు

ఉద్యమం ఉరుకులు పరుగులతో దూసుకు వెళ్ళలేక

పోయినా తాపీగా, స్థిరంగా ఎదురైన అటంకాన్ని అధిగమిస్తూ ముమ్మందుకు పురోగమిస్తున్నది. జిల్లాలో విశిష్టతను నిల్పుకొంటూ తాను కదిలి ఇతరులను కదిలిస్తున్నది. 7 సమితులలో 900 సభ్యత్వంతో 530 పత్రికలతో 5 జీవితచందాలతో ముందుకు పోతున్నది. జిల్లా కార్యాలయాన్ని నిర్వహిస్తూ ప్రతి ఆదివారం యేదో ఒక కార్యక్రమాన్ని నడుపుతున్నది. పరిషత్తులలోను, తక్కువగా వున్నా, అనేక అటుపోటు లెదురైనా మన కార్యకర్తలు నిర్విరామ కృషిసల్పి ఉద్యమం విచ్ఛిన్నకులకు స్వార్థపరులకు అవకాశవాదులకు గుణపాఠంచెప్పి రాష్ట్ర ఉద్యమానికి ఉత్సాహోత్తేజాలు కల్గటానికి కారకులయ్యారు.

వివిధ సమితులలోను సమన్వయ సమావేశాలు జరిగేట్టుచూసి హాజరైన సంఘ ప్రతినిధులకు అన్‌డ్యూటీ సాధించటంజరిగింది. ఖమ్మం, మధిర, కొత్తగూడెం సమితులలో ఉపాధ్యాయ కో ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీలు మన సంఘ ముఖ్యులతో సమితులలో నడుపబడుతున్నవి. కొత్తగూడెం సమితిలో జీవితావసర వస్తువులకు చెందిన రేషన్ కార్డులు సాధించడం, ఏజన్సీ ఏరియాలలో బదిలీల నిలుపుదల సాధించటం, పరిషత్తులోను, సమితులలోను సమస్యలపై నిత్య పరిష్కార కృషి సాగించటం ఏజన్సీ ఎలవెన్స్ సాధనకై తీవ్ర కృషి సాగించి సాధించటం సెలవుల్లో జడ్. పి. స్కూళ్ళ జి పి యఫ్. లెఖ్ఖలు తయారు చేయటం మొదలైన కార్యక్రమాలలో ఉపాధ్యాయుల అభిమానాల్ని పొందటం జరుగుతున్నది. ఎడ్వర్ టైజ్‌మెంట్స్, జనరల్ ఫండ్ సేకరణ, పత్రికలకోటాలు పూర్తిచేయటమేగాక లక్ష్యాలను అధిగమించటం కూడా జరిగింది.

## నల్లగొండ జిల్లా : శ్రీ పి. సత్యనారాయణ

సభ్యత్వం 200 అయినా ఇప్పుడిప్పుడే వివిధ సమితుల్లో కాలూను కొని ఉద్యమం జిల్లా వ్యాప్తి పొందుతున్నది. మన సభ్యులు 10 సమితుల్లో ప్రాంతీయ సమావేశాలు ఏర్పాటు చేసుకొని ప్రోత్సాహం పొంది పురోగమిస్తున్నారు యువతరం ముందుకు రావటం వలన కొత్త ఊపు వచ్చింది. దాన్ని మనం సంఘటిత పఱచుకొని సజీవంగా నడిపించుకోవాలి. పత్రికలు 200 దాకా వస్తున్నవి. తెలంగాణా ప్రాంతానికి నిర్దేశించిన ఉద్యమ క్లాసులు మా జిల్లాకు చెందిన పోచంగోడులో జయప్రదంగా నిర్వహించుకొన్నాము. అక్రమ ప్రమోషన్ల రద్దును గురించిన హైకోర్టు ఆదేశాలను అమలు జేసే పోరాటంలో మనం ప్రథమశ్రేణిలో ఉన్నాము. 1956-59 మధ్య నియమింపబడిన టీచర్ల సర్వీసు క్రమబద్ధం చేయటం, బదిలీల సందర్భంలో టి. ఎ ల మంజూరు, సూర్యాపేట ఎయిడెడ్ స్కూలులో డైరెక్ట్ పేమెంట్, బ్రాంచి పోష్టుమాష్టర్ల బదిలీల రద్దు మొదలగు సమస్యలపై జిల్లాశాఖ తీవ్ర కృషి సాగించింది. కార్యకర్తల కొరత తీరితే, ఆర్థిక వనరులు లభిస్తే జిల్లా సంఘం ఇంకా పటిష్టం కాగలదు.

## వరంగల్లు జిల్లా: శ్రీ కె. భద్రయ్య

సభ్యత్వం 400. పత్రిక చందాలు 124. జీవిత చందా 1. గతంకంటె సభ్యత్వం పెరిగింది. వరంగల్ పట్టణం నూతనంగా నిర్మాణంలోకి వచ్చింది. జిల్లా శాఖ నిర్మాణం 23-8-76 న పూర్తయింది. జిల్లా విద్యాశాఖాధికారి, జడ్. పి. సెక్రటరీ గార్లతో ఉపాధ్యాయ సమస్యలపై రాయబారాల ద్వారా పరిష్కారకృషి సాగించబడింది. వరంగల్ వాణీనికేతన్ ఎయిడెడ్ ఉపాధ్యాయులకు మన కృషిఫలితంగా పదివేలరూపాయలు ఎరియర్సువచ్చాయి. అయితే వారికి రెగ్యులర్‌గా జీతాలు, పి. యఫ్. సొమ్ము మొదలైనవి పరిష్కారం కావల్సి వుంది.

## హైదరాబాద్: శ్రీ యమ్. వరహరి

సభ్యత్వం 82. పత్రికలు 75 నిర్మాణం జరగాల్సిఉంది. జిల్లాపరిషత్, డి. యి. ఓ ఆఫీసులలో సమస్య పరిష్కారానికి కృషి జరుగుతున్నది. రాష్ట్ర సబ్ ఆఫీసు నిర్వహణ చేస్తున్నాయి. కార్యకర్తల కొరత వలన ఉద్యమ వ్యాప్తి కుంటుబడింది. నిర్మాణం మరింత కట్టుదిట్టంగా జరగాల్సిఉంది.

## నిజామాబాద్:— శ్రీ పి. అమరేశ్వరరావు

సభ్యత్వం 144. పత్రికలు 241. జీవితచందాలు 5. నిర్మాణం జరిగింది. పత్రికా క్యాంపెయిన్‌తో, జీవిత చందాలు చేర్పించటంలో ఆదర్శకృషి జరిగింది. కార్యకర్తల కొరత ఉంది. రాష్ట్ర సహకారం ఉంటే నిర్మాణం చక్కబడుతుంది.

## మహబూబ్‌నగర్ : శ్రీ కె. రామిరెడ్డి

సభ్యత్వం చేరింది. నిర్మాణానికై కృషి సాగుతున్నది, కార్యకర్తల కొరత ఉన్నా ఉన్న మేరకు కదిలి పనిచేస్తున్నాము. పత్రికలు చేర్పించుటలో పట్టుదలతో కృషి చేస్తున్నాము. పత్రికలు 125 వస్తున్నవి.

## కర్నూలు: శ్రీ జి. గోవిందప్ప

సభ్యత్వం 100. పత్రికలు 58. నిర్మాణం జరగవలసి ఉంది. కార్యకర్తలు కలసి కట్టుగా పనిచేస్తే నిర్మాణం మరింత మెరుగు పడుతుంది.

చిత్తూరు: సభ్యత్వం క్యాంపెయిన్ ప్రారంభమయింది. ఇటీవల శ్రీ యమ్. మాధవరావు యమ్. యల్. సి. శ్రీ డి రామిరెడ్డి, శ్రీ కె. తిరిపాలు, శ్రీ యమ్. అర్జునరెడ్డి, శ్రీ కె. వెంకటేశ్వర్లు, శ్రీ జి. ప్రభాకరరావు, శ్రీ సి. మహాదేవరెడ్డి. జిల్లాఅంతా పర్యటించి నిర్మాణానికి పునాదులు వేశారు. సభ్యత్వం కోటా వెయ్యి. పత్రికలు 50 వెళ్తున్నవి.

ఇవిగాక కడప, అనంతపురం, శ్రీకాకుళం, కరీంనగర్ మెదక్, అదిలాబాద్ జిల్లాలలో గుడా ఉద్యమ సంబంధాలేర్పడ్డాయి. త్వరలో నిర్మాణం సాగించాల్సిఉంది.

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## ఆర్థిక నివేదిక

### 1-1-1976 నుండి 30-9-1976

| | జమలు | ఖర్చులు |
|---|---|---|
| 1. గతనిల్వ ... | 700.12 | |
| 2. 1976 సం॥ సభ్యత్వం ... | 6,285 00 | |
| 3. జనరల్ ఫండు ... | 2 007 00 | |
| 4. విరాళములు ... | 1,194 00 | |
| 5. బ్యాంకు వడ్డీ ... | 19 80 | |
| 6. అమ్మకం ఖాతా ... | 32 00 | |
| 7. డెలిగేట్ ఫీజు ... | 184 00 | |
| 8. ఎన్నికల నిధి ... | 1,425 00 | |
| 9. అప్పుల ఖాతా ... | 2,580 03 | |
| 10. ప్రయాణములు, సాదర్లు ... | | 2,937 95 |
| 11. అలవెన్సులు ... | | 4,003 65 |
| 12. ప్రింటింగు, తైపు ... | | 1,309 25 |
| 13. పోస్టేజి ... | | 257 45 |
| 14 సమావేశములుఏర్పాటుకు ... | | 349 65 |
| 15. ఆఫీసు అద్దె ... | | 501 60 |
| 16. స్టేషనరీ ... | | 2,554 95 |
| 17. ఆఫీసు నిర్వహణ ... | | 188 30 |
| 18. హైదరాబాదు బ్రాంచిఆఫీసు నిర్వహణ | | 150 00 |
| 19. కౌన్సిలు ఎన్నికల ఖర్చు ... | | 1,040 00 |
| మొత్తం | 14,427 55 | 13 293 23 |
| బ్యాంకు నిల్వ | | 1,064 03 |
| చేతి నిల్వ | | 70 29 |
| | 14,427 55 | 14,427 55 |

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

### 1-11-1974 నుండి 30-9-76

## ఆడిట్ నివేదిక

| | జమలు | ఖర్చులు |
|---|---|---|
| సభ్యత్వము ... | 12 050-00 | |
| జనరల్ ఫండు ... | 3,762-50 | |
| విరాళములు ... | 6,166-00 | |
| బ్యాంకు వడ్డీ .... | 44-05 | |
| నిబంధనావళులు | | |
| అమ్మకం .... | 32-60 | |
| ఎన్నికలనిధి .... | 1,425-00 | |
| లైబ్రరీ ఖాతా ... | 25-50 | |
| డెలిగేటు ఫీజు ... | 334-00 | |
| అప్పులు ... | 4,593-55 | |
| ప్రయాణములు,సాదర్లు ... | | 7,033-53 |
| ప్రింటింగు, తైపు ... | | 3 726-28 |
| స్టేషనరీ ... | | 4,078-34 |
| పోస్టల్ ఖాతా ... | | 633-35 |
| అలవెన్సులు .... | | 8,103-68 |
| ఆఫీసు అద్దె ... | | 1,435-90 |
| లైబ్రరీ ఖాతా .... | | 111-15 |
| సమావేశములనిర్వహణ ... | | 482-65 |
| విరాళములు ... | | 100-00 |
| ఆఫీసు నిర్వహణ ... | | 188-30 |
| హైదరాబాదు బ్రాంచి కార్యాలయంనిర్వహణ.... | | 150-00 |
| ఎన్నికల ఖర్చు ... | | 1,040-00 |
| మిస్‌లేనియస్ ... | | 215-70 |
| | 28,433-20 | 27,298-88 |
| బ్యాంకు నిల్వ | | 1,064-03 |
| చేతి నిల్వ | | 70-29 |
| | 28 433-20 | 28,433-20 |

గుంటూరు, వి. సత్యనారాయణరాజు, టి కొండాచారి.
30-9-76. ఆడిట్ కమిటీ.

# ఐక్య ఉపాధ్యాయ పత్రిక

## ఆర్థిక నివేదిక

| | | జమలు | ఖర్చులు |
|---|---|---|---|
| గత నిల్వ | | 10,616-60 | |
| సంవత్సర చందాలు | 3005 | 30,050-00 | |
| అర్థ సంవత్సర చందాలు | 66 | 330-00 | |
| జీవిత చందాలు | 37 | 4.408-00 | |
| అడ్వర్‌టయిజుమెంట్లుద్వారా | | 3,456-79 | |
| విడి పత్రికల అమ్మకం | | 698-90 | |
| అనామతు ఖాతా | | 85-00 | |
| బ్యాంకు వడ్డీ | | 303-50 | |
| మిసిలేనియస్ | | 178-76 | |
| ప్రయాణములు సాదర్లు | | | 1,931-60 |
| స్టేషనరీ | | | 731-56 |
| ప్రింటింగు | | | 19,772-21 |
| అలవెన్సు | | | 4 226-35 |
| పోస్టేజి | | | 1,369-10 |
| లైబ్రరీ | | | 566-15 |
| ఆఫీసు అద్దె | | | 402-30 |
| రావలసిన బాకీలు | | | 3,385-44 |
| ఫిక్సిడ్ డిపాజిట్ | | | 4,000-00 |
| బ్యాంకు నిల్వ | | | 14,039-67 |
| చేతి నిల్వ | | | 3-17 |
| | | 50, 127-55 | 50, 127-55 |

గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూలునందు 1976 సెప్టెంబరు 29, 30 తేదీలలో జరిగిన

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 3వ నూతన రాష్ట్ర కౌన్సిల్ సమావేశములో

# ఆమోదించబడిన తీర్మానాలు

## సంతాప తీర్మానములు

1. జనచైనా అగ్ర నాయకులు, చైనా విప్లవ పోరాటానికి సారథ్యం వహించిన నేతలు, ఆధునిక చైనా నిర్మాతలైన కామ్రేడ్ మార్షల్ చూటే, కామ్రేడ్ మావో సేటుంగ్‌ల మరణానికి ఈ కౌన్సిల్ తన ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ, వారికి విప్లవ జోహారులర్పిస్తున్నది.

2 విశ్వ విఖ్యాత గాయకుడు, నీగ్రో నాయకుడు, శాంతిదూత పాల్ రాబ్సన్ మృతికి ఈ కౌన్సిల్ తన సంతాపాన్ని ప్రకటిస్తూంది పాల్ రాబ్సన్ కివే మా జోహార్లు

3. గరిబోళ్ళ డాక్టరుగా పేరెన్నిక గన్న డాక్టర్ సత్యపాల్ తులి, బెనారస్ హిందూ విశ్వ విద్యాలయ ముమందే వామపక్ష ప్రజాతంత్ర ఉద్యమము వైపు ఆకర్షితులై తెలుగునాట వామపక్ష రాజకీయ వ్యాప్తికి కృషి చేసినవారు ఆంధ్రప్రదేశ్ మాజీ శాసన సభ్యులైన కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డి, కామ్రేడ్ వులువుల శివయ్య గార్ల మరణానికి ఈ కౌన్సిల్ తన ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ వారికి విప్లవ జోహార్లు అర్పిస్తున్నది.

4. తన విప్లవ గేయాలతో వేలాది బెంగాలీలను సాహసోపేతమైన పోరాటాలకు త్యాగాలకు ప్రేరేపించిన విప్లవ మహాకవి కాజీ నజ్రుల్ ఇస్లామ్ మృతికి ఈ జనరల్ కౌన్సిల్ తన సంతాపాన్ని వ్యక్తంచేస్తున్నది. ఆయనకి ఈ కౌన్సిల్ జోహార్లర్పిస్తున్నది.

5. మద్రాసు రాష్ట్ర విద్యాశాఖ డైరక్టరుగా, ఆంధ్రప్రదేశ్ ప్రథమ విద్యాశాఖ డైరక్టరుగా, ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా పనిచేసిన ప్రముఖ విద్యావేత్త, పరిపాలనాదక్షులైన డా॥ సదాశివరెడ్డి గారి మృతికి తన సంతాపాన్ని తెలియజేస్తున్నది.

ప్రజాశక్తి సబ్ ఎడిటరుగా, అభ్యుదయ మాసపత్రిక వర్కింగు ఎడిటరుగా పనిచేసి ప్రస్తుతము ఆంధ్ర విశ్వవిద్యాలయము తెలుగుశబ్ద వ్యుత్పత్తికోశంపథకం డిప్యూటీ డైరక్టరుగా పనిచేస్తున్న శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రి గారి మృతికి ఈ కౌన్సిల్ తన సంతాపాన్ని ప్రకటిస్తున్నది

6. ప్రముఖ హిందీసినీ గాయకుడు శ్రీ ముఖేష్ తెలుగు సినీగాయకుడు శ్రీ ఘంటసాల? [illegible] వరపు నరసింహారావు, అభ్యుదయ రచయిత, నాట్యకళ సంపాదకులు, విమర్శకులు, కళాకారుడు శ్రీ శ్రీనివాస చక్రవర్తి, ప్రముఖ నాటక రచయిత, దర్శకుడు, నటుడు శ్రీ చింతపల్లి హనుమంతరావుగార్ల మృతికి ఈ కౌన్సిల్ తన విచారమును వ్యక్తంచేస్తూ తన సంతాపాన్ని ప్రకటిస్తున్నది.

## విద్యా విషయిక తీర్మానములు

పనిగంటలు, పనిదినములు పెంపుపై తీర్మానము: ఆధునిక విద్యావిధానమును బ్రిటిష్ ప్రభుత్వ హయాములో మెకాలే ప్రవేశపెట్టాడు. నాడు ఇంగ్లండులో దినమునకు

---

### ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 3వ జనరల్ కౌన్సిల్ సమావేశసందర్భములో సమర్పించు ఆర్థికనివేదిక

### ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆడిట్ నివేదిక

| 1-11-74 ను 30-9-76. | | జమలు | ఖర్చులు |
|---|---|---|---|
| సంవత్సర చందాలు | 7173 | 67,602-00 | |
| 2064 × 8 రు చొ॥న | | | |
| 5109 × 10రు. చొ॥న | | | |
| అర్ధసంవత్సర చందాలు: | 130 | 629-00 | |
| 24 × 4 రు. చొ॥న | | | |
| 106 × 5 రు. చొ॥న | | | |
| జీవిత చందాలు | 63 × 116 | 7,308-00 | |
| సావనీర్లు | | 1,534-00 | |
| విడి కాపీలు | | 1,340-95 | |
| అడ్వర్టయిజు మెంట్లు | | 10,545-79 | |
| బ్యాంకు వడ్డీలు | | 364-05 | |
| విరాళములు | | 151-80 | |
| అనామతు | | 85-00 | |
| ఇతర జమలు | | 178-76 | |
| ప్రయాణములు, సాదర్లు | | | 4,909-10 |
| స్టేషనరీ | | | 1,230-90 |
| ప్రింటింగు | | | 47,829-29 |
| అలవెన్సులు | | | 6,531-75 |
| పోష్టలు | | | 2,411-90 |
| లైబ్రరీ | | | 303-90 |
| ఆఫీసు అద్దె | | | 699-50 |
| ఆఫీసు నిర్వహణ | | | 488-00 |
| అప్పులు | | | 7,196-77 |
| మిసిలేనియస్ | | | 92-40 |
| | | | 71,693-51 |
| ఫిక్సెడ్ డిపోజిటు | | | 4,000-00 |
| బ్యాంకు నిల్వ | | | 14,039-67 |
| చేతి నిల్వ | | | 3-17 |
| | | 89,736-23 | 89,736-35 |

ది 30-9-76 | గుంటూరు |

పి. కొండాచారి,
పి. సత్యనారాయణరావు,
ఆడిట్ కమిటీ.

అయిదు పని గంటలు వారమునకు $5\frac{1}{2}$ పని దినములుగా నున్నవి. భారతదేశపు వాతావరణ పరిస్థితులను గమనించి దినమునకు $4\frac{1}{2}$ పనిగంటలు వారమునకు 5 దినములు సంవత్సరమునకు 180 పనిదినములుగా నిర్ణయించుట జరిగినది. విద్యా స్థాయి పెంచవలయుననెడు నెపముతో రోజుకు 5 గంటలు వారానికి $5\frac{1}{2}$ రోజులు సంవత్సరమునకు 200 పని దినములుగా స్వాతంత్ర్యానంతరం పెంచుట జరిగినది. అంతటితో ఆగక కొఠారి కమీషన్ వారి సూచనలంటూ దినమునకు $5\frac{1}{2}$ గంటలు వారానికి 6 దినములు సంవత్సరమునకు 220 పని దినములుగా పెంచుట జరిగినది. జి. ఓ. నెం. 749 తేదీ 31-7-1976 ద్వారా దినమునకు 6గంటలు, వారమునకు 6 దినములు, సంవత్సరమునకు 240 దినములుగా పనిగంటలు, పని దినములు పెంచుట జరిగినది. పిల్లవాని మానసిక ప్రవృత్తులను గమనములోనికి తీసికొనిగాని, ఆచరణలో లభించుచున్న ఫలితముల నుండి శాస్త్రీయమైన నిర్ణయాలకు వచ్చిగాని ఈ మార్పులు చేసినట్లు కనిపించుటలేదు. విద్యాభివృద్ధికి పని గంటలు, పని దినములు పెంపు శాస్త్రీయమైన పరిష్కార మార్గము కాజాలదని గతానుభవమునుబట్టి ఈ కౌన్సిల్ గాఢముగా విశ్వసిస్తున్నది. ఈ ఆలోచనా ధోరణిలోనున్న అశాస్త్రీయతను పునరాలోచించి ఈ ఉత్తరువులను ఉపసంహరించవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరుచున్నది.

2. నూతన మూల్యాంకనా విధానము:- ప్రగతిని సాధించుటకు ప్రణాళికాబద్ధమైన కార్యక్రమము అవసరమే. ఎంతటి ఉత్తమమైన ప్రణాళికయైనను తగినన్ని భౌతిక వసరులు లేకుండా ఫల ప్రదము కాజాలదు. అభివృద్ధి చెందిన దేశములలో నున్న విద్యా విధానములు నిచ్చట అన్వయింపజేసి విద్యాభివృద్ధిని సాధించవలెననిడి విషయము హర్షనీయమే ఆశించిన ఫలితములను సాధించవలయునని తగినన్ని భౌతిక వనరులను సమకూర్చవలసి యున్నది. నూతన మూల్యాంకనా విధానమును జయప్రదమగుటకు కావలసిన భౌతిక పరిస్థితులన్నిటిని అత్యవసర ప్రాతిపదికపై కలుగు జేయవలెనని ఈ కౌన్సిల్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారిని కోరుచున్నది.

3. ఉపాధ్యాయుడు విద్యార్థుల నిష్పత్తి :- విద్యా ప్రమాణాలు దిగజారిపోవుచున్నవనెడి వాదన సర్వే సర్వత్ర వినవచ్చుచున్నది. విద్యా ప్రమాణాల అభివృద్ధిని సాధించుటకు ఒక్కొక్క విద్యార్థిపై ప్రత్యేకమైన శ్రద్ధచూపుటకు ఉపాధ్యాయునికి తగిన అవకాశముండవలెను. ప్రభుత్వము వారు ఉపాధ్యాయు, విద్యార్థి నిష్పత్తి 1:30 చేయుచూ ఉత్తరువులు యిచ్చియున్నారు. ఈ మార్పువలన ఒక్కొక్క విద్యార్థిపై ప్రత్యేకశ్రద్ధ చూపు అవకాశము తగ్గుచున్నది. ఉపాధ్యాయుల రిట్రెంచిమెంట్‌కు దారితీసెడి ప్రమాదమున్నది. ఏవిధముగాను ఈచర్య ఆరోగ్యకరమైనదికాదు. కావున ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పత్తి 1;20 చెయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును ఈ కౌన్సిల్ అభ్యర్థించుచున్నది. అటులనే ఏజన్సీ ప్రాంతములో ఈ నిష్పత్తి 1:15 గా మార్చవలసినదిగా కోరుచున్నది.

4. ఏకోపాధ్యాయ పాఠశాలల మార్పు : ఒకే ఉపాధ్యాయుడు పనిచేయు ప్రాథమిక పాఠశాలలో 1 నుండి 5వ తరగతివరకు పాఠ్యబోధనచేయుట కష్టతరము. ఆచరణలో ఏకోపాధ్యాయ పాఠశాలలు పిల్లల విద్యాభివృద్ధికి ఆశించినంతగా తోడ్పడజాలకున్నది. ఆచరణలో వీని వైఫల్యమును గమనములోనికి తీసుకొని వీటన్నింటిని బహుళోపాధ్యాయ పాఠశాలలుగా మార్చుచు తగు ఉత్తరువుల నీయవలసినదిగా ప్రభుత్వము వారికి విజ్ఞప్తి చేయుచున్నది.

5. పాఠ్యగ్రంథముల సరఫరా:- విద్యాసాధనకు పాఠ్యగ్రంథములు అత్యవసరము. పాఠశాలలు ప్రారంభించిన రెండు నెలలకుకూడా కొన్ని పాఠ్యగ్రంథములు లభ్యము కాకపోవుట శోచనీయము. లభ్యమైనప్పటికీ హెచ్చుఖరీదులకు విక్రయించుటకు పుస్తక విక్రేతలు ప్రయత్నము చేయుచున్నారు. ఈ దుస్థితి తొలగవలసి యున్నది. పాఠశాలలు తెరుచు నాటికే పాఠ్య గ్రంథములన్నియు లభించునట్లుగాను, పుస్తక విక్రేతలు అధికలాభములను గడించుట కవకాశము కలుగకుండునట్లు గట్టి చర్యలను గైకొనవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి విజ్ఞప్తి చేయుచున్నది.

6 ప్రాథమికోన్నత పాఠశాలలు:- సిబ్బంది నియామకాలు. 1,000 పైబడిన జనాభాగల గ్రామమునకొక పాఠశాలను నెలకొల్పుట హర్షదాయకము. ప్రాథమికోన్నత పాఠశాలలు ఇద్దరు, ముగ్గురు ఉపాధ్యాయులచే నడుపబడుచున్నవి. 1వ తరగతి నుండి 7వ తరగతి వరకు విద్యార్జనచేయు విద్యార్థులందరు ఈ రకమైన సిబ్బంది నియామకాలు ఆశించిన సత్ఫలితాలను సాధించజాలవు.

ప్రాథమికోన్నత పాఠశాలలన్నింటి యందును కనీసము 1 బి. ఇ. డి. ఉపాధ్యాయుడు 4 సెకండరీ ఉపాధ్యాయులు 2వ తరగతి హిందీ, తెలుగు పండితులు, డ్రిల్లు డ్రాయింగు, వాచ్‌మన్ కమ్ వాటర్‌మెన్ మొదలగు సిబ్బంది నియామకాలు జరపవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిని కోరడమైనది.

7. బదిలీలపై తీర్మానము:- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిచ్చిన 163, 429 ఉత్తరువుల ప్రకారము అందలి నిబంధనలను అతిక్రమించి అనేక అక్రమ బదిలీలు జరిగి వాటిని రాష్ట్రవ్యాపితముగా ప్రభుత్వమువారి దృష్టికి ఉపాధ్యాయ సంఘాలు తీసుకొని రావడం జరిగినది. అక్రమ బదిలీలను రద్దు చేయవలసినదిగా ప్రభుత్వమువారు ఒసంగిన ఉత్తరువులు వున్నను అనేక సందర్భాలలో వాటి రద్దు జరుగలేదు ప్రభుత్వమువారు వెంటనే ఈ విషయములో జోక్యము చేసుకొని అక్రమ బదిలీలను రద్దు చేయవలసినదిగాను ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో ఒక సమావేశమును ఏర్పాటు చేసి శాస్త్రీయ పద్ధతిపై బదిలీకోడ్‌ను రూపొందించవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నది.

8. ఎ. ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలు:- కుటుంబ సంక్షేమ పథకమును ప్రభుత్వము పంచాయితీరాజ్, మ్యునిసిపల్ ఉపాధ్యాయులకు వర్తింపజేసిన విధముగానే ఎయిడెడ్ పాఠశాలలో పనిచేయు ఉపాధ్యాయులకుకూడ వర్తింప జేయాలని ఈ కౌన్సిల్ డిమాండ్ చేస్తూవుంది. ఇతర యాజమాన్యా

లలో పనిచేస్తూ మరణించిన ఉపాధ్యాయులకు దీనిని వర్తింపజేసిన విధముగానే ఎయిడెడ్ పాఠశాలలో పనిచేస్తూ మరణించిన ఉపాధ్యాయుల కుటుంబాలకు కూడా 1974 అక్టోబరు నుండి సహాయము నందించాలని ఈ సమావేశము డిమాండు చేస్తున్నది.

బి. విజయవాడ, గుంటూరు మొదలు గాగల పట్టణాలన్నింటిలో పనిచేయుచున్న ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ఇతర యాజమాన్యములో పనిచేయుచున్న ఉపాధ్యాయుల వలె 15 శాతము ఇంటి అద్దె సౌకర్యమును కలుగజేస్తూ వెంటనే ఉత్తరువు లివ్వాలని ఈ కౌన్సిల్ కోరుతూ ఉన్నది.

సి. ప్రభుత్వపంచాయితీ రాజ్ పురపాలకసంఘాల ఆధీన పాఠశాలలో పనిచేస్తూ వున్న ఉపాధ్యాయులందరికి వర్తించే ఆంధ్రప్రదేశ్ సెలవు నిబంధనలు 1933 ఎట్టి మినహాయింపులు వివక్షత లేకుండా ఎయిడెడ్ పాఠశాలలో పనిచేయు ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల ఉపాధ్యాయులందరికి వర్తింపచేయాలని ఈ సమావేశ ముఖముగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అభ్యర్థించుచున్నది.

డి. ఎయిడెడ్ పాఠశాలల్లో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు కూడా ప్రతి నెల 1వ తేదీ నాటికి జీతములు యిచ్చు ఉత్తరువులిస్తూ మూడు నెలలకూ ఒక పర్యాయము యీ ఉత్తరువులు సక్రమముగా అమలు జరుగుచున్నవో లేదో సమీక్షించుటకు కనీసము మూడు నెలలొక పర్యాయము ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో సమన్వయ సంఘ సమావేశములను జిల్లా, రాష్ట్రస్థాయిలలో నేర్పాటుచేసి అమలునకు కట్టుదిట్టమైన చర్యలు తీసికొనవలయునని ఈ కౌన్సిల్ తీర్మాన రూపములో ప్రభుత్వమును కోరుచున్నది.

ఇ. ఎయిడెడ్ పాఠశాలల్లో పనిచేయుచున్న ఉపాధ్యాయుల సర్వీసు భద్రతల నిమిత్తము ఆర్డినెన్సు జారిచేసినప్పటికి అనేక పాఠశాలల్లో పనిచేయుచున్న ఉపాధ్యాయులు వివక్షణా రహితముగా కక్షసాధింపు చర్యలకు గురిచేయబడుచున్నారు. ఎయిడెడ్ మేనేజిమెంట్లు ఉపాధ్యాయులపై చేయు స్వైర విహారము అడ్డు అదుపు లేకుండా యథేచ్ఛగా సాగుచున్నది. ఈ విశృంఖలత్వాన్ని అరికట్టుటకు కట్టుదిట్టమైన చర్యలను తీసుకోవాలని ఉపాధ్యాయులకు రక్షణ కల్పించాలని అందుకు గాను శాసనబద్ధమైన స్థితిని కల్పించాలని ఈ కౌన్సిల్ సమావేశము డిమాండ్ చేస్తూయున్నది. కక్షసాధింపు చర్యలకు గురైన ఉపాధ్యాయులకు వెంటనే రక్షణ కల్పిస్తూ ఉత్తరువులు యీయవలసినదిగా కోరుచున్నది.

ఎఫ్. వివిధ యాజమాన్యములలో పనిచేయు చున్న ఉపాధ్యాయ సర్వీసు నిబంధలలో నున్న వివక్షతను తొలగించాలని విద్యాశాఖనుండి వెలువడిన ఉత్తరువులు అందరికి సమానముగా వర్తించాలని కోరుతూ యీ కౌన్సిల్ తీర్మానించుచున్నది.

9. పూర్వపు వేతన నిర్ణాయక సంఘాలలో జరిగిన అనామలీల తొలగింపుకై నియమింపబడిన గౌరవనీయమైన ప్రసాద్ కమిటీ వాటిని పరిష్కరింప పోగా అనేక కొత్త అనామలీలను సృష్టించింది. అన్ని ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో కూడిన అనామలీల పరిష్కార సంఘాన్ని ప్రభుత్వ ఆర్థిక విద్యాశాఖ కార్యదర్శులు విద్యాశాఖ అధ్వర్యమున డైరెక్టర్ సభ్యులుగా ఏర్పాటుచేసి తక్షణమే పరిష్కరించాలని ఈ కౌన్సిల్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నది.

10. ఉపాధ్యాయులకు అధనపు బాధ్యతలను నిర్వర్తించినందుకుగాను ఇచ్చే అలవెన్సులు 1958 లో నిర్ణయింపబడినాయి. ఆతరువాత జరిగిన వేతన పునర్నిర్ణాయక సంఘాలలో కూడా పరిశీలించెదమనెడి హామీలే కాని ఆచరణలో ఏమియును జరగలేదు. ప్రసాద్ కమిటీవారు చేసిన సూచనల మేరకైనా వివిధ అలవెన్సులను మార్పుచేస్తూ వెంటనే ఉత్తరువులు యివ్వవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించు చున్నది.

11. స్వతంత్ర ప్రతిపత్తిగల విద్యాబోర్డు ఏర్పరచి వివిధ యాజమాన్యముల క్రిందనున్న పాఠశాలలను ఆ బోర్డుకు అప్పగించవలసినదిగా కొఠారికమిషన్ వారు సూచించియున్నారు. విద్యాభివృద్ధికి కొఠారి సూచనలను పాటిస్తున్నామని చెప్పుచున్న నిర్ణయములు ప్రభుత్వం వివిధ పాఠశాలలను వివిధ యాజమాన్యముల అధీనమునకు అప్పగించు చుండుటవలన విద్యా విషయిక సమస్యలు ఉపాధ్యాయుల సమస్యలు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుచున్నవి. సమస్యల పరిష్కర్తలే సమస్యల సృష్టికర్తలుగా మారుట విచారకరము. ఈ తరుణములో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు తమ అధీనములో నున్న కొత్తగూడెము ప్రభుత్వ బాలికోన్నత పాఠశాలను సింగరేణి కాలరీ యాజమాన్యమునకు అమ్ముట అత్యంత విచారకరము అందు పనిచేయు ఉపాధ్యాయులను జిల్లా పరిషత్తునకు బదలాయించి తాను నిర్ణయించిన విధానమును తానే కాలరాయుట అత్యంతఆందోళనాకరము. ఈ దురదృష్టకర పరిస్థితిని తొలగించవలసినదిగా కౌన్సిల్ విజ్ఞప్తి చేయుచున్నది.

12. కీ॥ శే॥ డాక్టర్ బూరుగుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేయు కాలములో కొత్తగూడెము పట్టణంలో గృహసౌకర్య పరిస్థితిని గమనించి ఉపాధ్యాయులకోసం ప్రత్యేకముగా 23 గృహములు నిర్మించుట జరిగింది. 1960 లో పాఠశాలల యాజమాన్యము జిల్లా పరిషత్తునకు బదిలీ చేయుచున్నప్పుడు వీటిని కూడా జిల్లా పరిషత్తు వారి అధీనపరుచుట జరిగింది. కొత్తగూడెము మున్సిపాలిటిగా ప్రకటించబడిన తరువాత పాఠశాలలను జిల్లా విద్యాశాఖాధికారి అధీనములోనికి బదలాయించ బడినది. ఉపాధ్యాయుల నిమిత్తము నిర్మించిన గృహముల పరిపాలనా బాధ్యతను పి. డబ్ల్యు. డి వారికి అప్పగించవలసి వుండగా అది యింతవరకు జరుగలేదు. తక్షణమే వీటిని పి. డబ్ల్యు. డి వారి కప్పగించుకొనే ఏర్పాటు చేసి అచ్చట పనిచేయుచున్న ఉపాధ్యాయులకు సీనియారిటీ ప్రాతిపదికపై క్వార్టర్సు కేటాయించు అధికారమును ఖమ్మంజిల్లా విద్యాశాఖాధికారి కొసంగుటకు తగు చర్యలను తీసుకొనవలసినదిగా ప్రభుత్వము వారిని ఈ కౌన్సిల్ కోరుచున్నది.

13. షెడ్యూలు (ఏజన్సీ) ప్రాంతములలో పనిచేయు ఉపాధ్యాయులకు ప్రత్యేక అలవెన్సులు నిచ్చుచూ ప్రభుత్వము వారిచ్చిన ఉత్తర్వులకు సంతోషాన్ని ప్రకటిస్తూ యీ అలవెన్సును

ప్రభుత్వవుద్యోగులు పొందుచున్న విధముగా 1969 నుండి పంచాయితీ జ్ ఎయిడెడ్ పాఠశాలలలో పనిచేయు ఉపాధ్యాయులు పొందునట్లు ఉత్తరువు లీయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాము.

14 బి.ఇ డి., 1వ తరగతి భాషా పండితులు, సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులకు వలె 1-4-1974 నుండి అన్ని కేడర్లలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు సెలెక్షన్ గ్రేడ్ సౌకర్యాన్ని కలిగించాలని ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేయుచున్నాము.

15 1 వ తరగతి భాషా పండితులకు సెలెక్షన్ గ్రేడ్ సౌకర్యము కలిగిస్తూ విడుదలచేసిన ప్రభుత్వ ఉత్తరువు మేరకు వెంటనే 1-4-74 1-4-75, 1-4-76 నాటికి సృష్టిస్తూ వెంటనే ఉత్తరువు లీయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుచున్నది.

16. 1-4-76 వ తేదీనాటికి సృష్టించవలసిన బి ఇ డి. సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుల సెలెక్షన్ గ్రేడ్ పోస్టుల ఉత్తరువును వెంటనే విడుదల చేయవలసినదిగా ప్రభుత్వాన్ని యీ సమావేశము కోరుచున్నది.

17. పంచాయితీరాజ్ పాఠశాలల్లో పనిచేయుచున్న సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయులకు గాను సెలెక్షన్‌గ్రేడ్ 1-4-74 1-4-75 తేదీలతో అమలునకు వచ్చినట్లు సృష్టిస్తు ఉత్తరువు యిచ్చుట జరిగినది. సెకండరీ స్కేలుతో గరిష్ట వేతనమును చేరవలయుననెడి అంక్షను తొలగించి సీనియారిటీ ప్రాతిపదికపై 1-4-74 1-4-75 తేదీలనుంచి అమలులోకివచ్చు పోస్టులు సద్వినియోగ పడునట్లు చేయవలసినదిగా ప్రభుత్వమును కోరడమైనది.

18 సర్వీసులోనున్న ఉపాధ్యాయులు విద్యార్హతను పెంచుకొని బి. ఇ డి శిక్షణ పొందిన వారు 1970 నుంచి ఏవిధమైన ప్రమోషన్ లేకయున్నారు. అర్హతలు పెంచుకొనిన ఉపాధ్యాయులకు ప్రమోషన్ అవకాశములులేకున్న నిస్పృహా నిరాశకు గురియగుదురు. అరమిలియన్ పథకమువలన ఉపాధ్యాయులుగా నియమింప పడినవారికి పోష్టులను సృష్టించి వారిని విలీనము చేసుకొనుట జరిగినది. విద్యాలయములలో పనిచేయుచు వారికన్న ముందు అర్హతలను పెంచుకొనినను ప్రమోషన్ లేకపోవుట మూలమున వారు తీవ్రమైన అందోళనకు గురియగుచున్నారు. ఉద్యోగము చేయుచూ బి. ఇ డి. అర్హత పెంచుకొనిన ఉపాధ్యాయులందరి పోష్టులను అరమిలియన్ వారిని విలీనముచేసుకొనిన తేదీకంటే ముందునుండే అప్‌గ్రేడ్ చేస్తూ వుత్తరువు లీయ వలసినదిగా ప్రభుత్వాన్ని కోరుచున్నది.

19 సర్వీసులోనున్న తాత్కాలిక శిక్షణ పొందిన ఉపాధ్యాయులను అరమిలియన్ పథకములో విలీనము చేసుకొనిన వారివలె కొనసాగించుటకు ఉత్తరువులనిస్తూ వెంటనే శిక్షణ పొందుటకు తగిన అవకాశములను కల్పించవలసినదిగా యీ కౌన్సిల్ ప్రభుత్వమును విజ్ఞప్తి చేయుచున్నది.

20 సర్వీసులో నున్న ఉపాధ్యాయులకు శిక్షణా సౌకర్యములను కలుగ చేయవలసినదిగాను వివిధ శిక్షణలను పొందు ఉపాధ్యాయులకు శిక్షణాకాలమునకు పూర్తి వేతనములు చెల్లించి సౌకర్యమును పునరుద్ధరించవలసినదిగా ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేయుచున్నది.

21. ఉస్మానియా విద్యాలయ ప్రాంతములో పనిచేయు ఉపాధ్యాయులు యూనివర్సిటీ పరీక్షలు వ్రాయుటకు హైదరాబాద్‌కు మాత్రమే కేంద్రముగా ఎన్నుకొన వలసియున్నది. జిల్లాలో పనిచేయు ఉపాధ్యాయులకు ఇది అత్యంత వ్యయ ప్రయాసలు, ఖర్చుతో కూడిన సమస్య. పరీక్షాకాలమునంతటికి సెలవుల సమస్య ముఖ్యమైనది. ఈ అసౌకర్యమును దృష్టియందుముంచుకొని జిల్లాకేంద్రములో ఉన్న కళాశాలల్లో పరీక్షాకేంద్రములు ఏర్పాటు చేసి ఆయా జిల్లాలలో పనిచేయు ఉపాధ్యాయులు అచ్చట పరీక్ష వ్రాయుటకు అవకాశమును కలుగజేయుచు ఉత్తర్వుల నీయవలసినదిగా రెగ్యులరు అభ్యర్థులకు ప్రతి ప్రయివేటు అభ్యర్థులకు సంవత్సరంకు రెండుసార్లు పరీక్షలు వ్రాయు అవకాశం యివ్వవలసినదిగా ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ గారిని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరుచు విజ్ఞప్తి చేయుచున్నాము.

22. బాల్వాడి శిక్షణ పొందిన ఉపాధ్యాయులకు సెకండరీ స్కేలు యివ్వవలయు ననెడి ఉత్తరువులు స్పష్టముగా వున్నప్పటికి సోషల్ వెల్‌ఫేర్ పాఠశాలలో పనిచేయువారికి వర్తింప చేయుట లేదు. వెంటనే వారికి సెకండరీ స్కేలు నివ్వవలసినదిగా వుత్తరువుల నొసంగవలసినదిగా కోరడమైనది.

23 బాల్వాడి ఉపాధ్యాయునుల పోష్టులను ఏ సంవత్సరమునకాసంవత్సరము కంటిన్యూ చేస్తూ ఉత్తరువులు ఇచ్చుట జరుగుచున్నది. శాశ్వత ప్రాతిపదికపై వారి పోష్టుల కంటిన్యూయేషన్ ఉత్తరువులను యిస్తూ వారి సర్వీసులను క్రమబద్ధము చేయవలసినదిగానూ సెకండరీగ్రేడు స్కేలు అమలు జరుపాలని కోరుతూ తీర్మానించడమైనది.

24. శిక్షణ పొందని రెండవగ్రేడ్ తెలుగు పండితులకు 130-230 స్కేలులో ఇంక్రిమెంట్లు నిచ్చు సౌకర్యము కలదు. నూతన వేతనస్కేలు 290-520 లో కూడా శిక్షణ పొందని ఉపాధ్యాయులకు ఇంక్రిమెంట్లు యిచ్చు అవకాశమునుకల్పిస్తూ ఉత్తరువులు ఇవ్వవలసినదిగా ప్రభుత్వము వారిని కోరడమైనది.

25. ఉస్మానియా విశ్వవిద్యాలయవు డి.ఓ.ఎల్.కి అర్హత సంపాదించిన రెండవ తరగతి తెలుగు పండితులకు 130 - 230 స్కేలును ఈయవలసినదిగా ప్రభుత్వము ఉత్తరువు చేయుట జరిగినది. కొన్ని జిల్లాలో కోర్టు తీర్పు ప్రకారము 1969 నుండి డి. ఓ. ఎల్. అర్హతలున్న వారికి 130-230 స్కేలు యిచ్చుట జరిగినది. హైకోర్టు తీర్పును దృష్టియందునుంచుకొని 1969 సంవత్సరము నుండి డి. ఓ. ఎల్. వారికి 130 - 230 స్కేలు నిచ్చు ఉత్తరువును, వేతన నిర్ణయములో నిర్ణయించబడిన సమానమైన స్కేలు 290-520 ని యివ్వవలసినదిగా స్పష్టమైన ఉత్తరువులనీయ వలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిని కోరడమైనది.

26. సర్వీసుల క్రమబద్ధీకరణ:- తాత్కాలిక ఉపాధ్యాయుల సర్వీసుల క్రమబద్ధీకరణకు సంబంధించిన ప్రభుత్వ ఉత్తరువులు 138 వ జీ.ఓ. తేదీ 28-1-1970 విడుదల అయిన తరువాత మార్పులు చేర్పులతో అనేకము వచ్చినవి. కొన్ని జిల్లా

పరిషత్తులు 1974 లో డి.యస్.సి జరిపి క్రొత్తవారిని తీసుకొనుట జరిగినది. అంతకు పూర్వమే నియామకము పొంది సర్వీసులో కొనసాగుతున్న ఉపాధ్యాయులు అనేకులు ఉన్నారు. సెలక్షన్ కమిటీ ముందు ఈ హాజరైన తేదీతో నిమిత్తము లేకుండా నియామకము పొందిన తేదీ నుండియు సర్వీసును క్రమబద్ధీకరించుటవలన ఉపాధ్యాయులకు న్యాయము చేకూరును. కావున తాత్కాలిక ఉపాధ్యాయులకు సర్వీసుల క్రమబద్ధీకరణను వారి వారి నియామక పు తేదీలనుంచి చేయవలసినదిగా తగిన ఉత్తరువులు నీయవలసినదిగా ప్రభుత్వము వారికి విజ్ఞప్తి చేయుచున్నాము.

27. తెలంగాణా ప్రాంతములో పంచాయితీరాజ్ వ్యవస్థ ప్రారంభమునకు పూర్వము పాఠశాలలన్నియు విద్యాశాఖ అధీనములో వున్నవి పాఠశాలలను పంచాయితీ సమితులు జిల్లా పరిషత్తులకు స్వాధీన పరచినపుడు అప్పటివరకు ఆయా పాఠశాలలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులను వారి ఇచ్ఛను తెలుసుకొనకయే పాఠశాలలతోపాటు ఒప్పగించినారు తద్వారా తెలంగాణా ప్రాంతమంతా రెండు వర్గాలకు చెందిన ఉపాధ్యాయులు ఈ పాఠశాలలలో పనిచేయుచున్నారు. ప్రమోషన్స్ సమస్య వచ్చినప్పటికి వీరిలో వివాదములు తలెత్తి మేనేజిమెంట్ హక్కుల సంరక్షణ కొరకు కోర్టులకు పరుగులెత్తు స్థితి ఏర్పడినది. జిల్లా పరిషత్తులు పుట్టక పూర్వమునుండి పనిచేయుచున్నవారము కావున మాకు అర్హతలున్నవనెడి వాదనతో కోర్టులకు వెళ్లుట జరిగినది. ఈ విషాద వాతావరణము ప్రభుత్వము వారు పాఠశాలలను బదలాయించినపుడు వానిలో పనిచేయు ఉపాధ్యాయుల యిష్టాయిష్టాలను విచారించకపోవుట వలననే ఏర్పడినది. ఈ సమస్యకు శాశ్వత పరిష్కారమార్గమును కనుగొనవలసియున్నది. కావున ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ జనరల్ కౌన్సిల్ ఈ సమస్య పరిష్కారానికి దిగువ సూచనలు చేయుచున్నది.

1. కొఠారి కమీషన్‌వారు సూచించిన మేరకు స్వతంత్ర ప్రతిపత్తిగల విద్యాబోర్డు నేర్పరచి అన్ని యాజమాన్యములకు సంబంధించిన పాఠశాలలను సిబ్బందిని దానికి అప్పగించుట.

2 ఇటీవల ఖమ్మం, వరంగల్ తదితర జిల్లాలలో కొంతమంది ప్రభుత్వ ప్రధాన ఉపాధ్యాయులు రివర్టు కాబడిరి. వారు చాలకాలము నుండి ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచు, పొందుచుండిన జీతములకు కూడా యిందువల్ల నష్టము వాటిల్లినది. వారందరికి స్కేలు నష్టము లేకుండా తగు ఉత్తర్వుల నీయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాము.

3 సీనియారిటీకి గుర్తింపు లేకపోవడంగాని, ఒకేసర్వీసు గల ఉపాధ్యాయులమధ్య అసమానతలు వుండటంగాని యు.టి.యఫ్. సమర్థించదు. అయితే తెలంగాణా ప్రాంతములో ప్రభుత్వ, పంచాయితీరాజ్ ఉపాధ్యాయుల మధ్య తలెత్తిన విషాదకర పరిస్థితులను గమనంలోనికి తీసుకొనుచున్నది. వారికి ప్రస్తుతము కొనసాగించబడుచున్న రేషియో పరిస్థితిని కొనసాగించుచునే, సీనియారిటీకి న్యాయం కల్పించి యీ దిగువ చర్య గైకొనాలని కోరుచున్నాము. వున్న రేషియో కారణంగా ప్రమోషనులు రాని అదే సర్వీసుగల ప్రభుత్వ ఉపాధ్యాయులకు కూడ అదే జీతము గల్గిన అదనపు పోష్టులు సృష్టించి వారి సీనియారిటీకి న్యాయము కల్గించగోరుచున్నాము.

28. సరెండర్‌లీవు సౌకర్యము : పంచాయితీ రాజ్ మున్సిపాలిటీ, ఎయిడెడ్ పాఠశాలలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులను కూడా సెలవును సరెండరు చేసికొను సౌకర్యమును కలుగజేస్తూ ఉత్తరువుల నీయవలసినదిగా ప్రభుత్వము వారిని కోరడమైనది. వివక్షతను తొలగించుటకు ఈ చర్యను గైకొనవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.

29 బదిలీల ఉత్తరువు 429ను దృష్టియందుంచుకొని పశ్చిమగోదావరి జిల్లాలో సెలక్షన్ గ్రేడులో ఉన్నటువంటి సీనియర్స్ అయినటువంటి బి.ఇ.డి ఉపాధ్యాయులను ఉన్నత పాఠశాలల నుండి తరలించి ప్రాథమిక ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులుగా నియమించుట జరిగినది. విద్యాప్రమాణాలు పెంపొందుటకు అనుభవజ్ఞులైన ఉపాధ్యాయుల అవసరము పరిణతి చెందినవారి అనుభవము ఉన్నత పాఠశాలలు కవసరమై యుండగా వారిని ప్రాథమిక ఉన్నత పాఠశాలలకు బదిలీ చేయుట సమంజసము కాదు.

ఈ విషయమై సమగ్రమైన దర్యాప్తును జరిపించి సీనియర్ బి.ఇ.డి. ఉపాధ్యాయుల అనుభవమును ఉన్నత పాఠశాలల విద్యార్థులకు ఉపయోగపడేందుకుగాను వెంటనే వారందరిని ఉన్నత పాఠశాలలకు మార్చుటకు ఏర్పాటు చేయవలసినదిగా ఈ కౌన్సిల్ విజ్ఞప్తి చేయుచున్నది.

30 ఉపాధ్యాయుల పిల్లలకు విద్యాకన్సెషన్స్ ఇచ్చుటకు వారి తల్లితండ్రుల ఆదాయపరిమితి 3 600 రూపాయలకు మించరాదని పూర్వము ఉత్తరువు ఇవ్వబడినది గత దశాబ్దములో ఉపాధ్యాయుల వేతనములలో మార్పులు వచ్చుట జరిగినది. క్రింది స్థాయి సీనియర్ ఉపాధ్యాయుని సంవత్సర ఆదాయము అలవెన్సులతో కలుపుకొని . 3 600 రు. లకు మించుచున్నది. గౌరవనీయ మంత్రి వరేణ్యులు శ్రీ కె. వి నరసప్పగారు విద్యార్థులకు ఉపకార వేతనము లిచ్చుటకు తల్లితండ్రుల ఆదాయపరిమితిని 8,000 రు. లకు పెంచవలయుననెడి ఆలోచన యున్నదని పత్రికాముఖముగా ప్రకటించినారు. ధరల సూచికలో వచ్చిన మార్పులు ఉపాధ్యాయుల వేతనములలో వచ్చిన మార్పులను దృష్టియందుంచుకొని ఆదాయపరిమితిని 10,000 రు. లకు పెంచవలసినదిగా ఈ కౌన్సిల్ విజ్ఞప్తి చేయుచున్నది.

31. భారతదేశంలో సోషలిజం స్థాపన ధ్యేయముగా సవరణను మన రాజ్యాంగములో పొందుపరచబోవుచున్న శుభ సమయమిది. సమసమాజ స్థాపన జరిగిన రాజ్యాలలో ఉద్యోగివర్గాల పింఛను ఈ క్రింది స్కేలు ప్రకారము గానున్నది.

| సర్వీసు సంవత్సరములలో | పింఛను నెలసరి జీతములో శాతముగా. |
|---|---|
| 10 | 32 0 |
| 15 | 43 0 |
| 20 | 53 0 |
| 25 | 63. 0 |
| 30 | 68 0 |
| 35 | 71. 5 |
| 40 | 74 0 |
| 41 | 74 5 |
| 42 | 75. 0 |

ప్రస్తుతము మనకు అమలులోనున్న పింఛను పథకము ప్రకారము 30 సంవత్సరముల సర్వీసు చేసిన ఉద్యోగికి నెలసరి జీతములో 37.5 శాతము పింఛనుగా లభించును.

అభివృద్ధి చెందిన సామ్యవాద దేశాలతో సమానముగా కాకపోయిన కనీసము 20 సంవత్సరాల సర్వీసు కల ఉద్యోగికి లభించు 53 శాతము పింఛనునైనను యిచ్చు విధముగా పింఛను ఫార్ములా మార్చవలసినదిగా ఈ జనరల్ కౌన్సిల్ ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేయుచున్నది.

31. భారత దేశము క్రీడా రంగములో వెనుక బడి యున్నది. ప్రాథమిక దశనుండి క్రీడలకు తగు ప్రాముఖ్యము లభించుటలేదు. ప్రభుత్వము క్రీడలకు తగు స్థానము యిచ్చి ప్రోత్సహించకోరుచున్నాము. ప్రతి అప్పరు ప్రయిమరి స్కూలు వందును పి.ఇ.టి.లను నియమించాలని, 400 రోలు దాటిన ప్రతి హైస్కూలులోను 2 వ పి. ఇ. టి. ని నియమించాలని, 800 రోలు దాటిన హైస్కూళ్ళయందు జూనియర్ కాలేజీలలో వలె పి. డి లను నియమించాలని కోరుచున్నాము

32. గ్రేడు 1 హిందీ పండితుల పోస్టులు పర్మినెంటు కాని కారణముగా నెలల తరబడి జీతములు ఆగిపోవుచున్నవి. కంటిన్యూ ఆర్డర్లుకూడా సకాలములో వచ్చుటలేదు. వచ్చినవి కూడా మేనేజ్ మెంటు వారి తేడాలు వుండుట వలన కొన్ని పరిషత్తుల్లో జనరల్ ఫండ్సు నుండి ఇచ్చుట, మరి కొన్నిటిల్లో ఇవ్వకపోవుట జరుగుచున్నది. కాబట్టి అన్ని పోష్టులను వెంటనే పర్మినెంటుచేసి రెగ్యులర్‌గా జీతాలు చెల్లించాలని కోరుచున్నాము.

33. చింతలపాటి బాపిరాజు ధర్మసంస్థల స్వాధీనము నకు స్పెషలాఫీసరును నియమించినను, వారి సమస్యలు పరిష్కరింపబడలేదు. వెంటనే సదరు పాఠశాలలన్నింటిని స్వాధీనము చేసుకోవాలని, 22 నెలల నుండి జీతములు లేని 150 మందికి వెంటనే జీతములు చెల్లించాలని, ధర్మసంస్థ కళాశాలలు మూసి వేయాలనే నిర్ణయాన్ని ఉపసంహరించి, విద్యార్థులను అధ్యాపకులను ఆదుకోవాలని కోరుచున్నాము.

34. కుటుంబనియంత్రణ కేసులు ఉపాధ్యాయులు సేకరించాలని, లేనిచో వారి జీతములు నిలుపుదల చేస్తామని, లేక క్రమశిక్షణా చర్యలు తీసుకుంటామని, కొన్ని మేనేజిమెంట్లు ఉదా॥ గుంటూరు మునిసిపాలిటీ, చిల్లకల్లు సమితి మొ॥ కొన్ని ఉత్తర్వులు జారీ చేశాయి. ఇవి ఉపాధ్యాయుల కర్తవ్య నిర్వహణలో అవరోధములు కల్గించుచున్నవి. ఇట్టి ఉత్తర్వులపట్ల యీ కౌన్సిల్ తన తీవ్రనిరసనను వ్యక్తము చేస్తున్నది. ప్రభుత్వము వెంటనే జోక్యము కల్గించుకొని అట్టి మేనేజిమెంట్లు పై తగుచర్య గైకొనాలని కోరుచున్నాము.

35. అక్టోబరు 1తరువాత రిటయిరగు ఉపాధ్యాయులను విద్యార్థుల ప్రయోజనాల దృష్ట్యా విద్యా సంవత్సరం చివరివరకు కంటిన్యూ చేయుటకు ఉత్తర్వులు యిప్పించవలసినదిగా కోరుచున్నాము.

36. రాష్ట్రవ్యాప్తంగా అనేక ఆన్ ఎయిడెడ్ పోష్టులతో పనిచేయుచున్న వందలాది మంది ఉపాధ్యాయులు సంవత్సరమునకు పైగా జీతములు లేక యిబ్బందుల పాలగుచున్నారు. వెంటనే వారికి జీతములు చెల్లించుచు,సదరు పోస్టులను ఎయిడెడ్ పోస్టులుగా గుర్తింప కోరుచున్నాము.

37. రెండు సంవత్సరాల సర్వీసు పూర్తయినా అనేక మంది జూనియర్ లెక్చరర్ల సర్వీసును క్రమబద్ధం చేయలేదు. అట్టివారి సర్వీసు వెంటనే క్రమబద్ధం చేయవలసిందిగా ఈ కౌన్సిలు కోరుతున్నది.

38 జూనియర్ లెక్చరర్లకు ప్రోత్సాహకరంగా వారికి ప్రమోషన్ అవకాశాలను పెంచాలని యీ కౌన్సిల్ కోరుతున్నది.

39. పలువురు ట్యూటర్లు గ్రాడ్యుయేట్లు మాత్రమే అయినా, వారి కేడర్ జూనియర్ లెక్చరర్లకన్నా తక్కువే అయినా వారికి యు జి సి స్కేళ్ళు ఇస్తున్నారు. అదేవిధంగా డిగ్రీ కళాశాలలోని జూనియర్ లెక్చరర్లకు కూడా యు జి సి స్కేళ్ళు వర్తింపజేస్తూ జూనియర్ కాలేజీలలోని జూనియర్ లెక్చరర్లకు మాత్రం ఇవ్వకపోవటం అన్యాయం. వారికి గూడ యు. జి. జి స్కేళ్ళు ఇవ్వాలని యీ కౌన్సిల్ కోరుతున్నది.

40. జూనియర్ కాలేజిలకు అనుబంధింపబడిన సెకండరీ స్టాఫ్ సంతతిని వెంటనే ప్రభుత్వసర్వీసులోనికి విలీనం చేసుకోవలసిందిగా యీ సమావేశం కోరుతున్నది.

---

## రాష్ట్ర నూతన కార్యవర్గం

అధ్యక్షులు : శ్రీ కె. నారాయణరావు

ఉపాధ్యక్షులు : శ్రీయుతులు యన్. సీతారామాచారి, వి.వి. సుబ్బరాజు, జి. లక్ష్మయ్య, పి బి. ముత్తారావు, కె. భద్రయ్య.

ప్రధాన కార్యదర్శి : శ్రీ ఎ. వెంకటస్వామి

కార్యదర్శులు : శ్రీయుతులు డి. రామిరెడ్డి, కె.తిరుపాలు, యన్.ఆర్. పోలిసెట్టి, ఆర్. రాఘవయ్య, యం. నరహరి.

కార్యవర్గ సభ్యులు : పి. సాంబమూర్తి, (విశాఖ), వి. సూర్యనారాయణరాజు (తూ. గో.), పి. సత్యనారాయణ రాజు (ప. గో.), యమ్. వీనుగత్నం (కృష్ణా), టి. అంజిరెడ్డి (గుంటూరు), యం. కోటయ్య (ప్రకాశం), సి. హెచ్. లక్ష్మీనారాయణ (నెల్లూరు), జి గోవిందప్ప (కర్నూలు), సి. మహాదేవరెడ్డి (చిత్తూరు), వి. మల్లికార్జునరావు (ఖమ్మం), పి. రఘుపతి (వరంగల్), వి. సత్యనారాయణ (నల్గొండ), పి. అమరేశ్వరరావు (నిజామాబాద్), కె. రామిరెడ్డి (మహబూబ్ నగర్), యం. మార్కు (హైదరాబాద్), శ్రీమతి ఎ. అనసూయ (ప. గో.).

## సంపాదకవర్గం

శ్రీ మైనేని వెంకటరత్నం (ప్రధాన సంపాదకుడు),
శ్రీ కె. నారాయణరావు,
శ్రీ యన్. సీతారామాచారి,
శ్రీ ఎ. వెంకటస్వామి,
శ్రీ యం. నరహరి.

# విద్యా ప్రమాణాల తగ్గుదలకు బాధ్యులెవరు?

— వై. వి. సుబ్బారావు,
ప్రధాన కార్యదర్శి, ఆలిండియా ప్రైమరీ టీచర్స్ ఫెడరేషన్.

అధ్యక్షా, పెద్దలారా, సోదర సోదరీమణులారా!

ఈ రోజుల్లో విద్యను గురించి, ఉపాధ్యాయవృత్తిని గురించి ప్రసంగించని వేదికలు, వక్తలు లేరంటే అతిశయోక్తి కాదనుకుంటాను. గత కొన్ని వత్సరాలుగ విద్యాగంధము బొత్తిగా లేనివారు. వానాకాలపు చదువు చదివిన వారు కూడ మాట్లాడ ప్రారంభించారు. ఇప్పటికైనా తమ అభిప్రాయాలను బైట పెట్టుటకు ముందుకు వచ్చిన వారికి ధన్యవాదాలు తెల్పుతూ వారిని గూడ విషయాలు పూర్తిగ తెలుసుకొన ఆహ్వానిస్తున్నాం. వారితో చర్చించుటకు తయారుగా వున్నాం. మన విషయాలు తెలిసి కూడ తప్పుడుగా మాట్లాడే వారికి మనం నేరుగ జవాబు చెప్పేదానికంటే నిరక్షరాస్యులైన 76/ శాతం భారతీయులకు యధార్థ పరిస్థితులు తెల్పి వారిని మన పక్క నిలిచే విధంగా చేసున్నామంటే అవక తవకలు మాట్లాడేవారు తమ వాగుడు మానుకుంటారు. అధిక సంఖ్యాక ప్రజానీకం తమ బిడ్డలకు కావలసిన విద్య ఎట్టిది అనే విషయం వారు తెలుసునేటట్లు మనం చేయగల్గిననాడు మనం అనేక కష్టాలనుండి గట్టెక్కగలుగుతాం. అందువల్లనే యీనాడు మీరు జరిపే సదస్సు అతిప్రాముఖ్యమయింది. అయితే యీనాడున్న ప్రత్యేక పరిస్థితులలో మన సదస్సు గదులలో జరుపుకుంటున్నాం. ఫలం స్వల్పం అనేది తెలిసిందే. ఉపాధ్యాయులు అల్పసంతోషులు అన్నది జగద్విఖ్యాతే గదా! అందువల్ల ప్రస్తుతానికి దీనితో తృప్తిపడదాం.

దేశం స్వాతంత్ర్యం పొంది 28 స॥ గడచినప్పటికి మన దేశంలో నిరక్షరాస్యులు 76 శాతం. వారి బిడ్డలకు వారే విద్యను ఆశించుచున్నారో దానిని గురించి ప్రభుత్వాధికారులకు తెల్పుకునే సందర్భం, అవకాశం గలిగించబడలేదు. విద్యాగంధము గలవారిలో గూడా అధిక సంఖ్యాలకు అట్టివసతులు కల్పించబడలేదు. వ్రేళ్ళమీద లెక్కించదగ్గ ఏకొద్దిమంది మేధావులలో ఆ సందర్భాలు యీ నాటికి వున్నాయి. అధికారులు, ప్రభుత్వాలు గత రెండు మూడు వర్షములుగ నడిపే సదస్సులు నామమాత్రాలేగాని వేరుగాదనేది మనకు తెలుసు ఆ సదస్సులలో తెల్పబడ్డ అభిప్రాయాలు బుట్టదాఖలు అగుటవల్ల యీ విధంగా చెప్పవలసి వచ్చింది.

మన దేశ విద్యా విధానాన్ని కొద్దిమంది విద్యావేత్తలు తమవర్గ రక్షణా దృష్టితో చేసిన సలహాలను ఆధారంగా తీసుకొని ప్రభుత్వాలు తమరాజకీయ చతురతతో తీర్చిదిద్దుతున్నారు అనిచెప్పుటకంటే అధికంగా మనం మనసంఘాలు యిప్పుడు యిచ్చుట ముచ్చటించుట ఉచితంగాదనుకుంటాను.

విద్యాప్రమాణాలను గురించి మాట్లాడేవారు, వారివారి దృక్పథాలలో నుంచి మాట్లాడుతున్నారు, అందరూ ఒకే దృక్పథంనుంచి మాట్లాడుటలేదు. వానాకాలపు చదువుగలవారు తాము చదువుకున్న రోజులలో మన్న విద్యతో పోల్చుకుని విద్యాప్రమాణం తగ్గిందనుచున్నారు. ఇంకకొంచెం విద్యా గంధముగలవారు తాము ఐదవ తరగతిపూర్తిచేసిన రోజులలో సాధారణ, చక్రవడ్డీ లెఖ్ఖల్ని సులభంగా చేశామని, మాతృభాషలో శతకాలేగాక రామాయణ భాగవతాలు తప్పులులేకుండా గడగడ చదవగలిగామని ఈరోజుల విద్యార్థులు ఆరకంగా చేయలేక పోతున్నారని వాపోతూ ఉపాధ్యాయులే దీనికి కారణమంటున్నారు. ఈ రెండు తెగలవారే విమర్శకులలో అధికులు. వీరికి విద్యారంగంలో ప్రభుత్వాలు తెచ్చే మార్పులు తెలియుని సందర్భాలు లేవు. అందువల్ల వారిపై మనం తప్పు చేప్పేదానికి వీలులేదు.

అధికారులలో అనేకులు యీ విమర్శలు అంగీకరించుట లేదు. ఈ విమర్శకులు తాము చదివిన రోజులలో పుస్తకజ్ఞానం తప్ప వేరు ప్రపంచజ్ఞానము తక్కువయనిన్నీ యీరోజు విద్యార్థులు అట్టి జ్ఞానము అధికముగ కల్గియున్నారనిన్నీ, అనాటి విద్యార్థులు కంటె యీనాటి విద్యార్థులలో వేగం, ఉత్సాహం, పరిశోధనాశక్తి అధికమనిన్నీ వాదిస్తూ తలిదండ్రుల వాదాన్ని కాదనుచున్నారు. తమ వాదాన్ని సమర్థించుకొనుచున్నారు. ఆవిధంగా సమర్థించుకోకపోతే తప్పంతా తమ తలల మీద పడుతుందని భయపడుతున్నారు. అయితే ప్రభుత్వ అధినేతలు కూడ ప్రజల వాదానికి ఆమోదం తెల్పుటతో అధికారులు తమ వాదనలను తాత్కాలికంగా మానుకున్నారు.

విద్యారంగాలలో పనిచేసే ఉపాధ్యాయులు తమ సంఘటితశక్తి తగ్గినతరువాత, సమీపకాలంలో తనవెనుకటి వాదనలకు తిలోదకాలిచ్చి, ఒకరిపై ఒకరు ఆరోపణలు చేసుకుంటున్నారు. కళాశాలలవారు ఉన్నత పాఠశాలలవారిపైనను, ఉన్నతపాఠశాలలవారు మాధ్యమిక పాఠశాలలవారి మీదనూ మాధ్యమిక పాఠశాలలవారు ప్రాథమిక పాఠశాలలవారిపైనను, పైతరగతులవారు క్రిందితరగతులవారిపైన బాధ్యతలు మోపుకొనుటతో బయటవారి విమర్శనకు మనమే దారిచూపించుచున్నాము. మనమధ్య ఉన్న ఐక్యమత్యాన్ని కాలరాస్తున్నాము.

## అయితే నిజపరిస్థితులేమిటి?

ఒక్కొక్కమార్పు ప్రభుత్వాలు తెచ్చినప్పుడు మనం, మన సంఘాలు ఆ మార్పులవల్ల ఏర్పడు కష్టనష్టాలు ప్రభుత్వ అధికారుల దృష్టికి తెచ్చుటయే గాక ఉద్యమాలనే నడిపినాం. మహాసభలో తీర్మానించి, రాయబారాలు జరిగిన వాదనలలోను, మహాజర్లలోను మన అభిప్రాయాలు ఖచ్చితంగా, జంకు గొంకు లేకుండా తెలియచేసినాము. ఉద్యమాలు కూడా నడిపినాం పార్లమెంటు, అసెంబ్లీలలో ఉపాధ్యాయులవాణి ప్రతిధ్వనించింది. అందువల్ల పరిశీలనా కమీషన్‌లు, కమిటీలు వచ్చినై. ఆకమీషన్‌లముందు, కమిటీలముందు మన ఐక్యకంఠం మారుమ్రోగింది. మన ఆలోచనలు కాదనలేక పోయాయి ఆకమిటీలు, కమీషన్‌లు. కాని ప్రభుత్వాలచే నియమించబడిన కమిటీలు, కమీషన్లు ప్రభుత్వరాజకీయ దృక్పథములకు భిన్నము

కాని విధంగా మేధావి వర్గం లక్షణములను కాపాడుకుంటూ సిఫార్సులు చేసినాయేగాని పామరప్రజలకు పనికివచ్చేవిధంగా, వారి బాగును గుర్తుంచుకొని ప్రణాళికలు తయారు చేయలేదు. అందువల్లనే మనవిద్యా విధానం అధ్వాన్న దశకు దిగజారి పోయింది.

సామాన్యుని ఓట్లు పొంది అధికారమునకు రావలసి యుండుటచేత విద్యాప్రమాణములను సరకు గొనకుండా విస్తరణ ప్రణాళికలను ప్రభుత్వాలు తయారు చేసినై. నిరక్షరాస్యులైన కోటాను కోట్ల ప్రజలకు ఈ యధార్థము తెలియదు. అరోజుల్లోనే యీలోపభూయిష్టతను మన సంఘాలు వెల్లడించాయి. అయితే చెవిటివారిముందు శంఖూదిన మాదిరైంది. దాని ఫలితమే యీనాటి సమస్య.

దేశ స్వాతంత్ర్యమునకు ముందు, తరువాత కొంత కాలము వరకు వసతులుగల వారిబిడ్డలే పాఠశాలలకు వచ్చేవారు. అయితే దేశ రాజకీయ పరిణామాలతో చేయబడ్డ సౌకర్యాలను అదనుగా తీసుకుని లక్షలాది బీదవిద్యార్థులు కూడా రాగలిగినారు. దాదాపు 1960 నాటికియిది ఉచ్ఛదశకు వచ్చింది. ఇప్పుడు పాఠశాలలకువచ్చే వారిలో అత్యధిక సంఖ్యాకులు దాదాపు 75% చదువుకొనుటకు వారియిండ్లలో ఏవిధమైన సౌకర్యములేనివారు. చేయూతనిచ్చేవారు లేరు. అందువల్ల వారికి దక్కిందంతా పాఠశాలలోవారు నేర్చుకొనేదేఅన్న మొట్టమొదటిఅంశం గుర్తుంచుకోవాలి.

మన విద్యాభివృద్ధికి అక్కరలేని బ్రిటిష్ ప్రభుత్వకాలంలో, అన్నివసతులుగల వారిబిడ్డలు మాత్రమే చదివే రోజుల్లో, 20 విద్యార్థులకు ఒక ఉపాధ్యాయుడు అనేనియమం తు చ తప్పకపాటించబడ్డది. మనఅభివృద్ధిలో అధికశ్రద్ధఅక్కరకల దనే ప్రజాప్రభుత్వాలు 30, 35 విద్యార్థులకు ఒకఉపాధ్యాయుడు అనే నిష్పత్తులను ఏర్పరచి, వాటినికూడా పరిపడఅమలు జరుపుటలేదు ఇదిమనం గుర్తుంచుకోవలసిన రెండవఅంశం.

దీనిని గురించి కొఠారి కమిషన్ రిపోర్టులో:-

"ప్రస్తుతం పనిచేస్తున్న ఉపాధ్యాయులలో 11.1 శాతం 50 నుండి 59 విద్యార్థులు, 6 5 శాతం ఉపాధ్యాలు 60నుండి69 విద్యార్థులు, 14 3 శాతం ఉపాధ్యాయులు 70 కు పైగా విద్యార్థులుగల తరగతులకు బోధనసల్పుచున్నారు. గ్రామీణ పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు ఏక కాలంలో రెండు, మూడు తరగతులకు, కొన్నిచోట్ల ఐదుతరగతులకు పాఠ్య బోధన చేయుచున్నారు. ఇట్టి ఏకోపాధ్యాయ పాఠశాలలు దాదాపు 40% వున్నవి. ప్రస్తుత ఉపాధ్యాయులలో 50 శాతం రెండు అంతకంటె ఎక్కువ తరగతులకు ఏక కాలంలో పాఠ్య బోధన సల్పుచున్నారు.' అని తెల్పుతూ 'ఎంతశక్తిసామర్థ్యాలు గల ఉపాధ్యాయుడైనా ఎంత అత్యధిక శ్రద్ధ చూపిన, పైన చెప్పిన విధముగా తరగతులు అత్యధిక సంఖ్యగల విద్యార్థులతో వున్నప్పుడు పాఠ్యబోధన సల్పుట సాధ్యం కాని పని. ఒకే సమయంలో రెండు మూడు తరగతులకు బోధించుట అనేది దురూహ్యము' అనే వక్యాలను ఆ కమిషన్ 1965 లో బయటపెట్టింది. ఇప్పటికీ పరిస్థితులు మార్చబడలేదు. ఇది గుర్తుంచుకోవలసిన 3 వ. అంశం.

ఈ విధంగా అత్యధిక సంఖ్యాకులుగా వున్నబీద బిడ్డల బుద్ధి సామర్థ్యాల గురించి కొంచెం పరిశీలిద్దాం. ప్రభుత్వ సర్వేలలో తెలినవిషయాలేమనంమాట్లాడుకునేసంగతి మనసులో వుంచుకోండి. ఆసర్వేలో మొత్తం 550 మిలియన్లు (55 కోట్ల) భారతీయులలో 326 మిలియన్లు శక్తిలేని చచ్చు ఆహారపదార్థాలను తినుకుంటున్నారనిన్నీ అందువల్ల దాదాపు 50% చనిపోవుచున్నారనిన్నీ 82 మిలియన్ల భారతీయ బిడ్డలు నరబలహీనతలతో జబ్బులతో బాధపడుచూ తీర్చలేని బుద్ధి మాంద్యమును పొందుచున్నారని అయిదు సంవత్సరాలకు ముందు తెలియవచ్చినప్పటికి యీనాటికి పరిస్థితులలో మార్పు తేబడలేదు. ఈ పరిస్థితులు యిదేవిధంగా నల్లేరుమీద బండినడిచినట్లు నడుస్తుండగా బ్రహ్మలోకంనుండి బ్రహ్మదేవుడే (అనేపేరు గలవాడుంటే) తన మేధాసంపన్నులైన పరిగణాలతో భారత దేశానికి దిగివచ్చి ఉపాధ్యాయవృత్తి స్వీకరించి, ప్రాథమిక పాఠశాలలో తమశక్తిసామర్థ్యాల నన్నిటిని చూపి పనిచేసినకూడ విద్యాప్రమాణలను అభివృద్ధి చేయుట ఒకప్రక్కనపెట్టి, ఉన్న విద్యాప్రమాణాలను కూడా కాపాడగలడు అనేది సందేహం. అంతే అతిశయోక్తి కాదు.

ఈ కమిషన్ రిపోర్టులతోను, సర్వేలతోబాటు ప్రముఖ విద్యావేత్త unesco director genaral గా పనిచేసి, ప్రస్తుతం మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా పనిచేయు శ్రీయుతుడు మాల్కొం యస్. ఆదిశేషయ్యగారు 5 సం॥ లకు ముందు మన విద్యా విధానాన్ని తీర్చిదిద్దుట కంటే భారత గ్రామీణ స్వశాసనముల తీర్చిదిద్దుట అధిక సులభము అని చెప్పారు. అంతటి పెద్దల వాక్కు మనకు గుర్తుంచు కోవలసిన 5 వ. అంశం.

మనం, మనసంఘాలు 1947-48నుండి ప్రజాప్రభుత్వాల ముందు విజ్ఞాపనలు చేయని సంవత్సరము లేదు జాతీయ విద్యా విధానానికి. అన్ని పాఠశాలలు ప్రభుత్వమే నడపాలని కోరని మహాసభలేదు విద్యాప్రణాళికలు తయారు చేయుటకు పాఠ్యాంశాలునిర్ణయించి పాఠ్యపుస్తకాలను తయారు చేయించేదుకు ప్రభుత్వ, విద్యావేత్తల, ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు సమాన సంఖ్యలోగల విద్యాబోర్డులు ఏర్పరచమని కోరని రాయబారంలేదు ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పతి 1:20 కుతగ్గించమని కోరని సందర్భంలేదు. ఒక తరగతికి ఒకఉపాధ్యాయుడు కావాలి అని తెల్పుతూ సమర్పించని విజ్ఞాపన పత్రంలేదు. దేశం నలుమూలల 6 నుండి 14 వరకు వయస్సుగల బిడ్డలందరికి ఉచిత నిర్బంధ విద్యఅమలుకు తీసుకొని రావాలని కోరని కాన్ఫరెన్సులేదు. ఈ పథకం సక్రమంగా అమలు జరుగుటకు, Stagnation, Wastage లేకుండుటకుఅవసరమైన బీద విద్యార్థులకు ఉచితముగ పుస్తకాలు, దుస్తులు మధ్యాహ్నభోజన వసతులు చేయుటతోబాటు, ప్రభుత్వమే ప్రతి పాఠశాలకు దగ్గరలో పదవిమండి విరమణ పొందిన ఉపాధ్యాయులకు గౌరవభృతి నొసంగుతూ క్రెషీ,కిండర్‌గార్డన్‌పాఠశాలలను ఏర్పరచుటకుకోరని సంవత్సరమే లేదు. ఆ క్రెషీలలో, కిండర్ గార్డెన్‌లలో చేర్చిన బిడ్డలకు శక్తివంతమైన ఆహారము నొసంగి వారి బుద్ధి మాంద్యత తొలగించమని కోరని వర్షము లేదు. వీటితోబాటు ప్రస్తుతం పనిలోవున్న ఉపాధ్యాయుల గోడులు-జీతాలు సక్రమంగా ప్రతి మాసం మొదటి తేదీకి చెల్లింప

చేయాలని, వర్షా వర్షం వారికి రావల్సిన ఇంక్రిమెంట్లు యివ్వించాలని, ఉపాధ్యాయులు లీవులో వెళ్ళినప్పుడు ఖాళీలలో ఉపాధ్యాయులను వెంటనే నియమించుటయేగాక, లీవులో వెళ్ళిన వార్కి లీవు మంజూరు చేయుట, లీవు జీతాలు చెల్లించుట మొదలుగా గల విషయాలలో వున్న యీతి బాధల నుండి ఉపాధ్యాయుల కాపాడమని-తెలియ చేయని, దినం, మాసం లేనేలేదు.

మనకున్న సమస్యలన్నీ యిక్కడ చెప్పేందుకు మొదలు పెడితే యిప్పటికే కొండవీటి చాంతాడువలె వున్న రిపోర్టు ఇంతింతై హనుమంతుని తోకవలె పెరుగుతూ పోతుంది గనుక వాటినన్నిటిని వల్లించకుండా పెద్దలవార్తలతోనే నా వ్యాసాన్ని ముగించాలను కుంటున్నాను.

ముగించే దుకు ముందు పెద్దలు తిరిగి ప్రశ్న లేవకుండా, వారు సాధారణంగావేసే ప్రశ్నకూడనేనే వేసుకొని ఆ ప్రశ్నకు బదులు చెప్పదలచుకున్నాము.

ఉపాధ్యాయుల కోర్కెలు గొంతెమ్మ కోర్కెలు కావు న్యాయమైనవి. జాతి ప్రగతికి, దేశ సర్వతోముఖాభివృద్ధికి, దేశ సౌభాగ్యానికి మూలకందమైనవి పటిష్టమైన ప్రాథమిక విద్య, నిరక్షరాస్యతా నిర్మూలనలని కొఠారి కమీషన్ చేత ప్రకటించబడింది. అంతేగాక వీటిని ప్రభుత్వం తలచుకుంటే చేయగలదు అని తెల్పుతూ ఉదహరణకు వారు చెప్పిందే యిక్కడ చెప్పదలచుకున్నాను.

"సోవియట్ సోషలిస్టు ప్రభుత్వం, శ్రామికవర్గ ప్రతినిధిగా పదవికి వచ్చిన వెనువెంటనే తీసుకొన్న మొదటి చర్య పటిష్టవంతమైన ప్రాథమిక విద్యను అందరికి అందించుట, నిరక్షరాస్యత నిర్మూలనకు పూర్తి శక్తిని వినియోగించుట. వారి కృషి నిర్ణయించిన కాలమునకు లోపలనే పూర్తియగుట ఆ దేశ ప్రజలలో నూతన ఉత్సాహాన్ని, ఉద్వేగాన్నియిచ్చింది. తద్వారా సోషలిజ సమాజాన్ని అతికాలంలో సృష్టించ గలిగారు." అని ఎత్తిచూపింది.

అందువల్లనే మనం మన సంఘాలు బాహాటంగా మన అభిప్రాయాలను నొక్కివక్కాణించ గలిగినాము. అయితే మన ప్రధాన కోర్కెలకు ప్రభుత్వ ప్రణాళికలు మధ్య గోడలుగా నుంచున్నవి వర్గ దృక్పధాలే తప్ప వేరుకావు. ఈ దృక్పధ వేరుబాటు విద్యా ప్రమాణాల విషయంలోనేగాక దేశ ఆర్థిక కష్ట నష్టాలకు కారణమైంది.

దేశం ఆర్థిక కష్టనష్టాలలో వుండే యీ కాలంలో మన కోర్కెలు, ప్రజాభిప్రాయాలు అమలు జరుపుట ప్రభుత్వాలకు సాధ్యమా అనే ప్రశ్నకూడ లేవవచ్చు. అట్టివారికి మనం, మన సంఘాలు బదులు చెప్పవలసివుంది. కారణం మన ఉపాధ్యాయులు ప్రశ్నలు వేయుట, ప్రశ్నలకు బదులు చెప్పించుట చెప్పలేని వారికి జ్ఞానిని యిచ్చి ఇట్టి వట్టించుట మన వృత్తి కార్యకలాపాలలో ఒకభాగం. అందువల్ల దానికి కూడ మన కార్యకర్తలు తయారుగ ఉండాలిగదా! అందుకోసమే దానిని గూడ చెప్పి ముగిస్తాను.

శంఖులో పోస్తేనే తీర్థమంటారు కనుక పెద్దల వాక్యాల తోనే పైప్రశ్నలు వేసేవారి సందేహం తీర్చదలచుకున్నాను.

శ్రీరామరక్షగా మనకు యీ విషయంలో ముందున్నవారు మీకు యింతకు ముందే పరిచయం చేయబడ్డ శ్రీయుతుల మాల్కం ఓ.యస్. ఆదిశేషయ్యగారే!

వారు 4 ప్రశ్నలు వేసుకొని ఆ ప్రశ్నలకు ప్రభుత్వాల రిపోర్టుల నుండి సేకరించిన సమాధానాలని చెప్పబడ్డవే యీ క్రింద పొందుపరచదలచుకున్నాను.

ప్రశ్న : పాఠశాల రిజిష్టరులలో నమోదు చేయబడ్డ వారిలో నిజంగా ప్రతిదినం పాఠశాలకు హాజరగు విద్యార్థుల శాతమెంత?

సమాధానం : పాఠశాలకు హాజరగుచున్నట్లు నమోదు చేయబడ్డవారిలో 10 నుండి 12 శాతం వరకు నిజమైనది కాదు. (Bogus Attendance)

ప్రశ్న : 1వ తరగతిలో చేరిన 100 మంది బాలబాలికలలో 5వ తరగతికి 8వ తరగతికి వస్తున్నవారి శాతం ఎంత?

సమా : 1వ తరగతిలో చేరిన 100 బాలబాలికలలో 45 విద్యార్థులు 35 విద్యార్థినులు 5వ తరగతికిన్నీ 30 మంది విద్యార్థులు 17 మంది విద్యార్థినులు 8వ తరగతికి వస్తున్నారు.

(ఉదా:- తమిళనాడులో 1964-65 సం ॥లో 13 లక్షల మంది 1 వ తరగతిలో చేర్చుకోబడ్డారు. 1968-69 నాటికి 6 7 లక్షల మందే 5 వ తరగతికి వచ్చారు. (ఇదే విధంగా అన్ని రాష్ట్రాలలోను వుంది.)

ప్రశ్న : 1 వ తరగతిలో చేరినవారి వయస్సు పరిమితు లేవి?

సమా :- 49 శాతం విద్యార్థుల వయస్సు 8-12 సం॥ లకు మధ్యగా వుంది.

ప్రశ్న : ఒకే తరగతిలో తిరిగి తిరిగి చదివే వారి శాతమెంత? (Stagnation)

సమాధానం: బాలురలో 40% బాలికలలో 47% శాతము ఒకే తరగతిలో తిరిగి తిరిగి చదువుచున్నారు.

అందువల్ల తమిళనాడు ప్రభుత్వం వెచ్చించే 30 కోట్ల రూపాయలలో (1) Bogus Attendance వల్ల రు2కోట్లున్నూ, (2) Stagnation వల్ల రు 2 కోట్లున్నూ (3) వయో పరిమితుల వల్ల రు. 1 కోటి వెరసి రు. 6 కోట్లు వృధా అగుచున్నది ఈ విధంగా దుబారా ఖర్చు అన్ని రాష్ట్రాలలోను జరుగుచున్నది. ప్రాథమిక విద్యాస్థాయిలోనేగాక పై స్థాయిలలోను ఇదే తీవ్రతలో వుంది అని వారు తెల్పుచున్నారు

దేశీయ విద్యా విధానాన్ని తీర్చి దిద్దుటకు తాను UNESCO పదవిలో వుండగా NCERT మూలంగా భారత దేశానికి చేసిన సహాయం పూర్తిగా నిష్ఫలమైందనే చెప్పాలి అని వాపోయినారు.

సరియైన జాతీయ విద్యా విధానాన్ని అందరికి అందుబాటులోకి తెచ్చేందుకు మన Constitution లో నున్న Directive Principle అమలు జరిపే దుకు ఆర్థిక కారణాలే అడ్డంకి అనేవారికి కూడ శ్రీయుతులు ఆదిశేషయ్యగారి వార్తల లోనే బదులు చెప్పి ముగిస్తాము.

మనదేశానికి అకస్మాత్తుగ బంగ్లాదేశ కాందిశీకుల లక్ష

లాదిగ ప్రతిదినం వచ్చినప్పుడు (రోజుకు కోటి రూపాయలు బడ్జెటు కేటాయింపు లేకుండానే మనం ఖర్చు చేసినాంగదా!

3. ఈతి బాధలతో అతివృష్టి అనావృష్టులతో అనేక రాష్ట్రాల ప్రజలు బాధపడగా బడ్జెటు కేటాయింపులులేకుండా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు లక్షలాది రూపాయిలు ఖర్చు చేయుట జరిగిందికదా! వీటికి నిధులుఎట్లావచ్చినై అదేప్రశ్నకు వారిచ్చిన సమాధానం ఒక్కటే "రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ఆ పనులు తమ కర్తవ్యాలుగా గుర్తించినాయి. నిధులు దొరికినై లేదా సమకూర్చ బడినై అనేది వారి సమాధానం."

విద్యారంగంలో కష్టాలు ఇంతటితో ఆగలేదు పరిగదా ఇంకా అత్యధికంగా వున్నాయని ప్రభుత్వ రిపోర్టులు, సర్వేలు తెలుపుతున్నాయి. పార్లమెంటు చర్చలలో ప్రతిపక్ష పక్ష్యాల ప్రశ్నలకుబదులుచెపుతూ విద్యాశాఖా మంత్రులు ఒప్పుకున్నారు కూడ. యునైటెడ్ నేషన్స్ కాన్ఫరెన్సు-on trade and development సర్వే ప్రకారం విజ్ఞాన, సాంకేతిక నిపుణులు అనేకులు పాశ్చాత్య దేశాలకు వెళ్ళి అక్కడే స్థిరనివాసమేర్పరచుకొన్నారు. 1970లో దాదాపు3150మంది డాక్టర్లు విజ్ఞానవేత్తలూ సాంకేతిక నిపుణులు ఒక్క అమెరికాదేశానికేతరలివెళ్ళినారనిన్నీ, ఆవిధంగా అమెరికాదేశానికి ఏర్పడిన లాభం 655 3 కోట్ల రూపాయలని తెల్పు తున్నాయి.

ఒక భారతీయ డాక్టరు అమెరికా దేశానికి తరలివెళుట వల్ల భారతదేశానికి నష్టం దాదాపు రు. 3,30,000 లని అసర్వే చెప్పుతుంది. అంతేగాక అమెరికాకు ఆ డాక్టరువల్లకలిగేలాభం సంవత్సరానికి దాదాపుగ రు. 5,75,000 లని ఆ సర్వే తెలుపుతుంది. అదేవిధంగా ఒక విజ్ఞానవేత్త రు. 1,72,000 లు భారత దేశానికి నష్టాన్ని కలిగిస్తూ, అమెరికాకు రు. 18,75,000 ల లాభాన్ని కలిగిస్తున్నాడు. ఈవిధంగా ఒక్క అమెరికా మాత్రమే మనని యీనాడుకూడ దోచుకుంటుంది అనుకోకండి. ఇంగ్లాండ్, పశ్చిమ జర్మనీలు కూడ తమ కబంధ హస్తాలను మన మీద చాచియే వున్నాయి. ఈ విధమైన దోపిడీలవల్ల మనకుఏర్పడే కష్టములను గూడ నిలుపుట మన ప్రభుత్వాలకు కష్టమైన పని గాదు. అందుకు తగిన చర్యలు తీసుకోవాలనే ఉద్దేశ్యం వాళ్ళకుండాలి సంకల్పముండాలి.

అందువల్లనే అందరిముందు వున్న ప్రశ్న ఒక్కటే.

అది "ఉపాధ్యాయులం అందరం, మన సంఘటితశక్తిని కూడదీసుకొని ఇతర ప్రజా సంఘాల సహకారములతో ప్రజాదరణ పొంది మన వాణి ప్రజావాణిగ మార్చి ప్రభుత్వాల ముందు మన న్యాయమైన కోర్కెలను నొక్కి వక్కాణించాలి. చట్టసభలలో ప్రతిధ్వనించేటట్లు చేయాలి. దీనికి అన్ని విధాల ప్రజాస్వామిక పద్ధతులతో కార్యక్రమాలు తీసుకోవాలి. అన్ని ఉపాధ్యాయ సంఘాలు తమ మీద వున్న గురుతర బాధ్యతలకే ప్రాధాన్యత నిచ్చి, తమ మధ్య వున్న సందేహాలను సంకటాలను ఒక మూల పెట్టి, సత్వరమే కార్యదీక్ష వహించాలి' ఇదే విముక్తికి మార్గం.

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అన్ని సంఘాల ఐక్యతకు వెలుగనే పూనుకుంటుందని నమ్ముతూ, ఆకాంక్షించుతూ ముగిస్తున్నాను. మిత్రులకు అభినందనలు. కార్యకర్తలకు మా ఆశీస్సులు.

వర్థిల్లాలి ఐక్యత! జయప్రదం కావాలి మన ఆకాంక్షలు!

విద్యా గోష్ఠి

# ఆరోగ్యము - విద్య

డా॥ శ్రీ యమ్. రామారావు యం.బి.బి.యస్.
ప్రజా వైద్యశాల, విజయవాడ



ఆరోగ్యమే మహాభాగ్య మంటారు. అలాగే చదువుకు మించిన ఐశ్వర్యం లేదంటాడు భర్తృహరి. మనిషికి విద్య, ఆరోగ్యం అన్నిటికంటే ముఖ్యం. నేటి విద్యార్థి రేపటి పౌరుడుగదా, నేటి విద్యార్థులు ఎంత ఆరోగ్యవంతులైతే రేపు మనదేశం అంత ఔన్నత్యంలో వుంటుంది. కాబట్టి పరిశుభ్రమైన వాతావరణంలో ఆరోగ్యకరమైన పరిస్థితుల్లో విద్యార్జన జరిగేట్లు చూడటం ఈ తరం బాధ్యత.

దురదృష్టవశాత్తు మనదేశంలో స్కూళ్ళలో ఆరోగ్యకరమైన పరిస్థితుల గురించీ, విద్యార్థుల మానసిక శారీరక అభివృద్ధి గురించి తగినంత శ్రద్ధ చూపటంలేదు. ఇప్పటికైనా తగినంత శ్రద్ధ తీసుకోకపోతే రానున్నతరాలు శారీరకంగానూ తద్వారా మానసికంగానూ వెనుకబడిపోయే ప్రమాదముంది. ఇప్పటికి పాశ్చాత్యదేశాలతో పోల్చినప్పుడు మనవిద్యార్థుల గ్రహణస్థాయి తక్కువగా వుంది. ఇది ముఖ్యంగా అనారోగ్య పరిస్థితులు, అసమగ్రమైన ఆహారం వల్ల కలుగుతున్న దుష్ఫలితం.

శానిటేషన్ దృష్టినుండిచూస్తే మనదేశంలో నిస్కూళ్ళలో సగంపైగా మూసివేయవలసి వస్తుంది. విజయవాడలోని చాలా స్కూళ్ళలో క్లాసురూములు ట్రాఫిక్ హెచ్చుగా వున్న రోడ్ల మీదనేవున్నాయి. రోడ్ల మీద దుమ్ముసగం వాళ్ళ ఊపిరితిత్తుల్లోనే వుంటుంది. వాళ్ళ దృష్టిమాస్టారు పాఠాల మీదికంటే రోడ్డుమీద పోతున్న ట్రాఫిక్ మీదేవుంటుంది. ప్రశాంతమైన వాతావరణమే కాకుండా పరిశుభ్రమైన గాలి వెలుగూ కూడా ముఖ్యమే. చాలా స్కూళ్ళలో బెంచీలే వుండవు వున్న దగ్గర కూడా విద్యార్థులు కుంచుంటేకానీ ఆ డస్కులు అందవు. ఇవన్నీ విద్యార్థుల ఆరోగ్యాన్ని దెబ్బతీసేవే. రాత్రులు పందులకు నివాసాలుగానూ పగలువిద్యార్థులకు క్లాసురూములుగానూవున్న స్కూళ్ళు చాలా వున్నాయి. పట్టణాలలో వున్న స్కూళ్ళకు ఆటస్థలాలు కరువైతే పల్లెల్లో - ఆటస్థలాలు వున్నా వాటికి మరుగుదొడ్లుగా ఉపయోగ పడుతున్నాయి. విద్యార్థులకు మరుగుదొడ్లువున్న స్కూళ్ళకంటే లేనివే హెచ్చు - త్రాగేందుకు మంచినీరు చాలా స్కూళ్ళలోనే కాదు కాలేజీల్లోకూడా లభించటంలేదు. ఇవన్నీ భావితరాలపై మనం చూపుతున్న అశ్రద్ధకు తార్కాణం.

A man is what he eats అంటారు. మనిషి శారీరకంగానూ మానసికంగానూ అభివృద్ధి కావటానికి సంపూర్ణాహారం ముఖ్యం. మాంసకృత్తులు, పిండిపదార్థాలు క్రొవ్వు పదార్థాలు, విటమిన్లు, లవణాలు తగిన మోతాదుల్లో వున్న ఆహారం తీసుకున్నప్పుడే- ఈ అభివృద్ధి సవ్యంగా వుంటుంది. మన దేశంలో నూటికి 90 మందికి ఈలాటి సంపూర్ణాహారం లభించటం లేదు. ఏదో ఒకటి తిని ఎలాగోలా బ్రతకవచ్చుగానీ... మానసిక అభివృద్ధి విద్యార్జన సక్రమంగా జరగవు. అభివృద్ధి చెందుతున్న దేశాల వెనుకబాటు తనానికి ఇదొక ముఖ్యకారణం. అందువల్ల ప్రతి స్కూలులోనూ Mid day Meal ఏర్పాటు చేసి పోషకాహారాన్ని విద్యార్థుల కందించే ఏర్పాటు చేయవలసి వుంటుంది.

విద్యా ప్రమాణాలు పడిపోతున్నాయని గొడవచేసే ముందు దానికి వాళ్ళనో వీళ్ళనో బాధ్యుల్ని చేసే ముందు, విద్యాస్థాయిపెరగడానికి విద్యార్థులు శారీరకంగా మానసికంగా పెరగటానికి అవసరమైన పనులు చేస్తున్నామా అన్న విషయాన్ని ప్రభుత్వం - విద్యాశాఖ శాస్త్రీయంగా పరిశీలించటం అవసరం. ఈ మధ్య ప్రభుత్వం మన విద్యా విధానంలో మరో క్రొత్త experment ప్రారంభించారు. పనిగంటలు పెంచటం పని దినాలు పెంచటం ఈ experment. తిక్కకుదిరింది రోకలి తలకు చుట్టమన్నాడట వెనుకటికొకరు. అట్లా ఉంది ఈ పని. ఈ పనులన్నీకూడా స్థాయి పెంచే వుద్దేశ్యంతోనే చేస్తున్నారు. మొన్నీమధ్యనే స్థాయి పెంచేందుకనీ పరీక్షా విధానంలో మార్పు చేశారు. పరీక్షా ఫలితాలు చూసి తలలు పట్టుకున్నారు. కొన్ని స్కూళ్ళూ కాలేజీలు మూతపడ్డాయి. మళ్ళీ పునరాలోచనా, గందరగోళం. రోజుకు రెండు పరీక్షలన్నారు. విద్యార్థులు గొడవచేస్తే సరే రోజు కొకటే నన్నారు. ఇప్పుడు 1వ తరగతినుండి 10 తరగతి దాకా పక్షపాతం లేకుండా అందరికి అరగంటా, గంటా పని గంటలు పెంచారు. నాలుగుగోడలమధ్య కూర్చుని చేతికొచ్చింది బర

కటుం పలుగురూ కాదంటే వారికివారే అడ్డుగీతలు పెట్టటంలా వుంది మన విద్యావిధానం - ఏదైనా మార్పు చేస్తే ఫలితాలు ఎలా వుంటాయి - ఎవరెవరితో చర్చించాలి - ముందు జాగ్రత్తలు ఏమి తీసుకోవాలి అన్న ఆలోచన మన విద్యాశాఖవారికి ఎప్పటికి వస్తుందో. అన్నింటికంటే మానసిక శ్రమ హెచ్చు అలసట కలిగిస్తుంది. దానినే గ్లాని అంటారు. విద్యార్జన మానసిక శ్రమతో కూడుకొన్న పని.

అన్నిటికంటే మానసికశ్రమ ఎక్కువఅలసట కలిగిస్తుంది. విద్యార్జన మానసికశ్రమతో కూడుకొన్నపని. అసలు స్కూలుకు వెళ్ళడమే చిన్నపిల్లలకు ఎంతో ఆందోళనతో కూడినపని-అన్ని రకాలుగానూ తనకు రక్షణయిచ్చి తనకు కావలసినవన్నీ వొనగూర్చుతున్న తల్లిదండ్రులను వదలి-ముక్కు మొగం తెలియని పిల్లలమధ్య-దండధారియైన teacher ముందు కూర్చోవాలంటే-భద్రతలేని పరిస్థితి కలిగించే మానసిక ఆందోళనతో విద్యార్జన ప్రారంభమౌతుంది - వాళ్ళను ముందు నుండి మానసికంగా తయారుచేస్తే-స్కూలుకు వెళ్ళటం వొక previlageలా ఫీలయేట్లు చేస్తే ఈ ఆందోళన కొంత తగ్గించవచ్చు.




'అబ్బాయికి ....... టి. బి. కాదు! కేన్సర్ కాదు! బడిలో పనిచేసే గంటలు పెంచారుగా! అలసిపోయి ఇలా అయిపోయాడు. టానిక్ రాసిస్తాను....

— ఆంధ్రప్రభ సౌజన్యంతో.

మనిషి జీవితంలో విద్యార్థి దశ చాలా ముఖ్యమైనది. ప్రపంచాన్ని గురించి వొక అవగాహన ఏర్పరచుకొనే దశ అది. ఈ దశలో ఏర్పరచుకొన్న భావాలు అంత త్వరగా వదలిపోవు. అవి మంచివికానీ, చెడ్డవికానీ. అలాగే అలవాట్లూను. ఈ దశలో ఆరోగ్యకరమైన అలవాట్లు ఏర్పడితే జీవితం పొడుగూతా వుంటాయి.

ఇది శారీరకం గానే కాక మానసికంగా కూడా పెరిగే దశ. ఈ దశల్లో శారీరకంగానే కాక మానసికంగా కూడా అధికశ్రమ పనికిరాదు. నిద్ర కూడా హెచ్చుగా కావాలి. 8-12 సం॥వరకు 10 గంటల నిద్ర, 12 నుండి 15 సం॥వరకు 9 గం॥ నిద్ర, 16 సం॥ తరువాత 8 గంటల నిద్ర అవసరం.

ఈ వయస్సులో ఆహారం ఎంత ముఖ్యమో ఆటలు కూడా అంత ముఖ్యం. విద్యార్థుల మీద జరిగిన కొన్ని ప్రయోగాలలో తేలిందేమిటంటే 3 గంటలు Classes జరిగిన తరువాత నూటికి 60 శాతం విద్యార్థుల్లో గ్రహణశక్తి సన్నగిల్లుతుందని రోజల్లా పనిచేసే నూటికి నూరుమందిలోనూ గ్రహణశక్తి సన్నగిల్లుతుందని అందులో నూటికి 20 మందికి ఒక రాత్రి నిద్ర తరువాత కూడా గ్రహణశక్తి పూర్వస్థాయికి చేరుకోదని తేలింది. విద్యా వయస్సు, ఆరోగ్యము బోధించే విషయాల మీద కూడా విద్యార్థి ఎంతకాలం చురుకుగా పనిచేయగలడు అన్నది ఆధారపడుతుంది.

Delthul అనే ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు కొన్ని పరిశోధనలు effective work hours నిర్ణయించారు. అతని పరిశోధనల ప్రకారం 8-9సం॥ వయస్సులో $3\frac{1}{2}$గం, 10-11సం॥ వయస్సులో, $4\frac{1}{2}$ గం॥ 12-13 సం॥ వ॥ 5-$5\frac{1}{2}$ గం॥, 13-18 సం॥ వయస్సులో 6-$6\frac{1}{2}$ గంటలు. మనస్సు చురుకుగా పనిచేయగలదు.

పై రెండు ప్రయోగాలనూ దృష్టిలో వుంచుకొని ఆలోచించినప్పుడు. 1 వ తరగతి విద్యార్థికి పనికాలం రోజుకు $3\frac{1}{2}$ గం. వుండాలి - అది క్రమేణా పెరుగుతూ 10 th Classకు వచ్చేసరికి 6 గంటలకు చేయవచ్చునని తెలుతుంది ఈ6 గంటలూ వరసనే కాక నడుమ Mini Meales వుండాల్సిన అవసరం వుంది. అలా చేసినప్పుడే మనస్సు చురుకుగా పనిచేయుటం చెప్పిన విషయాలను త్వరగా గ్రహించటం వంట పట్టించుకోవటం జరుగుతుంది. అందువల్లే పాఠం మధ్యలో 4 నిముషాలు విద్యార్థుల్ని నవ్వించ గలిగిన ఉపాధ్యాయుడు మంచి వుపాధ్యాయుడుగా పేరుపొందుతాడు అతని Subject విద్యార్థులకు బాగా వంట బడుతుంది. అలా nuternal ఇవ్వకపోతే మనస్సు దానంతటదే పగటికలల్లోకి జారుకొంటుంది. ఆ విధంగా దానంతట అదే విశ్రాంతి తీసుకుంటుంది.

(12 సంవత్సరాల వయస్సు వున్న బాలుడు సుమారు 40 నిమిషాల వరకు Cencentrate చేయగలడు. ఆ తరువాత కొంత విశ్రాంతి అవసరమవుతుంది.)

అధిక శ్రమవల్ల ఏర్పడ్డ విషపదార్థాలు నరాల Synapes వద్ద పేరుకొని వార్తా ప్రసారాన్ని నిరోధిస్తాయి. అందువల్ల మనస్సు చురుకుగా పనిచేయలేదు.

రోజుపని తరువాత ఆటలు, పూర్తిగాఢనిద్ర వున్నట్లయితే మనిషి మళ్ళీ మామూలు దశకు రాగలుగుతాడు. కొద్ది రోజులు అధికశ్రమ చేయవలసి వచ్చినప్పుడు కొన్ని విషపదార్థాలు నిలవవుండి పోవచ్చు. అలాంటప్పుడు వారాంతపు శలవలు పూర్తి విశ్రాంతికి వుపయోగించుకొంటే మనస్సు మళ్ళీfresh గా తయారవుతుంది. విశ్రాంతిగా గడపడం అంటే ఏమిటి? శారీరకంగా తక్కువ శ్రమకలిగించే, మానసిక ఉల్లాసాన్ని పెంపొందించే పనులు చేయటమే విశ్రాంతిగా పేర్కొనవచ్చు. ఉ॥ కళలు. చిత్రలేఖనం, సంగీతం, నృత్యం, నాటికలు, నాటకాలు Indoor games, caremes, గుళ్ళ బోర్డులు, chess, cards hight reading మంచి కథలపుస్తకాలు శాస్త్రీయ విజ్ఞానాన్ని

# శలవు నిబంధనలు

శ్రీ డి. రామిరెడ్డి, బి. ఎ. బియి. డి.
కార్యదర్శి, యు. టి. యఫ్.



ప్రతి ఉపాధ్యాయుడు తప్పని సరిగ తెలిసి కొనియుండ వలసిన నిబంధనలలో శలవు నిబంధనలు చాల ముఖ్యమైనవి. వానిని గూర్చి వివరముగ తెలిసికొందాం. ఆంధ్రప్రదేశ్‌లో ఆరు రకములైన శలవు నిబంధనలు అమలులోనున్నవి.

1) 1-10-47 కు పూర్వం హైదరాబాదు సంస్థానములో నియమింపబడిన వారికి వర్తించు పాతనిబంధనలు 2)1-10-47 కు పూర్వం హైదరాబాదు సంస్థానములో నియమింపబడిన వారికేవర్తించు 1947 శలవు నిబంధనలు (కొత్తవి) 3) తెలంగాణా ప్రాంతములో 1-11 56 కు పూర్వం నియమింపబడిన వారికి వర్తించు 1952 రివైజుడు నిబంధనలు 4) ఆంధ్రప్రాంతములో మాత్రమే వర్తించు మామూలు నిబంధలు 5) ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ అంతటికి వర్తించు 1933 శలవు నిబంధనలు 6) ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలలో అమలులో నున్న నిబంధనలు. శలవులలో అనేక రకములు శలవు, (1) క్యాజువల్ లీవు (2) స్పెషల్ క్యాజువల్ లీవు (3) ఎరండు లీవు (4) అర్ధ జీతపు శలవు (5) శలవు నిల్వలో లేనపుడిచ్చు లీవునాట్ డ్యూ (6) కమ్యూటెడ్ లీవు (7) ఎక్స్‌ట్రార్డినరీలీవు (8) రెఫ్యూజుడ్ లీవు (9) మెటర్నటీ లీవు (10) హాస్పిటల్ లీవు (11) స్టడీ లీవు

ముందుగా ఆంధ్రప్రదేశ్ అంతటికి వర్తించు నిబంధనలను గూర్చి తెలసుకొందాం. ఆటుపిమ్మట ప్రత్యేక తరగతి వారికి వర్తించు నిబంధనలనుగూర్చి తెలసికొందాం. ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ మేనేజిమెంట్లలో శలవు నిబంధనలు ఒకటిగానేయున్నవి. కాని ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలలో మాత్రము ప్రత్యేక నిబంధనలు అమలులో నుండుట గమనార్హము. ఈ విచక్షణ అర్ధరహితముగానున్నది. ఈ తేడా తొలగించుటకు కృషిచేయవలసియున్నది. ఆలాగే కిండరుగార్డెన్ పాఠశాలలు, నర్సరీపాఠశాలలలోని పని నిబంధనలు పాటించాలను విషయములో వివిధ మేనేజిమెంట్లు వివిధ రీతులలో వ్యవహరించుచున్నవి. ఈ విషయములో గూడ స్పష్టమైన ఉత్తర్వులకై ప్రయత్నించవలసి యున్నది.

## క్యాజువల్ లీవు

క్యాజువల్ లీవుకు ఫండమెంటల్ రూలు లేదు. అయినా ఉద్యోగులకు అవసరముగావచ్చు యిబ్బందులను ఎదుర్కొనుటకు ఈయబడిన సౌకర్యమని చెప్పవచ్చును. ప్రతి ఉద్యోగి సంవత్సరమునకు 12 రోజులకుమించకుండా వాడుకొనవచ్చును. టెంపరరీఉద్యోగులు మాత్రము నెలకు 1రోజు చొప్పున వాడుకొనవచ్చును. ఈ శెలవును, ఆదివారములతోను, ఇతర సెలవులతో కలిపి వాడుకొనవచ్చును అయితే సదరు శెలవులు, క్యాజువల్ శెలవు మొత్తము 10 రోజులకు మించరాదు. 11రోజు ఖచ్చితముగా డ్యూటీకి రావలెను, లేనిచో మొత్తం దినములకు ఎరండు లీవు పెట్టవలసి యుండును. అందుచేతనే వేసవి శెలవులకు జతచేసి క్యాజువల్ శెలవువాడరాదు ప్రస్తుతము దసరా, సంక్రాంతి క్రిస్టమస్ సెలవులు 8 రోజులకు కుదించ బడినవి. కావున యివి యిక ఎంతమాత్రము టెక్నికల్ సెలవుల వలె పరిగణింపరాదు. అవి 12 రోజులకు మించియుండెడివి. అందుచే

---

అందించే జనరల్ పుస్తకాలు. (డిటెక్టివ్‌లు మాత్రం కాదు)

Do it your self విద్యార్థులు తమంతటు తాముగా బిల్డింగులు కట్టటమని, బ్రిడ్జిలు కట్టటమని యోచిస్తూ వుంటారు. ఇవి చాలా మంచివి, అలాగే పేపరు కత్తిరింపులు, కట్టు, ప్లాస్టిక్ బుట్టలు అల్లటం, స్వెట్టర్లు అల్లటం, నవ్వారు అల్లటం, అలాగే విద్యార్థి సంఘాలలో చేరి పనిచేయటం దానివల్ల విద్యార్థులు చెడిపోతారని కొందరు భయపడతారు కానీ అది నిజం కాదు. అదివొక విశ్రాంతి కార్యక్రమంగానే కాక విద్యార్థులకు తమ చుట్టూ వున్న సంఘాన్ని అర్థం చేసుకోవటంలో తమ సాంఘిక బాధ్యతలను గుర్తించేట్లు చేయటంలో ఎంతో వుపకరిస్తుంది.

ఈ విశ్రాంతి కార్యక్రమాలేవీ - అవి వొక పిచ్చిగా తయారుకారాదు. వేటిలోనూ అతిగా పోరాదు. అలా పోతే అవి విశ్రాంతి కార్యక్రమాల విలువ కోల్పోయి గ్లాని కలిగించే కార్యక్రమాలుగా మారతాయి. విశ్రాంతి కార్యక్రమాలును నిర్ణయించటంలో విద్యార్థులకు స్కూలులో ఉపాధ్యాయుల నుండి ఇంటివద్ద తల్లిదండ్రుల నుండి సహాయ, సహకారాలవసరం. ఈ కార్యక్రమాలు ఒక పిచ్చిగా మాత్రం తయారు కారాదు, నాటకం పిచ్చి, డిటెక్టివ్‌ల పిచ్చి etc.

ప్రపంచంలోని జంతువు లన్నిటికంటే మానవుడ్ని ఉన్నతుడుగా చేసేది మనస్సు. ఈ మనస్సు మానవ శరీరంలోని అన్ని అవయవాలకంటే సున్నితమైనది. దానికి పదును పెట్టి అభివృద్ధి చేసుకోవలసిన అవసరం ఎంత వుందో అది అధిక శ్రమతో మొద్దుబారిపోకుండా చూసుకోవలసిన అవసరం కూడా అంతే వుంది.

మన విద్యా విధానం లక్ష్యం విద్యార్థుల జ్ఞాపక శక్తిని పెంచటానికి, వారి ఆలోచనా శక్తిని అభివృద్ధి చేయటంగా వుండాలి. సిలబస్సు పెంచటం ద్వారా, పనిగంటలు పెంచటం ద్వారా విద్యార్థుల స్థాయి పెరుగుతుందనుకోవటం అశాస్త్రీయమైన అవగాహనే అవుతుంది.

దసరా, సంక్రాంతి సెలవులతో కలసి క్యాజువల్ సెలవు మొత్తం 10 రోజులకు మించకుండా వాడుకొనవచ్చును. ఎప్పుడైనా ప్రధానోపాధ్యాయులు ఒప్పుకొననిచో మాదృష్టికి తెచ్చినచో ప్రభుత్వ వివరణ సంపాదించగలము.

## స్పెషల్ క్యాజువల్ లీవు

సాధారణముగా యిచ్చెడి 12 కాజువల్ లీవులుగాక ప్రత్యేక పరిస్థితిలో వాడుకొనుటకుగాను ఉద్యోగులకు వివిధ రకములుగ క్యాజువల్ లీవు మంజూరు చేయబడినది. జి.ఓ. యం.యస్, నెం 47 తే 19-2-65 ప్రకారము వెకేషన్ డిపార్ట్ మెంటులో పనిచేయు టీచింగు నాన్‌టీచింగు సిబ్బందికి అత్యవసరమైన కుటుంబ యిబ్బందులలో వాడుకొనుటకు 7 రోజులు స్పెషల్ క్యాజువల్ లీవు మంజూరు చేయబడినవి. దీనిని మామూలు క్యాజువల్ లీవువలె వాడుకొనవచ్చును, కాని కారణము ప్రత్యేకమైనదిగ యుండవలెను. ప్రధానోపాధ్యాయులు తృప్తిపడినచో ఏకారణమునకైనను ఈయవచ్చును అయితే లెక్కలు 19 రోజులుగ చూపక 12+7గా చూపవలెను క్యాజువల్ లీవు నిలువలో యుండగనే స్పెషల్ క్యాజువల్ లీవు వాడుకొనవచ్చును.

II ఇవిగాక కుటుంబనియంత్రణ అపరేషను చేయించుకొన్నపుడు అరుపనిదినములు స్పెషల్ క్యాజువల్ లీవుగా ఈయబడును. భార్యాభర్తలలో ఒకరు ఉద్యోగియై యుండినచాలును. వారిలో ఎవరు ఆపరేషన్ చేయించుకొన్నా ఈ సెలవుయిస్తారు. అయితే ఆపరేషన్ విఫలమై మరలా వారే చేయించుకొన్నచో తిరిగి ఈ శలవు ఈయరు. ఈ శలవు 6 పనిదినములు మాత్రమే యిస్తారు. దీనిని ఇతర శలవులతో కలిపి వాడుకొనవచ్చును. కాని క్యాజువల్-స్పెషల్ క్యాజువల్ లీవులు, వేసవి శలవులతో కలిపి వాడుకొనరాదు. ఇవిగాక యితర శలవులతో కలిపి వాడుకొనినపుడు మొత్తము శలవులు ఇన్ని అని పరిమితిలేక యుండవచ్చును. అపరేషనుచేసిన తేదీ నుండి ఈ శలవు ప్రారంభమగును. వివరములకు ఫండమెంటల్ రూల్సు అనెక్సరు VII లోను జి.ఒ.యం.ఎస్. నెం: 23/3 ఫైనాన్సు తే 10-12-1959 మరియు మెమోరాండం నెం. 43785/2016-యఫ్ ఆర్ ఐ/63-2 తే 24-2-1965 చూడవచ్చును.

III మైఫాయిడు, కలరా నిరోధకముగ టీకాలు వేయించుకొనిన, 4 తరగతి ఉద్యోగులకు మినియలు సిబ్బందికి ఒకరోజు స్పెషల్ క్యాజువల్ లీవు యిస్తారు.

IV. జాతీయ క్రీడా పోటీలలో పాల్గొను క్రీడాకారులకు 30 రోజులకు మించకుండా స్పెషల్ క్యాజువల్ లీవు యిస్తారు.

V. గుర్తింపబడిన ఉద్యోగ సంఘాల ముఖ్యమైన అఫీసు బేరర్లకు సంవత్సరమునకు 7 రోజులు ప్రత్యేకమైన సెలవు యిస్తారు.

VI ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్ కల్చరల్ అసోసియేషన్ వారు నాటక కార్యక్రమములలో పాల్గొనుటకు 7 రోజులిస్తారు. అలాగే కన్స్యూమర్ స్టోర్సులో సరకులు కొను వారికి గూడ - నెలకొక రోజు స్పెషల్ క్యాజువల్ లీవు మంజూరు చేస్తారు.

(ఎరండులీవును గూర్చి రాబోవు సంచికలో)

# ప్రశ్నోత్తరాలు



శ్రీ యన్. సీతారామాచారి,
ఉపాధ్యక్షుడు, ఎ. పి. యు. టి. యఫ్.

శ్రీ సి. వి. యన్. అవధానులు, తిరువూరు, కృష్ణాజిల్లా.

ప్రశ్న :- ప్రోపరు చానలు ద్వారా పంపుకొన్న పిటీషను కాపీని, పై అధికారులకు అడ్వాన్సు కాపీగా పంపుకొనవచ్చునని తెలిసినది. అట్లు పంపుకొనుట తప్పని, కృష్ణా డి ఇ ఓ అఫిషియల్‌గా అనుచున్నారు. అట్లు పంపుకొనవచ్చునా ? తెలియజేయండి.

జవాబు : పంపుకొనవచ్చును 'An officer or servant of a Panchayat samithi or Zillaparishad who has addressed through his immediate superior, a superior authority may if he wishes submit to the superior authrority direct a copy of the Communication sent through his immediate superior' అని పంచాయితీరాజ్ ఉద్యోగుల 20వ కాండక్టు రూలు క్రిందనున్న నోటులో నున్న ఆదేశము మేరకు సుపీరియరు అథారిటీకి అడ్వాన్సు కాపీ పంపుటలో దోషము లేదు. అట్లే ప్రభుత్వ ఉద్యోగులకు గూడ యిట్టి సౌకర్యమున్నది. ప్రభుత్వ ఉద్యోగుల కాండక్టు రూల్సును పరిశీలించండి.

ప్రశ్న : పెన్షను మంజూరు సందర్భములో బ్రేకు పీరియడును ఒక సంవత్సరము వరకును డి.ఇ ఓ కండోన్ చేయవచ్చునని పత్రిక ద్వారా తెలిపినారట ! దానికి ఆధారమైన ఉత్తరువు నెంబరును తెలియజేయండి.

జవాబు :- ప్రదేశ్ ప్రభుత్వ ఫైనాన్సు వింగ్, పెన్షన్ స్పెషల్ సెల్ II డిపార్టుమెంటు లెటరు నెం. 46110 - బి/1542/ పెన్షను స్పెషల్ సెల్ II/ 76 - 3 తే. 16- 7- 76 లో "As per Rule 10 (a) issued through G. O M S No 3372 Education dated 31- 10- 1961, the Breaks in service can be condoned by the District Eductional

officer himself subject to the fulfilment of following conditions" అనియు, "The interrptions should have been caused by reasons beyond the control of the teachers" అనియును, "Service procedings the interruptions (two or more) should not be less than five years duration" అనియును, "The interruptions (two or more) should not be more than one year's duration" అనియును యిచ్చిన వివరణను పరిశీలించండి.

శ్రీ యన్. చంద్రశేఖరరావు,

రేవేంద్రపాడు, గుంటూరుజిల్లా.

ప్రశ్న : "ఈమని" సమితి అధికారులు 1968 వ సంవత్సరములో 17 మంది సెకండరీగ్రేడు ట్రైండు ఉపాధ్యాయులను హైయ్యరుగ్రేడు పోస్టులలో నియమించి తే 1-9-71 నుండి ఆ పోస్టులను అప్‌గ్రేడు చేశారు. కాని ఒకరిద్దరు ఉపాధ్యాయులను నేరుగా తే 1-1-71 ననే సెకండరీ గ్రేడు పోస్టులలో నియమించారు. ఈ వెనుక నియమించబడిన ఉపాధ్యాయులు, హైయ్యరుగ్రేడు పోస్టులలో 1968 లో నియమించబడిన సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుల కంటె సీనియర్లుగా పరిగణించబడుచున్నారు. ఇది న్యాయమేనా ? తగు నోపాయమును చెప్పండి.

జవాబు: హైయ్యరు గ్రేడు పోస్టులలో నియమించబడిన 17 మంది పోస్టులను తేది 1-7-71 కు ముందుగానే, అప్‌గ్రేడు చేసియున్న యెడల యీ సమస్య ఉదయించెడిది గాదు. ఈ విషయములో ఎడ్యుకేషన్ (హెచ్)డిపార్టుమెంటు మెమోరాండము నెం. 271-హెచ్ 1/72-4 తే 24-5-1975 లో "Government order that the Post of Hegher grede Teacher shall be up graded to that of Secondary grade Teachers un conditionally when over a Secondary grade is posted to that post or working in that post" అని జారీ చేసిన క్లారిఫికేషనును ఆధారము జేసుకొని అప్పటినుండి యీ 17 పోస్టులను తిరిగి అప్ గ్రేడు చేయబడుటకు రిప్రజెంటు చేయండి.

ప్రశ్న : ప్రధానోపాధ్యాయుడు, ఒ. డి. మీదగాని, సి. యల్. మీద గాని వెళ్ళినప్పుడు ఆ స్థానములోనున్న ఇన్‌చార్జి హెడ్మాష్టరునకు సహాయోపాధ్యాయులకు సి యల్. మంజూరు చేయు అర్హతగలదా? ఆధారముతో తెల్పండి.

జవాబు: ఉన్నది. హెడ్మాష్టరుస్థానములో ఇన్‌చార్జిగా నుండుట, ఇన్‌చార్జి పీరియడులో హెడ్మాష్టరు విధులను నిర్వర్తించుటకే గదా! హెడ్మాష్టరుగారిచ్చిన ఇన్‌చార్జి యుత్తరువే ప్రధానమైన ఆధారము.

శ్రీ కూచి సూర్యప్రకాశశర్మ, అనకాపల్లి, విశాఖ జిల్లా.

ప్రశ్న : లిబరలైజుడు పెన్షను పథకం అమలులోనికి వచ్చిన స్థితిలో ఉపాధ్యాయులు పి యఫ్. కట్టకుండా మాని వేయ వచ్చునా ?

జవాబు : మానివేయరాదు.

ప్రశ్న : నిలువయున్న పి.యఫ్.ను సర్వీసుతో నిమిత్తం లేకుండా, రిటైరుమెంటుకు ముందుగనే పూర్తిగా తీసుకొన వచ్చునా ?

జవాబు: పూర్తిగా తీసుకొనుటకు ప్రభుత్వ ఉత్తరువులు అనుమతించవు 25 సం॥లకు తక్కువగాకుండా సర్వీసు పూర్తి జేసిన తరువాతగాని లేక రిటైరు మెంటునకు 5 సంవత్సరములకు ముందుగగాని స్థానిక సంస్థల ఉపాధ్యాయుల కుటుంబ వివాహకార్యముల నిమిత్తం తిరిగి కట్టవలసిన అవసరంలేకుండా అరునెలల జీతమువరకును ఫైనల్ విత్ డ్రాలు, జి ఓ. యం. యస్. నెం 2256 యల్. ఎ. తే 17-9-56 లోని ఆదేశముల మేరకు చేయవచ్చును.

శ్రీ బి. సత్యనారాయణ, గోడిలంక, తూ.గో. జిల్లా

ప్రశ్న :- మా పాఠశాలలో హైయ్యరు గ్రేడు అసిస్టెంటుగా పనిచేసిన శ్రీ సుందరంగారి సర్వీసు రిటైరుమెంటు తేది 15-1-1971. అయితే మా సమితి అధికారులు ఆయనను ఆ విద్యాసంవత్సరం చివరవరకును సర్వీసులో రీ - ఎంప్లాయిమెంటు పీరియడులో తే 12-4-71న యన్. జి ఓ ల, ఉపాధ్యాయుల సమ్మె ప్రారంభమయింది. సమ్మె కాలములో సర్వీసు నుండి రిలీవు చేయగూడదని అభిప్రాయపడి, మా పాఠశాల హెడ్మాష్టరుగారు ఏప్రియల్ 10వ తేదీననే ఆయనను సర్వీసు నుండి రిలీవు జేశారు అందువలన ఆయన, ఆ విద్యా సంవత్సరము చివరవరకును పనిచేయలేకపోగా, ఆ రోజులకు అనగా తే 10-4-71 నుండి 23-4-71 వరకును గల 14 రోజులతోపాటు సమ్మర్ వెకేషను జీతమును గూడ పోగొట్టుకొనుట జరిగింది. ఈ కాలమునకు ఆయన జీతము పొందుటకు మార్గం చెప్పండి.

జవాబు: సమ్మెలో పాల్గొన్న రీ-ఎంప్లాయిడు టీచర్లకు గూడ ప్రభుత్వ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు మెమోరాండం నెం. 3119-జి 2/71-8 ఎడ్యుకేషన్ తే 15-5-72 ద్వారా, సమ్మెపీరియడుకు లీవు మంజూరుచేయు అవకాశముకల్పించి సమ్మర్‌వెకేషన్ జీతము బట్వాడా చేయించారు. అయితే అటువంటి ఉపాధ్యాయులు సమ్మెకు ముందు రోజు అనగా తే 11-4-1971 న సర్వీసులో నుండవలెనను షరతు విధించుట జరిగింది. మీరు పేర్కొన్న శ్రీ సుందరం తే 10-4-71 ననే సర్వీసు నుండి రిలీవు చేయబడుట వలన వెకేషను జీతముగాని, సమ్మె పీరియడు జీతముగాని పొందుటకు అవకాశం లేకుండా పోయినది. పైన చెప్పిన మెమోరాండములో "government also direct that of the leave of credit is not sufficient to cover the entire period from 12-4-1971 to 23-4-1971 or if they have not earned leave during the period of re-employment, such short fall or entire period as the care may be treated as extra-ordinary leave with eligibility by summer-Vacation salary provided they were in service on 11-4-71" అని యున్న ఆదేశమును పరిశీలించండి.

శ్రీ ఎ. యన్. అప్పారావు. అనకాపల్లి, విశాఖజిల్లా

ప్రశ్న :- బి ఓ. యల్. యోగ్యత గలిగి, పండితశిక్షణ పొంది. గ్రేడు I తెలుగు పండితులుగా నియమించబడినవారు రూ 180/-లు (150 + 30) జీతము పొందుటకు అర్హులేనా?

జవాబు :- అర్హులే- ఆంధ్రప్రదేశ్, విద్యాశాఖా డైరక్టరుగారి ఆర్. సి నెం 11368 జి 2 / 70 తే 23-11-70 లో యీ విషయముపై వివరణ యున్నది. పరిశీలించండి.

ప్రశ్న : జి. ఓ యమ్. యస్. నెం 1818 ఎడ్యుకేషన్ తే 4- 12- 71 లో "టు- ఓరియంటల్ టైటిల్ హోల్డర్సు మాత్రమే రూ 180/. ల జీతమునకు అర్హులని చెప్పియున్నారట! టు- ఓరియంటల్ టైటిల్సు అంటే యేమి! పూర్తివివరణ యివ్వండి.

జవాబు : టు-ఓరియంటల్ టైటిల్సు అనగా, రెండు భాషలలో (తెలుగు,సంస్కృతములలో) ఓరియంటల్ టైటిల్సు కలిగియుండుట జి ఓ యం యస్.నెం. 1818 లో మీకుచెప్పిన అర్థములో చెప్పియుండలేదు. అందులో 'As higher starts were allowed in the Pre-revised pay scales to Grade I Telugu pandits Possessing two oriental Title-one in Telugu and the other in Sanskrit' అనియును, 'Government direct that the above benefit of advance incriments be extended in the revised scales of pay of Rs. 150-300 issued to the posts in G.Os read above and their pay be fixed at Rs. 180/- in the revised scale which will be absorbed in future increments' అనియును చెప్పియున్నారు. అనగా ప్రీ-రివైజుడు స్కేళ్లలో టు - ఓరియంటల్ టైటిల్ హోల్డర్లకున్న యీ హైయ్యరుస్టార్టు వడుపాయమును, రివైజుడు స్కేళ్ళలో రూ. 150-300 స్కేలులోనున్న వారందరికి విస్తృతపర్చి, వారికి యీ స్కేలులో రూ. 180/-గా ప్రారంభ వేతనం నిర్ణయించియున్నారు తప్ప టు-ఓరియంటల్ టైటిల్సు హోల్డర్సు మాత్రమే రూ. 180/-ల హైయ్యరుస్టార్టు జీతమునకు అర్హులని చెప్పియుండలేదు.

శ్రీ టి. పాండురంగవిఠల్, పోతార్లంక, గుంటూరుజిల్లా.

ప్రశ్న : ఒక మహిళాటీచరు, సర్వీసులో జేరిన 4 నెలలలోనే, ప్రసూతి శలవు పెట్టుకొన వలసి వచ్చినది - ఆ లీవు మంజూరు కాదంటున్నారు. పర్మనెంటు మహిళా టీచర్లే ప్రసూతి శలవు పెట్టుకోవాలా ? టెంపరరీ టీచర్లు పెట్టుకొనరాదా ? తెలియజేయండి.

జవాబు :- టెంపరరీ వారితోసహా నాన్ పర్మనెంటు మహిళాటీచర్లందరును గవర్నమెంటు మెమో నెం 69112/1288/యఫ్ ఆర్/62-1 తే 2-4-62, ఫైనాన్సు డిపార్టుమెంటులోని ఆదేశముల మేరకు రెండు నెలల ప్రసూతి శలవు పెట్టుకొనుటకు అర్హులు - ఈ మెమోలోని మొదటి పేరాలో 'In modification of the instructions issued in the memo cited, the following instructions are issued in regard to the grant of Maternity leave to non-Permanent woman servants in-cluding those working temporarilly' అని చెప్పిన ఆదేశము మేరకు, మీరు పేర్కొన్న మహిళా టీచరుకు ప్రసూతి సెలవును అధికారులు మంజూరు చేయుటకు యెటువంటి అభ్యంతరమునులేదు. తప్పక మంజూరు చేయవలసి యుంది.

శ్రీ సి. హెచ్ పిచ్చయ్య, సీతారామపురం, నెల్లూరు జిల్లా

ప్రశ్న : నేను దసరా శలవులకుముందు దినమున అనగా ఆఖరు పనిదినమున స్కూలుకు హాజరైనాను. శలవులఅనంతరము 16-1-75న పాఠశాల ప్రారంభించినారు. నేనుఉదయం సెషన్‌కు హాజరుకాలేక పోయినాను. మధ్యాహ్నం సెషన్‌కుహాజరైనాను. ఉదయం సెషనుకు నేను సి.యల్. పెట్టుకొనుటకు అవకాశమున్నదా? లేదా? తెలియజేయండి.

జవాబు: అవకాశంలేదు. వెకేషన్లతో కంబైను జేస్తూ క్యాజుయల్ లీవు పెట్టుకొనరాదు. స్పెషల్ క్యాజుయల్ లీవు విషయములో "Whether special casual leave Prefixed or suffixed to the public holidays and term of holidays" అను ప్రశ్నకు, విద్యాశాఖా డైరక్టరుగారు ఆర్. సి. 1789/ సి 2/65 తేది 11-4-1966 నాటి ప్రొసీడింగ్సు ద్వారా, "Yes, the special casual leave may be prefixed or suffixed to the public holidays" అనియును, జవాబిస్తూనే "It should not be conbined with Vacations" అనియు గూడ జవాబిచ్చుట జరిగింది. అనగా అది వెకేషన్లతో కంబైను చేయబడరాదు. "అని స్పష్టపడుచున్నది. క్యాజుయల్ లీవునకు గూడా యిది వర్తించగలదు. ఈ స్థితిలో దసరా శలవులతో కంబైనుజేస్తూ క్యాజుయల్ లీవు పెట్టుకొను అవకాశము లేదు.

శ్రీ జి. యస్. ప్రసాదరావు, పాలకొల్లు ప.గో.జిల్లా

ప్రశ్న : సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయులకు 1044 జి ఓ మేరకు రిఫిక్సేషన్ జరపవలసి యుండగా, అది జరుగకుండా డి ఏ మెర్జరు స్కేళ్లు అమలు జరపమని మా మేనేజిమెంటువారు అంటున్నారు. యస్. ఆర్. లు యిచ్చుటనే యున్నవి. ఇది యెంతవరకు న్యాయమో తెలుపండి.

జవాబు : సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయులకు 1044 జి ఓ మేరకు రిఫిక్సేషను జేసి వారికి డి ఏ మెర్జరు స్కేళ్లలో జీతనిర్ణయము జేసినప్పుడు యెంతో వని కలిసివస్తున్న మాట వాస్తవము. అయితే అందుకొరకు మిగిలిన ఉపాధ్యాయులకు డి. ఏ మెర్జరు స్కేళ్లు అమలు జరపకుండా అపుట న్యాయము గాదు.

శ్రీ యస్. గోపాలకృష్ణయ్య. కొమరోలు, కర్నూలుజిల్లా

ప్రశ్న :- నన్ను విద్యా సంవత్సరము ఆఖరు వరకును సర్వీసులో రీఎంప్లాయిమెంటు చేశారు. నాకు నిలువలోనున్న ఎరండులీవుగాని, కమ్యూటెడ్‌లీవుగాని,యీ రీఎంప్లాయ్‌మెంటు కాలములో వాడుకొన వచ్చునా, వాడుకొనరాదా ? తెలియజేయండి.

జవాబు:- వాడుకొనరాదు విద్యాశాఖా డైరక్టరుగారు యీ విషయములో ఆర్. సి. నెం. 176412- బిII- 2/68 తే. 17- 3- 1968 ద్వారా "During the period of re-employment the teachers are not eligible for benefit such as provident Fund leave etc," అనియును, "The leave to the credit of the teachers on the date Superanution, if any will be lapsed" అనియును వివరణ యిచ్చియున్నారు పరిశీలించండి.




## అమెరికాలో - చదువు సంధ్యలు

అమెరికాలో బాల బాలికలందరికి మొదటి పన్నెండు తరగతులవరకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే వుచిత విద్యకు ఏర్పాట్లు చేస్తాయి. అయితే తలిదండ్రులు తమ బిడ్డలను ప్రయివేటు పాఠశాలలకు గాని, మత సంస్థలు నిర్వహించే పాఠశాలలకుగాని పంపదలచితే పంపుకోవచ్చు. అమెరికాలో 6 నుండి 13 సంవత్సరాల మధ్య వయస్సు బాల బాలికలలో 99 శాతం పాఠశాలల్లో చదువుకుంటున్నారు. 14 నుండి 17 మధ్య వయస్సుగల బాల బాలికలలో 91 శాతం విద్యనార్జిస్తున్నారు.

అమెరికాలో సర్వసాధారణంగా ఆరుసంవత్సరాల ప్రాథమిక విద్య గరపబడుతుంది. ఆ తర్వాత రెండు సంవత్సరాల జూనియర్ హైస్కూలు, 4 సంవత్సరాల సీనియర్ హైస్కూలు విద్యగాని, లేదా మూడు సంవత్సరాల జూనియర్ హైస్కూలు, మూడు సంవత్సరాల సీనియర్ హైస్కూలు విద్య అమలులో వున్నాయి.

సెకండరీ విద్య ముగించిన వారిలో దాదాపు సగం మంది వున్నత విద్య నభ్యసిస్తారు. వారిలో హెచ్చుమంది నాలుగు లేదా ఐదు సంవత్సరాలు వున్నతవిద్య నభ్యసించి ఆర్ట్సు, లేదా సైన్సు సబ్జెక్టులలో పట్టభద్రులవుతారు.

అమెరికాలో కాలేజీలూ, యూనివర్సిటీల ఆదాయంలో 25 శాతం మాత్రమే విద్యార్థులనుండి లభిస్తోంది, మిగతా మూడు వంతులూ రాష్ట్ర, లేదా స్థానిక లేదా ఫెడరల్ ప్రభుత్వాలు; పరిశ్రమలు, ధర్మసంస్థలు, వ్యక్తిగత దాతలు సమకూర్చుతున్నారు.

అమెరికాలో విద్యావిధానంపై కేంద్ర ప్రభుత్వం అజమాయిషి చాలా పరిమితంగా వుంటుంది. పాఠశాలల నిర్వహణ బాధ్యతను రాష్ట్రాలే వహిస్తాయి. రాష్ట్రాలు ఆ అధికారాలను జిల్లాలకు బదలాయించుతాయి. జిల్లా ప్రజలచే ఎన్నుకోబడిన విద్యాబోర్డులు ఆ బాధ్యతను నిర్వహిస్తాయి. స్థానికంగా విద్యాబోర్డులురూపొందించటం, స్థానికపాఠశాలబడ్జెటుతయారు చేయడం, ఉపాధ్యాయుల నియామకం, భవనాలను ఏర్పాటు చేయటం, విద్యా పరికరాలను సమకూర్చటం, పాఠశాలలపై అజమాయిషీ ఆ బోర్డులే చేస్తాయి. విద్యా బోర్డులలో హెచ్చు భాగం పాఠశాలల సూపరింటెండెంటును నియమించి కార్య నిర్వహణ జరిపిస్తాయి.

పాఠశాల బోర్డులతోపాటు, తలిదండ్రుల ఉపాధ్యాయుల సంఘాలవంటి సంస్థల ద్వారా ప్రజలు పాఠశాలల నిర్వహణలో పాత్ర వహిస్తారు విధానాలను గూర్చి చర్చించుతారు అభివృద్ధి కార్యక్రమాలు చేపడతారు.

పాఠశాలలు హెచ్చు భాగం ఖర్చు తక్కువ, మన్నిక ఎక్కువగా వుండే సామగ్రితో నిర్మించబడుతాయి.

బాలబాలికలు తమ యిండ్లనుండి మధ్యాహ్నం భోజనం తెచ్చుకుంటారు. కొన్ని తావుల్లో ఆయా పాఠశాలల వంటశాలల్లోనే నామమాత్రపు ఖరీదుకు వేడివేడి భోజనం సమకూర్చబడుతుంది.

సాధారణంగా ఆరవ ఏట ప్రాథమిక పాఠశాలలో ప్రవేశించుతారు ఆ తర్వాత ఏటా ఒక తరగతిచొప్పున చదువుతుంటారు. ప్రతి పాఠశాలలోనూ క్రీడా సౌకర్యాలుంటాయి.

విద్యార్థులకు ఆయా సబ్జెక్టులలోనే గాక వారివారి గుణగణాలను బట్టి మార్కులు లేదా గ్రేడులు యిస్తారు. మర్యాద మన్ననలు, సహకారం, చొరవ, కృషి తదితర లక్షణాలకు మార్కులు వేస్తారు. కొన్నిచోట్ల ఎ, బి, సి, డి అను గ్రేడులు, మరికొన్నిచోట్ల సంఖ్యలలో మార్కులు వేస్తారు. మార్కులు వేసే పద్ధతి మంచిదా? గ్రేడులుగా పేర్కొనే పద్ధతి మంచిదా? అనే విషయంలో అమెరికాలో భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరి కొకటినచ్చితే, మరికొందరికి ఇంకొకటి నచ్చుతోంది. దేనిలో వుండే మంచి చెడులు దానిలో వున్నాయి.

ప్రాథమిక విద్యా దశలో విద్యార్థికి రోజంతా ఒకే ఉపాధ్యాయుడు లేదా ఉపాధ్యాయిని చదువు చెబుతారు. కాని సెకండరీ దశలో సబ్జెక్టు వారీగా వేర్వేరు ఉపాధ్యాయులు బోధిస్తారు.

ప్రాథమిక దశలో గాక సెకండరీ దశలో విద్యార్థిక యింటివద్ద చేసుకురావలసిన వ్రాతపని యొప్పగించబడుతుంది.

జూనియర్ హైస్కూలు దశలో ఇంగ్లీషు, సోషల్ స్టడీస్, లెక్కలు, సైన్సు, ఆర్టు, సంగీతం, ఫిజికల్ ఎడ్యుకేషన్ పాఠ్యాంశాలుగా వుంటాయి.

---

### సంఖ్యా గమనిక

1. చందాదార్ల కంప్లైయింట్స్ పరిశీలించుటకు చందా నెంబరు తప్పక ఉదహరించాలి.
2. అడ్రసులు పంపేప్పుడు పిన్‌కోడ్ వేసి పంపండి.

ఎడిటర్, ఐక్య ఉపాధ్యాయ

---

# విద్యార్థులు-సమస్యలు

శ్రీ టి. రమణయ్య

స్వాతంత్ర్యానంతరం ఎన్నికమీషన్లు, కమిటీలు వేసినా, అవి అనేక సిఫార్సులు సూచనలు జేసినా, నేటికీ సంక్లిష్టమైన సమస్యల పుట్టగా వున్నది మన విద్యారంగం. విజ్ఞులంతా అరమరికలులేకుండా అంగీకరిస్తున్న సత్యమిది. ఆ రంగంలో రెండు మూడు అంశాలకే పరిమిత మీ వ్యాసం. కనుక దీని పరిధీ-పరిమితి సుస్పష్టమే. ఆ దృష్టితోనే ఈ వ్యాసాన్ని పరిశీలించ గోరతాను.

గత సంవత్సరం 'క్రమశిక్షణ' నాలుగుపాదాలా నాట్యమాడినా, భయభక్తులతో భక్తి శ్రద్ధలతో విద్యార్థులూ - ఉపాధ్యాయులూ తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించినా పరీక్షా ఫలితాలు ఎన్నడెరుగనంతటి నిరాశా పూరితంగా వచ్చాయి. ఆ వివరాలన్నీ యిదివరకే వెలువడ్డాయి గనుక ప్రత్యేకంగా పేర్కోవడంలేదు. అయితే ఫలితాలు ప్రకటించిన మర్నాటి నుండే 'విద్యా ప్రమాణాలు పడిపోయాయనే ప్రచారం జోరెంది. వాస్తవ పరిశీలన మరుగునబడ్డది. ప్రమాణాలను - పరీక్షా ఫలితాలతో కలగాపులగంజేసి గందరగోళ పరచడం జరిగింది. ఆ దృక్పథం నుండే కొన్ని చర్యలు చేపట్టబడ్డాయి. అవి మరిన్ని కొత్త సమస్యలను సృష్టించాయి.

ఏ తరగతిలోనైనా, ఏ సబ్జక్టులోనైనా పాతికేళ్ళనాటి విద్యార్థికి నేటి విద్యార్థికి బోధిస్తున్న విషయాలను, విజ్ఞానాన్ని పరిశీలిస్తే ప్రమాణాలు పడిపోకపోగా పెరిగాయని తేటతెల్లం కాగలదు. అయితే విజ్ఞానాన్ని అంచనా వేసేందుకు పరీక్షా ఫలితాలు కొలబద్ద గావాలంటే భారతదేశ భౌతిక పరిస్థితుల్లో, పెరిగిన సిలబస్ కనుగుణంగా అభివృద్ధి జెందని అవకాశాలు, తీరని అవసరాల తీరుల్లో నేటి అశాస్త్రీయ పరీక్షల పద్ధతి అందుకు గీటురాయి కాజాలదని మా నిశ్చితాభిప్రాయం.

మరి, విద్యార్థులు విస్తృతంగా తప్పడానికి గల కారణాలేమిటి? తలకు మించిన సిలబస్ : శాస్త్రీయ పద్ధతిలో విద్యార్థుల వయస్సు, గ్రహణశక్తి గమనంలో వుంచుకొని మారుతున్న దేశకాల పరిస్థితుల కనుగుణంగా సిలబస్ నిర్ణయించడం సబబు, కానీ సిలబస్ నిర్ణయక్రమంలో అలాంటి ప్రాతిపదిక లేవీ లేవనడానికి అనేక వుదాహరణ లున్నాయి. 10 తరగతిలో పబ్లిక్ పరీక్ష ప్రవేశపెట్టక పూర్వమూ (1968) నేడూ అమలుజరుగుతున్న X క్లాస్ విద్యార్థి సిలబస్ గమనిస్తే హనుమంతుని తోకలా అదెంత పెరిగిందీ అర్థం కాగలదు.

అలాగే యింటర్ సిలబస్ గూడానూ. నారికేళపాక పూరితమైన యింటర్ రెండవసంవత్సరపు ఇంగ్లీషు టెక్స్టులో జాన్సన్ వ్యాసం అలాంటివే మరికొన్ని వ్యాసాలూ అందుకు సాక్ష్యం.

## సకాలంలో రాని పుస్తకాలు

విద్యా సంవత్సరం మొదలైన మూడు నెలలకుగాని పుస్తకాలన్నీ దర్శనం గాకపోవడం ఆనవాయితీ. 5 వతరగతి లెక్కలు, 8 వ తరగతి భౌతికశాస్త్రం, కాంపోజిట్ లెక్కలు, 9 వ తరగతి ఇంగ్లీషు, ఉపవాచకం నిన్న మొన్నటి వరకు అందనేలేదు. జూనియర్ ఇంగ్లీషు టెక్స్టు యింత వరకు జాడేలేదు.

## పేద విద్యార్థుల దుస్థితి

మనరాష్ట్రంలో హరిజనుల్లో అక్షరాస్యులు 9 శాతం. గిరిజనులు యితర సంచారక జాతుల్లో 3శాతంలోపే. అయినా 6 లక్షలమంది హరిజన విద్యార్థుల్లో ఒకలక్షా నలభై వేలమందికే పుస్తకాలు సరఫరా జేశారట. గత సం॥ స్కాలర్‌షిప్ పొందిన వారు 65 వేలుకాగా అందులో 41674 మంది సంవత్సరానికి 18-30 రుల లోపు పొందినవారే. హైస్కూలు చదువు అభ్యసిస్తున్న హాస్టల్ విద్యార్థికి భోజనం నిమిత్తం వెచ్చిస్తున్నది రు. 40 లు మాత్రమే. అందుకే సారం చచ్చిన తిండీ - పచ్చి పులుసు వారి ఆహారం. 10 చ.గ. చీకటి గదుల్లో ఏడుగురు లెక్కన విద్యార్థులు మ్రగ్గుతున్నారని, అనేక హాస్టళ్ళలో యిలాగే వుందని చంచల్ గూడా హాస్టల్ స్వయంగా సందర్శించిన హిందూ విలేఖరి 8-9-76 హిందూలో వ్రాశారు. అలాంటి వసతి సయితం అరులక్షల్లో 45 వేలమందికి మాత్రమే కల్పించబడ్డది. ఇలా ప్రతి సమస్యనూ సవిరంగా వివరిస్తూ పోతే ఇది వ్యాసంగాను గదా పుస్తకమై కూర్చుంటుంది.

## ఫీజుల బెడద

కులమత శక్తుల ఆధీనంలోని విద్యాలయాలన్నింటినీ ప్రభుత్వము స్వాధీనం జేసుకొని సక్రమంగా నిర్వహించాలనీ, ఈ లోగా ప్రైవేటు కాలేజీల ఫీజులు ప్రభుత్వ కాలేజీల స్థాయికి తగ్గించాలనే కోర్కెలోని సమంజసత్వాన్ని అధికార, అనధికార అభ్యుదయ గాముకులంతా సమర్థిస్తున్నా నేటికి దాని కతిగతీలేకపోగా ప్రైవేటుకళాశాలల్లో ఫీజులు ఆదేవనిగా పెరిగి పోతున్నాయి. ఉదా॥ ప్రస్తుత బి. యస్. సి విద్యార్థి లాబ్ ఫీజును 1974-75 తో పోలిస్తే గుంటూరు ఎ. సి. కాలేజిలో 80% జె. కె. సి. కళాశాలలో 88 23% టి. జె. పి. యస్. 54 25% పెరిగాయి. ప్రభుత్వ కళాశాలలో డిగ్రీ విద్యార్థి సం॥ మొత్తం మీద చెల్లించాల్సిన ప్రయోగశాల రుసుం రు 15 లు కాగా ఎ. సి. కాలేజిలో రు 270 లు 'డొనేషన్లు వసూలుజేసే యాజమాన్యాన్ని 'మీసా' క్రింద బుక్ జేస్తా'మని సింహ గర్జనలు వినవస్తున్నా గుంటూరు జిల్లా నర్సారావుపేట శ్రీ సుబ్బరాయ & నారాయణ కళాశాల అనుబంధ హాస్టల్ సీటుకోసం కనీసం రు 116/-లకు తగ్గకుండా నిలబెట్టి వసూలు జేశారు.

వైద్యకళాశాలల్లో సంవత్సరాదాయం రు. 12000/ లకు పైబడిన వారి పిల్లలే ఫీజులు చెల్లించాల్సివున్నా ఆర్ట్స్ కళాశాలల్లో నెలకు 360/ పైబడ్డ గుమస్తాల బిడ్డలుగూడా ఫీజులు చెల్లించాలి. ఎందుకీ వివక్షత? హైస్కూలు స్థాయిలో ఉచిత విద్య అమలులో వున్నా రు. 50 ల వరకు స్పెషల్ ఫీజులు కొన్ని స్కూళ్ళలో X తరగతికి రు 200 లు కంపల్సరీట్యూషన్ ఫీజు తప్పడంలేదు.

మన దేశంలో భావి పౌరులకు దాపురించనున్న భా-

విద్యార్థులకు వేర్వేరుగా మార్కులొచ్చే అవకాశముంది. కనుక ఈ క్రమంలో జరిగే నష్టాన్ని పూడ్చేందుకు ప్రవేశ పెట్టబడ్డదే ఈ మోడరేషన్. ఈ విషయాన్నే 'సర్వే ఆన్ ఎగ్జామినేషన్స్ ఇన్ యిండియా' అనే గ్రంథంలో అనేక ఉదాహరణలతో ధృవీకరించినట్లు తేది 11-10-76 దినపత్రికల్లో వెల్లడైంది.

10 సమాధాన పత్రాలను అనుభవజ్ఞులైన 90 మంది ఉపాధ్యాయులు దిద్దినతర్వాత సర్వే జరుపగా ఒకరు చెత్తగా పేర్కొన్న పత్రాన్నిమరొకరు అత్యుత్తమైనదిగా ఎంపిక చేశారట ఒకరు ప్రథమశ్రేణిగా పేర్కొన్న పత్రాన్ని మరొకరు అధమశ్రేణిగా తేల్చారట! ఇలాంటి ఆశ్చర్యదాయకమైన అనేక ఉదాహరణలు ఆపత్రికలలో వచ్చాయి. కనుక పరీక్షల్లో ఫెయిల్, పాస్ అన్నవి ప్రతిభ వల్లనే కాకపోవచ్చని అదృష్టమనీ, ఎగ్జామినర్ దయ అనీ అనేక సర్వేలలో వెల్లడయిందని తెలియజేశారు కనుకనే ఫెయిలయ్యే విద్యార్థులకు జరిగే అన్యాయాలను అరికట్టేందుకు మోడరేషన్‌వుండాలని ఆ గ్రంథ రచయితలైన డా॥ ఏడ్విన్ హార్పర్, డా॥ విద్యాసాగర్‌మిశ్రాలు సూచించారు. వాస్తవాలిలా వుండగా మోడరేషన్‌ని కాపీలు గొట్టడంతో సమానంగానో' దయాధర్మ భిక్ష'గనో బాధ్యులు భావించడం భావ్యంగాదు.

ఎలాగైతేనేం? మోడరేషన్ తగ్గించబడ్డది. ఫలితంగా అనేకస్కూళ్ళకు, కళాశాలలకు చావుబతుకుల సమరం ఆరంభమైంది నూతన విద్యార్థులకు స్వాగతం పలుకుతూ కొత్తశోభలతో కళకళ లాడవలసిన విద్యాలయాలు అసలే అంతంతగా అమాత్రం సీట్లకి చాలినంతమంది విద్యార్థుల్లేక వెలవెలబోయాయి. వెంటనే విద్యామంత్రిగారు రంగంలో కొచ్చి "ఎవరికి యిబ్బంది జరగనిరీతిలో కళాశాలలను మూసివేస్తామని "నిండు పేరోలగంలో దండిగాహామియిచ్చారు. (10-7-76 ఈనాడు)ఆమేరకు రాష్ట్రంలో జూనియర్ కళాశాలలను మూసివేశారు. మరో 10-15 మరణ శయ్యపైకెక్కాయి.అనేక స్కూళ్ళు అదృశ్యమయ్యాయి.

ప్రపంచ నిరక్షరాస్యతలో ఫస్ట్ ప్రైజ్ మనదేశానిది! కాగా దేశంలో అగ్రస్థానం ఆంధ్రప్రదేశ్‌ది! యిహ యీపరిణామమే సాగితే మనస్థానం చెక్కుచెదరదు.

అంతేకాదు వైఫల్యాల బాధ్యతనంతటినీ ఉపాధ్యాయుల కాపాడించి భావితరాలను రూపొందించే మహాశిల్పులుగా చరిత్రలో ఉన్నతస్థానాల నలంకరించిన ఉపాధ్యాయులను దేశద్రోహులవేవరకు వచ్చింది వ్యవహారం. విద్యాప్రమాణాలు పడిపోయాయనే ఈ ధోరణి యింతటితో ఆగినా కొంతబాగుండేది. కాని మరింత ముందుకుపోయి ఆవేదిలో హడావుడిగా 220 రోజులుగా వున్న పనిదినాలు 240 కి పెంచుతూ, రోజుకు అర్ధ గంటచొప్పున వ్యవధి హెచ్చించడము మూలంగా మరో 120 గంటలు, మొత్తంమీద 240 గంటల వ్యవధిని హెచ్చిస్తూ హుకుం జారీచేశారు. ("G' O MSNO' 749 తే.31-7-76)

ఈ నిర్ణయంలోగూడ వాస్తవికదృష్టితోకూడిన,శాస్త్రీయ ఆలోచన ఏమీలేదన్నది సుస్పష్టం. అరుగంటలు స్కూల్లో

గడిపిన విద్యార్థికి కలిగిన మానసికగ్లానిని పోగొట్టుకోవాలి. కోల్పోయినంత పెంపొందు చేసుకోవాలి.

ఇతర నోట్సులు, కాంపోజిషనులు వ్రాసుకోవాలి, సైన్స్ బొమ్మలు గీసుకోవాలి. ఏరోజు పాఠాలు ఆ రోజు చదువుకోవాలి ఆరోగ్య సూత్రాలకను గుణంగా ఆహార పానీయాలు, విశ్రాంతి తీసుకోవాలి. చుట్టు పల్లెగ్రామాలనుండి కాలినడకన వచ్చే విద్యార్థుల అవస్థలు యిహ చెప్పనక్కరలేదు. మరో ముఖ్యాంశ మేమిటంటే ఉచర్యమూలంగా సాయంత్రము ఆటలకు కేటాయించిన వ్యవధి ఆదరణలో హరించుకుపోయింది. ఒలింపిక్ క్రీడలలో మనదేశానికి సిద్ధించిన విశ్వవిఖ్యాత ప్రఖ్యాతి తర్వాత గూడ క్రీడా రంగానికి పీసమెత్తు విలువివ్వకుండా విద్యార్థులను పుస్తకాలపురుగులుగా మార్చ యత్నించడము దురదృష్టకరం. ఇదిలావుండగా రోజుకు రెండు పరీక్షలు ఇప్పటివరకు అమలు జరుగుతున్న పద్ధతికి భిన్నంగా 76 సెప్టెంబరులో జరిగిన సప్లిమెంటరీ పరీక్షలు 10వ తరగతివిద్యార్థులకు రోజుకు రెండేసి నిర్వహించి, చదివిన రెండేళ్ళ సిలబస్‌నిగూడ తిరిగి నెమరు వేసుకునేవ్యవధి లేకుండాజేశారు. యీవిషయమై వంపుకున్న వేలాది విద్యార్థుల మహజర్లు, తీర్మానాలు చెవిటివాని ముందు శంఖూదిన చందమే అయింది. యింటర్ మీడియేట్ విద్యార్థులకు కూడా మొదటరోజుకు రెండు పరీక్షలు జరుగుతాయని ప్రకటించి కొంత ఆందోళన తర్వాత ఒక్కటే జరుప నిశ్చయించారు. కాని 10 వ తరగతికి మాత్రము అమలు జరిగింది. వారికి జరిగిన నష్టాన్ని తగు మోడరేషన్ యిచ్చి పూడ్చవలసిన కనీస బాధ్యత ప్రభుత్వంపై వున్నది పొరపాటు ఆ రూపేణా సవరిస్తారని ఆశిద్దాం

యిలా అర్థం పర్థంలేని మార్పుల మూలంగా వేలాది విద్యార్థులు తప్పొట్లు జేస్తూ ప్రమాణాలు పడిపోయాయని ప్రచారం జేయడం, అందుకు అశాస్త్రీయ పరిష్కార మార్గాలను చేపట్టడం విచారకరం.

మానవుడు మంచుయుగాలు గడిచాడు. గుహాంతర వాసాలు చాలించి గ్రహాంతర యానాలు జేస్తున్నాడు. చుక్కలను కొలుస్తున్నాడు. దిక్కులను శాసిస్తున్నాడు. విశ్వ రహస్యాలను ఛేదిస్తున్నాడు. నాలుగేళ్ళనాడు చంద్రలోక అధినేత అయిన మానవుడు నేడు 28 కోట్ల మైళ్ళ దూరంలో వున్న అంగారక గ్రహంపై రోదసీ నౌకను కాలు మోపించాడు. కృత్రిమజీన్ రూపకల్పనలో కృతకృత్యుడయ్యాడు. కొమ్ములు తిరిగిన నియంతలనే ఖంగు తినిపించి తుక్కచావు కెరజేశాడు: మేటి సామ్రాజ్య వాదులను మట్టి గరిపించాడు. అలాంటి యుగంలో మనమున్నాం. మానవుడు సాధించిన అద్వితీయ విజయాలతో పోలిస్తే మన సమస్యలు అత్యల్పమైనవి. అభేద్యమైనవి గాదు. కాని కావలసిందల్లా చిత్తశుద్ధి, దృఢదీక్ష, మొక్కవోని పట్టుదల, అందుకు అభ్యుదయ కాముకులంతా సన్నద్ధం గావడం మినహా మన సమస్యలకు మరో పరిష్కార మార్గం లేదు

వర్ధిల్లాలి ! విద్యార్థి - ఉపాధ్యాయ ఐక్యత.

సాధిస్తాం ! శాస్త్రీయ విద్యావిధానం.

ఐక్య ఉపాధ్యాయ

# మన పాఠ్యగ్రంథాలు - తీరు తెన్నులు - 2

## గ్రంథకర్తల కుస్తీల మధ్య విద్యార్థి నలుగుడు

— శ్రీ యమ్.వి. బసవయ్య,
ఉపాధ్యక్షుడు, గుంటూరుజిల్లా, యు.టి.యఫ్.

కాలం మారుతోంది. కాలానుగుణంగా ప్రపంచ పరిణామాలను దృష్టిలో నిడుకుని సిలబసులు మారుతూవుంటాయి. దానితో పాఠ్యగ్రంథాల రచనావిధానం మారాలి. పాఠ్యగ్రంథం విద్యార్థికి కరదీపిక. పాఠ్యగ్రంథాలలో పీఠికలకు, విజ్ఞప్తులకు అచ్చువేసే పేజీలకు బదులు, ఆ సిలబసును ముద్రిస్తే, ఆపాఠ్యగ్రంథము సిలబసుకు అనుగుణంగా వ్రాయబడిందో, లేదో ఉపాధ్యాయుడు తెలిసికొంటాడు. అలా లేని భాగాలను ఉపాధ్యాయుడు జతపరచి బోధించడానికి వీలవుతుంది. మన పాఠ్యగ్రంథాలలో ఇది ఒక లోటు.

రచయితలకు ఒక అవగాహన వుండాలి. తాను వ్రాయబోయే పాఠ్యగ్రంథానికి, లోగడ క్రింది క్లాసులలో, ఇతర సబ్జక్టులలో వ్రాయబడి, విద్యార్థి చదివిన గ్రంథానికి సంబంధం సమన్వయం వుండాలి. కాన గ్రంథకర్త క్రింది క్లాసులపుస్తకాలు చదవాలి. మన గ్రంథ కర్తలకు ఆ ఓపికాలేదు, శ్రద్ధాలేదు. కనీసం తాము వ్రాసేదానిలో గూడా నిర్దుష్టతలేదు. ఉదాహరణకు కొన్ని విషయాలు పరిశీలిద్దాం.

9వ తరగతి సాంఘిక శాస్త్రం చూద్దాం, ఇది 404 పేజీల ఉద్గ్రంథం ఖరీదు 7-00. దీనిలోని విషయం ఇనుపగుగ్గిళ్లే విద్యార్థి వయస్సుకు, అవగాహనకు మించినది. ఉపాధ్యాయుడు ఇంత కఠినమైన సిలబసును లెక్చర్ మోడల్‌లో ఎక్స్‌ప్రెస్ స్పీడులో వెళితేనే పోర్షన్ అవుతుంది. సోషల్ స్టడీస్ ...కు హుషారుగా ముందడుగు వేయవలసిన విద్యార్థి, నిరుత్సాహంతో ...తున్నాడు.

కొన్ని విషయాలలో 10వ తరగతి గ్రంథకర్తలకు ఇత...కు తేడా లెప్పలెప్పటు గలవో లోగడ చూశాం.

నాగార్జునసాగర్ : 9వ తరగతి సాంఘికశాస్త్రము 139 పేజీ ...వు 1450 మీ. ఎత్తు 112.8 మీ. కుడికాలువ 444 కి.మీ. ...కాలువ 225 కి.మీ; 6వ తరగతి తెలుగులో ఎత్తు 124 ...దావు 5 కి.మీ. పొడవు; కుడికాలువ 426 కి. మీ; ...లువ 226 కి.మీ.

...గాకు: (15వ పేజీ) సిగరెట్టు, బీడీ పరిశ్రమ.పొగాకు ...సి, ఎండబెట్టి గ్రేడ్ ప్రకారం వేరుచేసి, ప్యాక్ చేసే ...లు గుంటూరు, బాపట్ల, నరసరావుపేట మరియు కృష్ణా ...నూ, ప. గో. జిల్లాలోనూ, తూ. గో. జిల్లాలోనూ వున్నాయి బాపట్లలో ఎక్కడున్నయ్ ? ప్రకాశం జిల్లాలో చీరాల, టంగుటూరు మొదలగుచోట్ల గలవుగదా? చెప్పలేదేమి?

నగరాలు : (169 పే) 'సాధారణంగా లక్ష అంతకంటే ఎక్కువ జనాభావున్న ప్రదేశాన్ని 'నగరం అంటారు. 1971 లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో ఇట్టాంటి నగరాలు పద మూడు ఉన్నాయి.' అదే పుస్తకం 171 పేజీలో 1971 సం॥ జరిగిన జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో 207 నగరములున్నవని తెలిసినది.

అగ్బరు మంత్రి తోడర్‌మల్ భూమిశిస్తు మూడవ వంతు పంట ధాన్యరూపంలో వసూలు చేశాడు (234 పే) శివాజీ శిస్తు వసూలు విధానములో తోడర్‌మల్లు ప్రవేశపెట్టిన విధానం అనుసరించినాడు (240 పే) 6 వత సాం. శా. (169 పే)- శివాజీ భూములను కొలిపించి పంటలో $\frac{2}{4}$ వంతు శిస్తు వసూలు చేసెను.

కబీరు : (244 పే) ఇతడు పుట్టుకచేత మహమ్మదీయుడు. 6వ తరగతి సాంఘికశాస్త్రము (120 పే) అతడు ఒక బ్రాహ్మణ వితంతువుకు జన్మించి, మహమ్మదీయునిచే పెంచబడినాడు. (7వ తరగతి హిందీ 4వ పేజీ) కబీరు ఇతనియొక్క తల్లిదండ్రుల విషయం తెలియదు. ఇతనిని నీరూ మరియు అతని భార్య నీమా అనువారు పోషించిరి. నీరూ ఒక సాలెవాడు.

కుతుబ్‌మీనారును కుతుబుద్దీన్ ప్రారంభించినాడు. ఇతని అల్లుడు ఇల్‌టుట్‌మష్ పూర్తి చేసినాడు (250 వ పేజీ) 6వ సాంఘికశాస్త్రము (10వ పేజీ) ఢిల్లీలో నున్న కుతుబ్‌మీనార్‌ను కుతుబుద్దీన్ కట్టించెను. 4వ తరగతి సాంఘిక శాస్త్రము (136 పేజీ) 13వ శతాబ్దంలో ఇల్టిమష్ అనుసుల్తాను తన మతగురువైన కుతుబుద్దీన్ గౌరవార్థం 'కుతుబ్‌మీనార్' అనే స్తంభాన్ని నిర్మించాడు.

రెండవ ప్రపంచ యుద్ధము- (1939-46)లో సంభవించినది. షుమారు ఏడు సంవత్సరముల యుద్ధం జరిగింది. (9 త. సాం. 393 పే). 1946 వరకు జరిగిందా? 10 వ సా. శా. (212 పే)- 1945 ఏప్రిల్‌కు ఇటలీ, జర్మనీలు విరమించుకొన్నవి. 1945 సెప్టెంబరు 2న జపాన్ లొంగిపోయినది. (203 పే)- రెం. ప్ర. యుద్ధము 1939 లో ప్రారంభమయి, 1945 ఆగస్టు వరకు జరిగినది. (320 పే)- కొన్ని గ్రామాలు కలసి పంచాయితీ సమితులు, జిల్లాలకి జిల్లాపరిషత్తులూ ఏర్పడతాయి వీటికి మూడేసి సంవత్సరాల కొకసారి ఎన్నికలు నిర్వహిస్తారు. 5 సం॥ ల కొకసారి గదా? జిల్లాబోర్డుల కాలం గుర్తుకొచ్చిందా ఈ రచయితలకు?

(324 పే) లో- రెండు గ్రామాలకి కలిపి ఒక విలేజి వర్కరు వుంటాడు ఇది లోగడ పేరు. ప్రస్తుతం విలేజి డెవలప్‌మెంటు ఆఫీసరు అనాలి. (వి. డి. ఓ)

(344 పే) '1969 లో జాతీయ కాంగ్రెసు రెండు పార్టీలుగా చీలిపోయింది. ఈ రెండు పార్టీలూ సామ్యవాద సిద్ధాంతాన్నే అనుసరిస్తున్నాయ్.' ఈ చరిత్రకారునికి ఈ అవగాహన ఏ విధంగా కలిగిందో? దీనిని బట్టి దేశంలో ఇంకా అతివాద పార్టీలు అనవసరమే. అయితే ఆ రెండు పార్టీలవారే

ఒకరినొకరు ఫాసిస్టులనీ, ప్రజాస్వామ్యాన్ని మంటగలిపేవారనీ దూషించుకొంటున్నారుగదా ? ఎవరు సామ్యవాదులూ ?

## సిద్ధాంత వక్రీకరణలు

(330) 'అధిక ధరలకి కొంతవరకు వినియోగదారులే బాధ్యులని చెప్పక తప్పదు' ఈ సిద్ధాంతం ఎక్కడిదో ? పెట్టుబడిదారులు అధిక లాభాపేక్షతో ధరలు పెంచుచూ, ఈ పలుకులు పల్లిస్తున్నారు. దానినే రచయితలు పలుకుచూ 'కొనకుండా వుంటే ధరలు పెరగవు' అని ఆర్గ్యుమెంటు చెప్పుచున్నారు. ఇది ఆచరణకు విరుద్ధం.

(344 పే) "సోషలిస్టు సిద్ధాంతానుసరించి ఉత్పత్తి సాధనాలను సమాజంతరపున ప్రభుత్వం నిర్వహించాలి ప్రైవేటు వ్యక్తుల స్వాధీనం నుంచి ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి" మన రాజ్యాంగ లక్ష్యం సామ్యవాదమని, సామ్యవాద లక్ష్యం పీడనను అంతమొందించడమని చెప్పిన రచయితలు (337 పేజీలో ఈ రకంగా వచించారు.

"మన దేశంలోని పబ్లిక్ రంగంలోని పరిశ్రమలు ముఖ్యంగా ఉక్కు కర్మాగారాలు నష్టదాయికంగా ఉన్నాయి. జాతీయం చేయడమే ప్రధాన ఉద్దేశ్యం గాదు. కనుక సమర్థవంతంగా పనిచేస్తున్న ప్రైవేటు సంస్థలకి తగిన ప్రోత్సాహం లభించాలి. పబ్లిక్ రంగం, ప్రైవేటు రంగం దేశాభివృద్ధిలో భాగస్వామ్యం స్వీకరించాలి. ఒకవైపు సామ్యవాదం కావాలి పీడన తొలగాలి అంటూనే ప్రయివేటురంగం అభివృద్ధి కావాలనడం సామ్యవాదమా ?

10 వ తరగతి సాంఘిక శాస్త్రములో (336 పే) క్రొత్త వక్రీకరణ, భాష్యాలు చెప్పారు. సామ్యవాద సమాజ స్థాపనకు రెండు మార్గాలు. (1) ప్రజాస్వామ్యం సామ్యవాదం బ్రిటన్, భారత్ వంటి దేశాలు ప్రజాస్వామ్య సామ్యవాద స్థాపనకు కృషి చేస్తున్నవి. (2) సంపూర్ణాధికార సామ్యవాదము-రష్యా, చైనా, తూర్పు యూరప్ దేశాలుస్థాపించాయి. 'ప్రజాస్వామ్య సామ్యవాద విశిష్ట లక్షణమేమిటంటే - వ్యక్తి స్వేచ్ఛకు ఎలాంటి భంగం కలుగకుండానే శాంతియుతంగా, - నైతిక ప్రబోధం ద్వారా, స్వచ్ఛందంగా, అతనికి తోటి మానవులపై దయ, జాలి, సానుభూతి, ప్రేమానురాగాల్ని కలిగించి...' శాసనాల ద్వారా ఏర్పరచెదరు.

ఈ విధంగా సామ్యవాదం సాధిస్తారా ? ప్రబోధనల ద్వారా శ్రీ వినోభాభావే ఎంత భూమి పంచారు ? దయ, జాలి, సానుభూతి, ప్రేమానురాగాలుంటె కార్మికులకు ఉద్యోగులకు కనీస న్యాయం జరుగుతోందా ? ధరలు ఎందుకు పెరుగుచున్నయ్ ? పేదవాడి భూమిని కూడా భాగ్యవంతుడే లాక్కొనే సమాజానికి జాలి. దయ ఎక్కడున్నాయ్ ? ఇది సామ్యవాద స్థాపన సిద్ధాంతాన్ని వక్రీకరించడమే. సామ్యవాదమని చెబుతూ, దాన్ని అమలు జరగకుండా చూడటానికి విద్యార్థిని తయారు చేస్తున్నామన్న మాట.

(ఈ పాఠ్యగ్రంథాలలో, తమాషా లింకా వున్నవి. వచ్చే సారి చూద్దాం.)

# డి. ఏ. పెంపుదలను గత మార్చి నుండి అమలు జరపాలి

## యు. టి. ఎఫ్ విజ్ఞప్తి

కరువుభత్యంపై పెంపుదలను 1975 మార్చి నుండి యు జి.సి. స్కేళ్లను అందరికీ అమలు జరపాలని ప్రభుత్వాన్ని కోరుతూ యు. టి. ఎఫ్ ప్రకటించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు ఉద్యోగులకు కరువు భత్యం, కాలేజీ అధ్యాపకులకు యు జి. సి. వేతనాలు అమలు జరుపుటకు నిర్ణయించి ప్రకటించారు.

రు. 300 వరకు జీతం వచ్చే వారికి ప్రస్తుతపు 43 శాతాన్ని, 50 శాతంగా రూ. 248/-లు మించకుండాను; రూ. 300-900 మధ్య జీతం గల వారికి ప్రస్తుతపు 32 శాతాన్ని 37 శాతంగా రూ. 148/-కి తగ్గకుండాను, ఆ పైవారికి మరి కొన్ని మార్పులు చేర్పులతో యీ పెంపుదల వర్తింపజేశారు,

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు రూ 300 లు జీతం వరకు $53\frac{1}{2}$ శాతం ఆపైవారు $39\frac{1}{2}$ శాతం 1-3-75 నుండి పొందుతున్నారు మన రాష్ట్ర ప్రభుత్వం, అంతకంటె $3\frac{1}{2}$ $2\frac{1}{2}$ శాతం తక్కువగా 20 నెలల తరువాత 1-10-76 నుండి అమలు జరపతలపెట్టారు.

రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకుయేనాడు కరువుభత్యం పెంచినా కేంద్రఉద్యోగులతో సమంగాగాని, వారికి యిచ్చిన తేదీ నుండిగాని అమలు జరగటంలేదు, ఈ పెరిగిన దానిలో సగం నిర్బంధ డిపాజిట్ పథకముకకు పోగా అత్యధికులకు వాస్తవంగా చేతికి వచ్చేది రూ 10 లు మాత్రమే.

అలాగే పెన్షన్ దారులు 1969 నుండి లిబరలైజుడు పెన్షన్ వస్తుందని ఆశతో ఎదురుచూస్తూ వుంటే 73 తరువాత వారికి మాత్రం కొద్దిగా అదనపు సహాయం లభించడం నిరాశనే కలిగించింది.

కాలేజీ అధ్యాపకులు చిరకాలంగా ఎదురు చూస్తూన్న యు జి.సి వేతనాలు, అందరికి బేషరతుగాకాక, అర్హత, సర్వీసులు ప్రాతిపదికలపై అమలు జరుపుతాననటం వారిలో అత్యధికుల నిరాశ కల్గించింది, ఒకప్రక్క విభేధాలు తొలగించి ఒకే కే[illegible] వుండాలంటూనే వేతనాలలో వ్యత్యాసాలు కల్పించడం [illegible] లేదు. 9 వేల మంది 5 సంవత్సరములలో రిసెర్చి డి[illegible] సంపాదించాలనడం, లేనిచో ఇంక్రిమెంట్లు వుండవు అన[illegible] ఆచరణ సాధ్యమేమో ఆలోచించాలి. యు. జి. సి. 1[illegible] నుండి యివ్వాలని సిఫార్సు చేయగా 1976 నుండి జరపడం, విధించిన షరతులు కారణంగా యీ [illegible] ఎవరికి 50 రూపాయలు మించి వుండక పోవచ్చు.

ప్రభుత్వం పునరాలోచించి, కరువుభత్య[illegible] ఉద్యోగులతో సమంగా 1975 మార్చి నుండి అమలు [illegible] యు. జి. సి. స్కేల్సు ఎట్టి విపక్షత లేకుండా అందరి[illegible] జరపాలని కోరుచున్నాము.




# జి. వో. కు విరుద్ధంగా జరిగిన అక్రమంబదిలీలు నిలుపుదలచేయాలి

## రాజధానిలో అధికారులతో యు. టి. యఫ్ రాయబారాలు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తరపున, హైదరాబాదులో, విద్యాశాఖా డైరక్టరు, డిప్యూటీ డైరక్టరు తదితరులను కలసి, ఉపాధ్యాయుల సమస్యలపై 76 అక్టోబరు 8 వ తేదీని రాయబారములు జరపుట జరిగింది.

కర్నూలు, ఖమ్మం, తూర్పుగోదావరి మొదలగు జిల్లాలలో ప్రభుత్వ ఉత్తర్వులకు విరుద్ధంగా జరిగిన అక్రమ బదిలీలు వెంటనే రద్దుచేయాలని. ట్రయిబిలు వెల్ఫేరు ఉపాధ్యాయుల జీతములు గ్రాంటు వెంటనే రిలీజు చేయాలని, ఉపాధ్యాయులను కుటుంబ నియంత్రణ కేసులు తేవాలని నిర్బంధించుట, జీతములు నిలుపుదలచేయుట జరుగుచున్నందున అట్టి అధికారులపై తగు చర్యలు తీసుకోవాలని, స్టయిపెండరీ పోస్టు ఉపాధ్యాయుల జీతములు చెల్లించాలని, వరంగల్లు హిందీ శిక్షణా తరగతులనుండి అక్రమముగా తొలగించిన వారిని వెంటనే చేర్చుకోవాలని, కొత్తగూడెం పట్టణంలో క్వార్టర్సు వెంటనే ఉపాధ్యాయులకు యిచ్చుటకు తగుచర్య గైకొనాలని, కంటిన్‌జెంటు గ్రాంటు రిలీజు చేయాలని, తెలుగు తదితర పండితులందరికి వెంటనే శిక్షణా తరగతులు నిర్వహించాలని, ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతములు, కరువుభత్యం వెంటనే చెల్లించాలని హిందీపండితుల జీతాలుచెల్లించుటకు కంటిన్యుటీ ఉత్తర్వులివ్వాలని మొదలగు సమస్యలపై మెమొరాండములు యిచ్చి చర్చలు సాగించబడినవి.

రాయబార వర్గంలో శాసనమండలి సభ్యులు శ్రీ యం. మాధవరావు శ్రీయుతులు ఎ. వెంకటస్వామి(ప్రధానకార్యదర్శి) యం. వరహాలు( కార్యదర్శి ) వి సత్యనారాయణ (నల్గొండ జిల్లాకార్యదర్శి) టి. వెంకటరావు (ఖమ్మం జిల్లా కార్యకర్త) మొ॥ వారు గలరు.

---

## సవరణ

76 సెప్టెంబరు సంచికలో 20 వ పేజీలో అమృతలూరు సమితి సంఘానికి ఎన్నికైన కార్యదర్శులలో "శ్రీ కె. గంగాధరరావు" అనుటకు బదులు "శ్రీ వై. శ్రీధరరావు, బి.ఏ., బి.యిడి. అని చదువుకోవాలి.

## గుంటూరు జిల్లా గ్రేడ్ I హిందీ పండితుల విజ్ఞప్తి

గుంటూరు జిల్లాపరిషత్‌లో పనిచేస్తున్న షుమారు 160 మంది హిందీ పండితులకు 1976 మార్చినుండి జీతాలు లేవు. ఎంతో ఆందోళన ఫలితంగా జి. ఓ. యమ్ యస్. నెం. 876 ఎడ్యుకేషన్ 8-9-76, మరియు జి. ఓ. యం. యస్. నెం. 880 ఎడ్యుకేషన్ 10-9-76 ప్రకారం 31-8-76 వరకు మాత్రమే ఇటీవల ఆరు నెలల తర్వాత జీతాలివ్వటం జరిగింది. మళ్ళీ 1976 సెప్టెంబరు నుండి పోష్టులు కంటిన్యూ చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు లేనిదే జీతాలివ్వటానికి వీలు లేదని పరిషత్ అధికారులు అంటున్నారు. గత ఆరు నెలనుండి రాష్ట్రంలోని ఇతర జిల్లా పరిషత్తులు జనరల్ ఫండ్స్ నుండి జీతాలు చెల్లిస్తుండగా గుంటూరు జిల్లా పరిషత్ అధికారులు మాత్రం అలా చెల్లించటానికి నిరాకరించటం జరిగింది. ఈ కరువు రోజుల్లో జీతాలు రానికారణంగా ఆ ఉపాధ్యాయులు ఎన్నో యాతి బాధలకు గురి అయ్యారు. పులిమీద పుట్రలా నేటివిటీ జి. ఓ బదిలీలకు గురయి అనేక కష్టనష్టాల పాల య్యారు. ఆ దుస్థితి నివారణకు రాష్ట్ర జనరల్ కౌన్సిల్ సందర్భంలో జిల్లాకు చెందిన హిందీ పండితులు పలువురు 29-9-76 న శ్రీ యం. జె. మాణిక్యరావు, (యమ్. యల్. సి) అధ్యక్షతన గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూల్లో సమావేశమై 'తమ పోష్టులు పర్మినెంట్ చేయాలనీ, వాటినీ కంటిన్యూ చేస్తూ వెంటనే ఆర్డర్లు ఇవ్వాలనీ, ఈ లోగా జిల్లాపరిషత్ జనరల్ ఫండ్సునుండి గానీ, రాష్ట్ర ప్రభుత్వ విద్యానిధినుండి గానీ నెల నెలా జీతాలు అందేట్లు ఉత్తర్వులు ఇప్పించవలసిందిగా ముఖ్యమంత్రికీ, డైరెక్టరుగారికీ, జడ్. పి. ఛైర్మన్ గారికి విజ్ఞప్తి పత్రాలపై సంతకాలు చేసి పంపటం జరిగింది. రాష్ట్ర యు. టి. యఫ్ జనరల్ కౌన్సిల్ వారి విజ్ఞప్తిని బల పరుస్తూ తీర్మానించింది. రాష్ట్రంలోని గ్రేడ్ I హిందీ పండితులందరూ తమ సమస్య శాశ్వత పరిష్కారానికి సంఘటితం కావలసిందిగా శ్రీ యం. వెంకటరత్నం (జడ్. పి. యస్ హెడ్మాష్టరు, రాష్ట్ర కౌన్సిలర్, యు టి.యఫ్) కోరుతున్నారు.

గ్రేడ్ I హిందీ పండితుల జీతాల చెల్లింపు, అక్రమ బదిలీల సర్దుబాట్లు, సర్వీసు రెగ్యులరైజేషన్, సెకన్ గ్రేడ్ ఫిక్సేషన్, ప్రమోషన్ పొందిన గ్రేడ్ I తెలుగు పండితులకొత్త స్కేలులో రీఫిక్సేషన్, ఎయిడెడ్ మరియు మునిసిపల్ టీచర్ల సెలక్షన్ గ్రేడ్, యాజమాన్య కక్షాచర్యలకుగురయిన శ్రీ రాయన్న, వీరయ్యగార్ల జీతాల చెల్లింపు మొదలగు సమస్యలపై గుంటూరు జిల్లా యు టి.యఫ్. శాఖ ఆధ్వర్యాన శ్రీ జడ్. పి ఛైర్మన్ గారిని, శ్రీ డి యి ఓ. గారినీ కలిసికొని సంప్రదించటం జరిగింది. అధికారులు సావధానంగా విని సమస్యా పరిష్కారానికి తమ తోడ్పాటు తెలయజేశారు, త్వరలో ఎయిడెడ్ సమస్యలపై కోఆర్డినేషన్ మీటింగు జరపటానికి శ్రీ డి. యి. ఓ గారు నిర్ణయం తెలిపేరు. ఆ రాయబారవర్గంలో శ్రీ యం. మాధవరావు(యమ్. యల్. సి) శ్రీ కె. నారాయణరావు (రాష్ట్ర యు టి. యఫ్. అధ్యక్షులు), శ్రీ ఎ. వెంకటస్వామి (రాష్ట్ర సంఘ ప్రధాన కార్యదర్శి) శ్రీ టి. అంజిరెడ్డి (జిల్లాసంఘ ప్రధాన కార్యదర్శి) గార్లు పాల్గొన్నారు.

## వివిధ శాఖల నూతన నిర్మాణం

గుంటూరు జిల్లా కౌన్సిల్: 29-9-76 తేదీన గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూలునందు శ్రీ సి. హెచ్. గోపాలరాజు అధ్యక్షతన, ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ గుంటూరు జిల్లా శాఖ నూతన కౌన్సిలు సమావేశం జరిగింది.

రాష్ట్ర యు టి. యఫ్. ఉపాధ్యక్షులు శ్రీ యన్. సీతారామాచారిగారు సందేశమిచ్చారు. జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ టి. అంజిరెడ్డి కార్యదర్శి నివేదిక, ఆర్థిక రిపోర్టు ప్రవేశపెట్టారు. చర్చల అనంతరం సభ్యులు వానిని ఆమోదించిరి.

పిమ్మట శ్రీ యమ్. రాయన్న అధ్యక్షులుగా, శ్రీ టి. అంజిరెడ్డి ప్రధాన కార్యదర్శిగా శ్రీ యన్. వి. బసవయ్య, శ్రీ బి. కోటేశ్వరరావు శ్రీ యి. అప్పారావులు ఉపాధ్యక్షులుగాను, సి. హెచ్. గోపాలరాజు, శ్రీ వి. విశ్వనాధం, శ్రీ వై. యల్. నారాయణ కార్యదర్శులుగాను, మరి 11 మంది సభ్యులతో జిల్లా నూతన కార్యవర్గం ఏర్పడింది.

పనిగంటలు పనిదినాల పెంపుదల విద్యార్థుల మన స్తత్వమునకు విరుద్ధంగా యుండినందున విద్యాభివృద్ధికి తోడ్పడజాలదని, హిందీ పండిట్స్‌కు సర్వీసు కంటిన్యూటీ ఉత్తర్వులు, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు హెచ్. ఆర్. ఎ ఫామిలీ బెనిఫిట్ స్కీము, 1044 జి ఓ లను వర్తింప చేయాలని, వివిధ తీర్మానాలు ఆమోదించారు.

### మోదుకూరు సమితి – నల్గొండజిల్లా

మోదుకూరు సమితి యు టి యఫ్. సమావేశం బుజిలాపురంలో 19-9-76న శ్రీ జి రాజిరెడ్డి గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ జి. జయప్రతాపరెడ్డి ఆహ్వాన సంఘ నివేదిక శ్రీ సి హెచ్. పిచ్చిరెడ్డి సమితిశాఖ నివేదిక సమర్పించారు.

ఆ సమావేశానికి రాష్ట్ర నాయకులు శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ కె. నారాయణరావు, శ్రీ యం. నరహరి, శ్రీ జి. లక్ష్మయ్య, జిల్లా సంఘ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ పి. కృష్ణమూర్తి శ్రీ పి. సత్యనారాయణలు పాల్గొని సందేశాలిచ్చారు.

నివేదికలు ఆమోదించిన పిమ్మట శ్రీ జి. రాజిరెడ్డి అధ్యక్షులుగా శ్రీ యం. మధుసూదనరెడ్డి ఉపాధ్యక్షులుగా శ్రీ జి. సంజీవరెడ్డి ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె కృష్ణమూర్తి శర్మ కార్యదర్శిగా మరికొంతమంది కార్యవర్గ సభ్యులుగా సంఘ నిర్మాణం జరిగింది పిదప వివిధ తీర్మానాలు ఆమోదించారు. సమావేశాలకు 40 మంది ప్రతినిధులు వచ్చారు.

ఇబ్రహీంపట్నం : హైదరాబాద్ జిల్లా, ఇబ్రహీంపట్నం శాఖ శ్రీ యం. నరహరి (జిల్లా ప్రధాన కార్యదర్శి)గారి పర్యవేక్షణలో సమావేశమైంది. సమితిశాఖ కార్యదర్శి శ్రీ బి. ప్రతాపరెడ్డి గారు గత సం॥పు కార్యక్రమాలను గూర్చియు గత సం॥పు ఆర్థిక నివేదికను సమర్పించిరి. అనంతరం శ్రీ బి ప్రతాపరెడ్డి అధ్యక్షులుగాను, శ్రీ యం. మార్క్ కార్యదర్శిగాను, సమితిశాఖ కౌన్సిలర్లుగా శ్రీ యం. అంజయ్య, శ్రీ డి. రామకిషన్‌రావు, శ్రీ యం. ముత్యాలు, శ్రీ ఎ. బాలకిష్టయ్య, శ్రీ కె. రాజేశ్వరరావు; జిల్లా కౌన్సిలర్లుగా శ్రీ యం. మార్క్, శ్రీ యం. డి. యూసుఫ్, శ్రీ జి. దేవదానుగార్లు ఎన్నుకోబడిరి.

## ఖమ్మం, తిరుమలాయపాలెం, మధిరసమితులలో బదిలీలలోని అవకతవకలు

### స్పెషల్ ఆఫీసరుతో యు. టి. యఫ్.

ప్రతినిధివర్గం చర్చలు:– ది 15-8-1976 న ఖమ్మంలో, ఖమ్మం, మధిర, తిరుమలాయపాలెం, కల్లూరు, అశ్వారావుపేట సమితుల స్పెషల్ ఆఫీసరు శ్రీ శ్యామలరావుగారిని యు. టి, యఫ్. ప్రతినిధివర్గం వారి నివాసంలో కలుసుకొని ఖమ్మం, తిరుమలాయపాలెం, మధిర సమితులలో ఇటీవల 429 జి ఓ లోని అంశములకు విరుద్ధంగా జరిగిన కేసులను వారి దృష్టికి తెచ్చి చర్చించారు. అంగవైకల్యంగల ఉపాధ్యాయులను సమితి లోతట్టు పాఠశాలలకు బదిలీ చేయుట, సీనియర్ ఉపాధ్యాయులను జూనియర్ క్రింద పనిచేసే పరిస్థితి కల్పించడం, పెద్యార్థులు తరగతుల వారినికూడా బదిలీ చేయుట, 6, 9 నెలలలో రిటైర్ కావలసివున్న ఉపాధ్యాయులను కూడా బదిలీ చేయుట తిరుమలాయపాలెం సమితిలో 40% నకు మించి బదిలీలు చేయుటజరిగినదని, ఈ లోపములను వెంటనే నివారించుటకు చర్యలు తీసికోవలసిందిగా కోరనైనది

వారు సావధానంగా విని, సమస్యల అవగాహనకోసమై వివరంగా చర్చించి పరిస్థితిని అవగాహన చేసికొన్నారు. అంగవైకల్యంగల ఉపాధ్యాయుల బదిలీలను నిలుపుదల చేయు విషయమై చర్య తీసికొనగలమని, స్వల్పకాలంలో రిటైర్ కానున్న ఉపాధ్యాయుల విషయం సమితి బి డి.ఓ లతో సంఘ పక్షాన చర్చించి, అవి సహేతుకమైనవి కావున రద్దు చేయించుకోవలసిందిగాను ఆ విధంగా సమితి అధికార్లు చర్య తీసుకొంటారని, భార్యాభర్తలను ఒకేచోట వుంచుటకు ప్రయత్నించినట్లు ఇంకా మిగిలివున్న వాటిని కూడా పరిశీలించగలనని వాగ్దానంచేశారు. మిగిలిన సమస్యలను తాము సమితి సమావేశమును ఏర్పాటు చేసినప్పుడు సంఘ ప్రతినిధులు వచ్చినట్లయితే ఆయా సమితి అధికారుల సమక్షమున సమస్యలపై చర్చించి వెంటనే తగు చర్యలు తీసికొని పరిష్కరించుటకు హామీ నిచ్చారు. వారికి ఉపాధ్యాయుల యెడల సానుభూతి వైఖరిని ప్రతినిధి వర్గం హర్షిస్తోంది. ప్రతినిధివర్గంలో శ్రీ జి లక్ష్మయ్య, శ్రీ వి. మల్లికార్జునరావు శ్రీ ఆర్ పురుషోత్తమరావు, శ్రీ వి నరసయ్య గారలు పాల్గొన్నారు.

### విశాఖజిల్లా, నక్కపల్లి సమితిలో యు. టి. యఫ్

విశాఖ జిల్లా నక్కపల్లి సమితి కార్యకర్తల సమావేశం సెప్టెంబరు 3 న రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీ పి జి ముత్తారావు అధ్యక్షతన జరిగింది. ఈ క్రింది వారితో నక్కపల్లి సమితికి తాత్కాలిక కార్యవర్గం ఏర్పరచ బడింది. అధ్యక్షుడు శ్రీ యం. వీరభద్రరావు, ఉపాధ్యక్షుడు శ్రీ యం. డి. ఖాదర్ భాషా, శ్రీ డి. పైడిరాజుగార్లు, ప్రధానకార్యదర్శి శ్రీ యం. విశ్వనాథశాస్త్రి, కార్యదర్శి శ్రీ డి. వి. నరసింహమూర్తి మరి 5 గురు కార్యవర్గసభ్యులుగా కమిటీ ఏర్పడింది. సభ్యత్వ కాంపెయిన్ సాగించుటకు, ప్రతిపాఠశాలకు ఒక ఐక్య ఉపాధ్యాయ పత్రిక తెప్పించుటకు కార్యక్రమం తీసుకొన్నారు.

# ప్రభుత్వ ఉత్తర్వులు

( డి. ఎ. పెంపుదల ఉత్తర్వు )

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Allowances-Dearness Allowance-Increase in existing rates-Orders-Issued.

FINANCE & PLG. (PRC. I) DEPARTMENT

G. O. Ms. No. 428, Dated: 29-9-76

Read the following :-

1. G. O. Ms. No. 320, Finance (PC) Department Date. 27-12-73.
2. G O. Ms. No. 370, Finance & Planning (Fin. Wing-PRC. I) Department Date. 16-12-75,

ORDER :-

Government have decided that the rates of ad-hoc Dearness Allowance sanctioned in the G. O. cited shall be revised as follows ;-

| Pay range | | Revised rate of D. A. per month |
|---|---|---|
| Up to Rs. | 300/- | 50% of pay subject to maximum of Rs 148/- |
| Above Rs. 300/- and up to Rs. | 900/- | 37% of pay subject to a minimum of Rs. 148/ and maximum of Rs. 323/- |
| Above Rs. 900/- and up to Rs. | 920/- | Amount by which pay and adhoc D A. falls short of Rs. 1,223/- |
| Above Rs. 920/- and up to Rs. | 2,250/- | Rs. 303/- with marginal adjustments at higher pay levels so that pay plus adhoc D A does not exceed Rs. 2,400/ |

NOTE :- (i) The payment on account of adhoc D. A shall be rounded off to the nearest 10 paise

(ii) Pay for this purpose shall be as defined in para 2 of the G O 2nd cited.

2 The adhoc D. A. now sanctioned shall be admissible to all categories of personnel viz.. Government servants, Teaching and non-teaching staff of Aided Schools and Colleges. Panchayat Samithis. Zilla Parishads and Municipalities, all other employees of Gram Panchayats, Panchayat Samithis, Zilla Parishads and Municipalities Cotingent Staff and Work-charged establishment who get monthly wages. The Adhoc D. A. now sanctioned will not, however, be taken into account for purposes of calculating "Contingencies" to Aided Educational Institutions under grant-in-aid code.

3. Government have also decided that all Village Officers and Village Servants shall be given an adhoc increase of Rs. 5/- per month.

4. The above orders shall take effect from 1st October 1976.

5. The increase in D. A. sanctioned subsequent to the Additional Emoluments (Compulsory Deposit) Act, 1974 (Central Act 37 of 1974) shall be subject to the provisions of the Act., i.e. the difference between the D. A. now sanctioned and the D A. in accordance with the G. O. 1st cited above shall be subject to the provisions of the Act.

6 All the Departments of Secretariat and Heads of Departments are requested to take prompt steps to provide additional funds under the relevant heads of account.

(By order and in the name of the Governor of Andhra Pradesh)

B. P. R. VITHAL.
Secretary to Government.

(డి.ఎ. లెక్కింపుకు స్పెషల్ పే కూడ పరిగణనలోనికి తీసుకోవాలి)

GOVERNMENT OF ANDHRA PRADESH

Finance & Planning (Fin. Wing. PRG) Department

Circular Memo No. 441/PRG/111/76-1

Dated. 9—7—1976

Sub :- Allowance-Dearness allowance-Adhoc increase-applicability on special Pay-instructions issued.

Ref :- Govt. Memo. No. 63/P. C /74-1 Fin (P. C ) Department Dated 18—1—74. 2. G. O. Ms. No. 180/Finance & Planning (PRG) III Depts. Dated. 15—7—75

In the Para 2 (2) of Memo 1st cited instructions have been issued that special Pays, if any, should not be clubbed with pay for purpose of determining the quantam of adhoc dearness allowance. Dearness allowance merged pay structure was in the offing and it was not known at that time as to what D. A. would get merged in the D. A merged scales of pay. Since the Dearness allowance as on 31—12—73 only has been merged in the D. A. merged scales of pay introduced in the G. O 2 cited, a question has arisen whether the special pay can be taken into consideration for purpose of determining the quantum of adhoc D. A. sanctioned at percentage rate with effect from 1—1—1974.

After careful consideration of the above aspect, Government here by direct that the adhoc Dearness Allowance sanctioned at percentage rates may be allowed on the special pay also The monitary benefit of counting special pay towards Adhoc D.A. shall be allowed from 1-5 1975 the Date from which the benefit of revised scales ordered in the G. O. 2nd cited has been allowed.

(Sd.)
B. P. R. Vithal,
Secretary to Government.

(1969 కి పూర్వం సాహిత్య సుధాకర అభ్యర్థులకు
ట్రయినింగు అవకాశం)

## PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL EDUCATION, ANDHRA PRADESH, HYDERABAD.

Rc. No. 4314/S2/76 Dated. 13—10—1976

Sub :- Hindi-Pandits Training-Warangal District Admission of Candidates with qualification of Sahitya Sudhakar of Bombay Hindi Vidyapeeth into Senior Hindi Pandits Training During 1976-77 at Government College of Education Warangal Revised orders-Issued.

Read :- 1. Director's post Copy of the Telegram Rc. No. 4314/S2/76 dated 5—10—1976.
2. Lr. Dt 8—10—1976 of Sri. M. Madhava Rao, M. L. C.

In super-cession of the orders issued in the Director's reference Ist read above, the principal Government College of Education Warangal is permitted to allow admission into senior Hindi Pandits Training course to such of the in Service teacher candidates who had passed the examination of Sahitya Sudhakar of Bombay Hindi Vidyapeeth. by 1969 and who were appointed prior to 9—7—75 (i. e. the date of issue of the orders withdrawing recognition of the said qualification) provided they satisfy the other conditions stipulated for their admission into the senior Hindi Pandits Training course.

Sd.
C. Markandeya Sastry,
for Director of School Education.

(ఏజన్సీ అలవెన్సు ఎయిడెడ్, పంచాయితీరాజ్ ఉపాధ్యాయులకు
వర్తింపు)

Government of Andhra Pradesh
Abstract

ESTABLISHMENT—Sanction of Special Allowance to teachers of Panchayat Raj bodies and teaching and non-teaching staff of aided schools working in Agency areas-Instructions-Issued.

Education (H) Department

G. O. Ms. No, 882 Dated: 13-9-1976

Read the following:

G. O. Ms. No 754 Revenue dt 7-8-1969.
2. Govt. Memo No. 4830 A1/69-2 (Rev) dt 9-12-1969.
3. G. O Ms. No. 609 P.R. (Estt. IV) dt. 6-9-1971.

Order :

In the G. O. Ist. cited, Government sanctioned a special allowance equal in amount to the Class III special pay admissible under the Manual of Special Pay and Allowances to all the Government servants whose headquarters are located in the Scheduled areas. In the memo, second cited Government authorised the District Collectors to sanction the special allowance to the Government employees. As the arduous nature of living and working conditions, duties and responsibilities are equal among all employees working in the Scheduled areas irrespective of the department to which they belong Government in the G.O. 3rd cited ordered that whatever procedure and consequential benefits apply to Government servants as laid down in the G. O. 1st cited for fixation and payment of agency allowance shall be made applicable to Panchayat Raj employees also working in Panchayat Raj institutions in Agency areas including the staff in the tribal Development Blocks subject to certain conditions.

2. It has been represented that the teaching-staff of Panchayat Raj bodies and teaching and non-teaching staff of aided schools may be given the benefit of agency allowance as the arduous nature of the living and working conditions are equal among all employees working in the Scheduled areas.

3. Government after careful examination direct that the teaching staff of non-Government schools (i.e. Panchayat Raj bodies and private-aided schools) shall be eligible to a special allowance equal in amount to the Class III special pay admissible under the Manual of Special pay and allowances as per the orders issued in the G. O. 1st cited.

4. This order takes effect from the date of issue of this order.

5. The expenditure involved in this regard shall be met from the head of account to which the expenditure on their salaries is debitable. The Heads of Departments are requested to include the additional expenditure in the Supplementary estimates for 1976-77.

6. This order issues with the concurrence of Finance & Planning Department vide their U. O. No 2709/1888/EE/76—1 dt 10—9—'76.

The receipt of this orders should be acknowledged.

(By Order and in the name of the Governor of Andhra Pradesh.)

C. Srinivasa Sastry,
Secretary to Government.

(బ్రాంచి పోస్టుమాస్టర్ల బదిలీలు నిలుపుదలపై వివరణ)

Government of Andhra Pradesh
Panchayati Raj Department
Memorandum No. 3704/Establishment, III/76-2,
Dated 6-9-1976

Sub - Establishment - Education - Teachers - Panchayat Samithis - Transfer of teachers who are holding the posts of Branch Post Masters - Further instructions - Issued.

Ref - 1. Govt. Memo No. 3704/Estt. III/76-1, dated 28-7-1976.

2. From Sri M. J. Manikya Rao, M. L. C. letter dt 2-9-76.

In the reference first cited orders have been ssued by the Government to the effect that in cases of teachers who are also functioning as Branch Post Masters at their present places, they may be allowed to continue for two years at their present places and in the meanwhile the postal authorities should be requested to make alternative arrangements for the posts of Branch Post Masters.

It has been represented to Government that some of the teachers who were holding the posts of Branch Post Masters were already transferred even before the issue of Government orders in the reference first cited.

Government have examined the matter carefully and in the interest of the public, they direct that the teachers who are holding the post of Branch Post Master and who have been already transferred to some other places prior to issue of orders in the reference first cited, be transferred to their original places provided that no alternative arrangements for the post of Branch Post Masters in those places had been already made by the postal authorities.

The Special Officers of Panchayat Samithis are requested to take necessary action immediately.

N. K. SETH
Secretary to Government.

( హిందీ పండితుల పోస్టులు కంటిన్యూ ఉత్తర్వులు )

Government of Andhra Pradesh

Abstract

Hindi - 1,433 Grade I and 2,072 Grade II Hindi Pandits posts under local bodies - Further continuance of the posts from 1-3-1976 to 31-8-1976 - Orders - Issued.

Education (E. 1) Department

G. O. Ms. No. 880. Dated the 10th Sep. 1976
Read the following.

i. G. O. Ms. No. 236 - Education - Dated 3-3-1976.

ii. From the Director of School Education, Lr. Rc. No. 2544-S2/76, dated 26-6-1976.

Order

Sanction is accorded to the contiruance of 1,433 Grade I and 2,072 Grade II Hindi Pandits' posts, last continued in the G. O. first read above for a period of six months i. e., from 1-3-1976 to 31-8-1976 under various managements as mentioned in the annexure to this Order, with the usual scales of pay and allowances.

2. The expenditure shall be debited to the following heads of accounts -

In respect of Hindi pandits posts in the High Schools under the management of Zilla Parishad and Municipalities.

"277. Education - B Secondary (e). Assistance to local bodies for Secondary Education - (i) Teaching grants to Municipalities - 9 Grants-in-aid and
(ii) Teaching grants to Zilla Parishads - 9. Grants-in-aid"

In respect of Hindi Pandits' posts in Primary and Upper Primary Schools under the managements of Municipalities and Panchayat Samithies.

"277, Education-A. Primary (d) Assistance to local bodies for Primary Education - (i) Teaching grants to municipalities - 9. Grants-in-aid and
(ii) Teaching grants to Panchayat Samithies -
9 Grants-in-aid."

3. This order issues with the concurrence of Finance & Planning (E E) Department - vide their U.O. No. 2746/1916/E.E/76-1, dated the 7th September, 1976.

(By order and in the name of Governor of Andhra Pradesh)

B. Ramachandra Reddy
Dy. Secretary to Government.

Annexure

| Name of the management, | Posts of Hindi Pandits Grade I | Grade II |
|---|---|---|
| (1) | (2) | (3) |
| Zilla Parishad | 1,392 | 697 |
| Municipal Secondary Schools | 41 | 32 |
| Panchayat Samithis | — | 1.233 |
| Municipal Primary Schools | — | 100 |
| Total | 1,433 | 2,072 |

( హిందీ పండితుల పోస్టులు కంటిన్యూ ఉత్తర్వులు )

Government of Andhra Pradesh

Abstract

Hindi Pandits - 400 Hindi Pandits' posts created during 1974-75 under Centrally Sponsored Scheme (Fifth Plan) - Further continuance of the posts during 1976-77 - Orders - Issued.

Education (E) Department

G. O. Ms. No. 876 - Edn. Dated 8-9-1976
Read the following

1) G. O. Ms. No. 190 - Edn, dated 26-2-1975
2) G. O. Ms. No. 941 - Edn, dated 2-8-1975.
3) From the Director of School Education, Lr. Rc. No. 598/S2/76, dated 7-7-1976.

Order.

Sanction is accorded to the continuance of 400 Hindi Pandits' posts (150 Grade I) Rs.320-5[illegible]) and 250 Grade II (Rs 290-520) as shown in the annexure I to this order for a further period from 1-3-1976 to 31-10-1976, The posts were last

continued in the G. O. 2nd read above. The posts shall carry the usual allowances as admissible under the rules in force.

2. The posts are eligible for 100% Central assistance under Plan. The Director of School Education shall claim Central assistance from the Govt. of India at the appropriate stage after obtaining necessary certificate from the Accountant General, A. P., about the actual expenditure incurred.

3. The expenditure on continuance of the posts shall be debited to the heads of account shown in the Annexure-II to this order.

4. This order issues with the concurrence of Finance & Planning (E.E) Department, Vide their U. O No. 2631/1831/EE/76-1, dated 4-9-76.

(By order and in the name of the Governor of Andhra Pradesh)

B. Ramachandra Reddy,
Deputy Secretary to Government

Annexure-I

| Management | Coastal Andhra Gr.I | Gr,II | Rayala Seema Gr.I | Gr.II | Telangana Gr.I | Gr.II | Total Gr.I | GrII |
|---|---|---|---|---|---|---|---|---|
| Government | 12 | 8 | 6 | — | 54 | 27 | 72 | 35 |
| Zilla Parishad | 13 | 1 | 8 | 9 | 22 | 22 | 43 | 32 |
| Municipalities | 5 | 9 | 1 | 1 | — | — | 6 | 10 |
| Panchayat Samithies | — | 51 | — | 29 | — | 51 | — | 131 |
| Aided | 15 | 16 | 6 | 7 | 8 | 19 | 29 | 42 |
| Total | 45 | 85 | 21 | 46 | 84 | 119 | 150 | 250 |

Annexure-II

In respect of the posts in Govt. Secondary Schools for Boys & Girls. "277 Edn. B Secondary Schemes included in the V Five year Plan (b) Government Secondary Schools — C. S. S. Development of Hindi. (iii) Maintenance of the posts of Hindi Pandits in Government Secondary Schools for Boys and (iv) Maintenance of Hindi Pandit posts in Government Secondary Schools for Girls."

In respect of the posts in Non-Government Secondary Schools. "277-Edn. B. Secondary—Schools included in the V Five Year Plan (c) Assistance to Non-Government Secondary Schools U. C. S. S. Development of Hindi (iii) Maintanance of Hindi pandits posts 9. Grant-in-aid.

In respect of posts in local bodies for Secondary Schools. "277-Education—B Secondary—Schemes included in the V Five Year Plan (d) Assistance to local bodies for Secondary Education U. C. S S —development of Hindi (VI) Maintenance of Hindi Teachers posts in Secondary Schools of Zilla Parishads— 9. Grant-in-aid and (VII) Maintenance of Hindi pandits posts in Municipalities 9. grants-in-aid."

# జీవిత చందాదారులు



**శ్రీమతి జి లలితాదేవి,**
కారేపల్లి, ఖమ్మంజిల్లా



**శ్రీమతి బి. సీతాకుమారి,**
వి. వి పాలెం, ఖమ్మంజిల్లా



**శ్రీమతి యమ్. భారతి,**
ద్వారకానగర్, ఖమ్మం



**శ్రీ జి మల్లయ్య,**
నెక్కొండ, వరంగల్ జిల్లా



**శ్రీ యస్. వి. సుబ్బయ్య,**
చేబ్రోలు, గుంటూరుజిల్లా



**శ్రీ జి. వెంకటేశ్వరరావు**
జూలకల్లు, గుంటూరుజిల్లా



**శ్రీ పి. సూర్యనారాయణ,**
వేంద్ర, ప॥ గో॥ జిల్లా



**శ్రీ రుద్రరాజు భీమరాజు,**
రాజోలు పంచాయితీసమితి అధ్యక్షులు, తూ॥ గో॥ జిల్లా



**శ్రీ కె. రామిరెడ్డి,**
ఎర్రగుట్టపల్లి, ప॥ గో॥ జిల్లా

